# భారతి

మాసపత్రిక



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



సెప్టెంబర్ 1970



సంపుటము : 47 : సంచిక : 9 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1970

# నీలీరాగం

శ్రీ ఇంద్రగంటి భానుమూర్తి

[విప్రలంభ శృంగారం నాలుగు విధాలు. అందులో ఒకటి పూర్వరాగ విప్రలంభం. పూర్వరాగ విప్రలంభంలోని ఒక భేదం నీలీరాగం. నీలీరాగం అంటే—

న చాతి శోభతే యన్నాపైతి ప్రేమ మనోగతిం।
తన్నీలీరాగ మాఖ్యాతి యథా శ్రీరామసీతయోః॥]

పువ్వు ఆకు దాటదు
ఆకు చెట్టు దాటదు
చెట్టు తోట దాటదు
ఆకూ, చెట్టూ, తోటా
అదో ఎద్దని జగత్తు.
అందులో,
ఆకూ,
ఆకు దాటు పువ్వూ,
విడీ విడని నవ్వూ
అదో తెలియని అందం!
కనిపించే ఆ కన్నె పువ్వులో
కనిపించని వలపు ఏదో ఏదో!

* * * *

చెరివోక చెట్టునా ఉన్న
చిలకకీ గోరవంకకీ
జతకట్టారు—
చక్కగా కల్యాణపు బొట్టు పెట్టారు.
చిలకా గోరవంకా,
లోకం ముద్దుపడే జంట అన్నింటా—

ముద్దుని చిలకేమో సిగ్గుగా నవ్వుతుంది
ఆ చిలకనిచూసి గోరవంక ఎంతో ముద్దులు పెడుతుంది—

గోరవంక,

చిలక కులుకుకన్నా,
చిలక పలుకుకన్నా,
చిలక మంచి మనసుపై మనసు పడుతుంది—

చిలక,

తన మనస్సులోనేమో
గోర్వంక కొత్త కస్తూరి బొమ్మ, కడుతుంది—

ఎవ్వరూ చూడకుండా,

చిలక, గోరవంక గుండెల్లో
మంచి ముత్యాలదండ జార విడుస్తుంది—

మరెవ్వరికీ తెలియకుండా,

గోరవంక, చిలక మనస్సులో
పచ్చిపగడాల దండ జారుస్తుంది—
కనిపించని గుండెలకే
కనిపించే సౌందర్యం, ఏదో ఏదో!

* * * *

ఒక్కొక రాగం, ఒక్కసారి భగ్గుమని
ఎఱ్ఱగా వయస్సు కంటుకొని
ఆకాశం అందుకొంటుంది—
అంబరమంతా అంటుకొంటుంది—
చెట్లపూలమీదా, వెన్నెల గాలిమీదా, ఏకాంత రాత్రిమీదా
చిత్రంగాపడి వెలిగిపోతుంది—

అకాలవర్షా మేఘంలాగే అతివిచిత్రంగా చెరిగిపోతుంది.
మరి ఒక్కొక రాగం, అపస్వరం లేని స్వరచిత్రంలా
చల్లగా తనువంతా ఆవహించి,
మనసంతా మంచులా వికసించి,

# నీలీ రాగం

బ్రతుకులో ఒక తియ్యని విప్లవం రచించి
అనునిత్యం మారుమోగుతూ అట్లాగే నిలిచిపోతుంది.

*    *    *    *

కనిపించే కన్నె పువ్వులో
కనిపించని పరిమళ ప్రవాహం ఎంతో !
కనిపించని గుండెలకే
కనిపించే అందంలోని అందం ఎంతటిదో!
నీకు తెలియదు, నాకు తెలియదు—
లోకంలోని ఎవ్వరికీ తెలియదు—

ఆ పన్నీరు పువ్వు,
కాదు ఆ కన్నీరు పువ్వు,
ఒక సీతకే తెలుసు !

పన్నీరు పువ్వువంటి ఒక సీతనుచూసి
మంచుపడ్డ మనసుగల ఒక రాముడికి తెలుసు !

వారిది ఒక విచిత్రరాగం—
అది భగ్నం మండిపోదు,
అది తియ్యని విప్లవం రచించలేదు.
అది ఎవ్వరికీ వినిపించని రాగం !
అది ఎవ్వరికీ కనిపించని రాగం !
దాని పేరు నీలీరాగం !

---



# వర్ణన సౌందర్యము*

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

మహాకవి చేసిన నగర వర్ణనము చూచిన మీదట ఆలంకారికులు కావ్యమున వర్ణనీయాంశములుగ నిర్దేశించిన సముద్ర పర్వతములు, ఋతువులు, చంద్ర సూర్యోదయములు, ఉద్యాన జలక్రీడలు, మధుపాన రతోత్సవములు, విప్రలంభము, వివాహము, కుమారోదయము, మంత్రము, ద్యూతము, ప్రయాణము, యుద్ధము, నాయకాభ్యుదయము అను తక్కిన పదునేడు విషయములును మనకు జ్ఞాపకము వచ్చును. పోను పోను ఆలంకారికులు ఈ అంశములను పెంచి, ఇరువది రెండింటిని కొందఱును, ఇరువది నాల్గింటిని మఱికొందఱునుచెప్పి వీనిలో కొన్ని అముఖ్య విషయములను విడచినను కావ్యసమగ్రతకు హానిలేదని వక్కాణించిరి. ఈ చేర్పబడిన వానిలో వేట, పుణ్యాశ్రమము, కన్యాసౌందర్యము, దౌహృదము అను నంశములు కాళిదాస కావ్యములలో కాన్పించును.

ఈ యీ వర్ణనములు తన రచనములలో చొప్పించి తీరవలయునను చాపలము కాళిదాసునకు లేకున్నను, కథాక్రమమున పూర్వోదాహృతములలో కొన్ని వర్ణనములు ధారావాహికముగ కాళిదాస కావ్యములందు మనకు ప్రత్యక్షములగుచుండును.

కాళిదాసు ఋతువర్ణనము విశిష్టమైనది. ఋతుశోభాచిత్రణమున కొక కావ్యమునే ప్రత్యేకించుటను, అందలి అతని నిసర్గభావమాధురిని, మనము ముందుగా చవిచూచియే యుంటిమి. అందలి భావ బీజములే తరువాతి ప్రౌఢకావ్యములలో ఎట్లు పూచి, కాచి, ఫలించినవో ఆయా ప్రసక్తులందు దర్శింపగలము. అట్లే మేఘదూతమునంతటిని తన లోకోత్తర విప్రలంభ చిత్రణముతో నింపిన తీరు తీయములను మేఘదూత సందర్భమున చూచియే యున్నాము.

రఘువంశమున సముద్ర, ఉద్యాన, జలక్రీడలును మధుపానములును, వివాహ కుమారోదయములును, ప్రయాణ యుద్ధములును, మృగయా, పుణ్యాశ్రమ, దౌహృదములును వర్ణితములైనవి. కుమార కావ్యమున పర్వత కన్యాసౌందర్య వర్ణనములును, చంద్రోదయ సురతోత్సవ వర్ణనములును ప్రత్యేక రామణీయకముతో మనకు దర్శనమిచ్చును. ఇవియేకాక రఘుకావ్యమున వర్ణితములైన వసంత, వివాహ, మధుపాన, ప్రయాణాదులును ఇందున్నవి. ఆలంకారికులు నిర్దేశించిన పై వర్ణనములేకాక అసురపీడనము, భగవన్మహిమము, పట్టాభిషేకము, సత్పరిపాలనము, రాజనీతి, స్వయంవరము మున్నగు అనేకాంశములు కథాసంగతములై రఘుకావ్యమున దర్శన మిచ్చును.

మహాకవి చిత్రణములో మన కిపుడు సాక్షాత్కరించు సముద్రము నించుక చూతము.

రఘువంశము పదుమూడవ సర్గము.—

లంకనుండి సీతారాములు పుష్పకవిమానములో తిరిగి వచ్చుచుండగ, రామచంద్రుడు సీతకు సముద్ర సౌందర్యమును వర్ణించి చెప్పుచున్నాడు.

వైదేహి పశ్యామలయాద్విభక్తమ్
మత్సేతునా ఫేనిల మంబురాశిమ్ ।

---

* కాళిదాస కళా మందిరము—6

ఛాయాపథేనేవ శరత్ప్రసన్నమ్
ఆకాశ మావిష్కృత చారుతారమ్॥.

రఘు—13—2.

'సీతా ! ఇటు చూడుము. సేతు నిర్మాణముచే ద్విధా విభక్తమై మర్వులతో నొప్పుచున్న సముద్రము, శరత్కాలమున స్వచ్ఛమై, క్షీరపథముచే రెండుగా చేయబడి, నక్షత్రములతో పొలుచు ఆకాశము వలె నున్నది.'

సముద్ర మనగనే ఈ పురాణోక్తులు జ్ఞాపకము వచ్చుట సహజము.

గర్భం దధ త్యర్కమరీచ యోఽస్మాత్
వివృద్ధి మత్రాశ్నువతే వసూని ।
అబింధనం వహ్ని మసౌ బిభర్తి
ప్రహ్లాదనం జ్యోతి రజ న్యనేన॥.

ఈ సముద్రమునుండియే సూర్యకిరణములు గర్భము ధరించుచున్నవి. దీనియందే పలువిధములైన రత్నసంపద వృద్ధి నొందుచున్నది. ఈ సముద్రమే నీటి నాహరించు ఒక మహాగ్నిని భరించుచున్నది. మానవశ్రేణిని ఆనందమున నోలలార్చు రేరాజుకు ఇదియే పుట్టినిల్లు.

ఈ క్రింది గంభీర సముద్రదృశ్యము భయసంభ్రమములతో దర్శనీయమైనది! 'తిమిమత్స్యములు జలజంతువులతోగూడ నదులనుండి వచ్చు నీటిని పీల్చి, చప్పరించుచు, తమ తలలపైనున్న రంధ్రములగుండ నీటిధారలను చివ్వున ఎగజిమ్ముచున్నవి.' 13—10.

ఈ దృశ్యము కాళిదాస భావనలోని మెఱపు.

'నీటియేనుగులును, మొసళ్ళును, సముద్రమున ఎగిరి పడుచుండగా వాని ముఖములకు రెండు వైపులను అంటుకొన్న నురుపుముద్దలు క్షణకాలము రెండు చెవులచెంతను కట్టిన వెల్లచామరములవలె వెలుగొందుచున్నవి.' 13—11.

కొందఱు విమర్శకులు ఈ సముద్రవర్ణనము ప్రక్షిప్తమై యుండవచ్చుననియు, ఇందు కాళిదాస కవితాసంపత్తి అంతగా కాన్పింపదనియు ఆక్షేపించిరి. పరిశీలింపగా ఇది ప్రక్షిప్తమైనట్లు కాన్పింపదు. సముద్రతీర సందర్భమున ఈ కవి సహజముగ స్మరించు పండ్లబరువుతో వంగిన పోకచెట్లును, (ఫలావర్జితపూగమాలమ్) 13.17; సూర్యకిరణములు సముద్రమునుండి జలమయగర్భము ధరించుటయును, (గర్భమ్ దధతి అర్కమరీచయః అస్మాత్) 13.4; మున్నగు నంశములు ఇచ్చటకూడ ప్రసక్తములైనవి. ఎంత ప్రతిభావంతుడైనను స్వీకరించిన అన్ని అంశములను ఒకే విస్ఫూర్తితో వర్ణించుట సాధ్యము కాకపోవచ్చును. అంతమాత్రముచే ఆ భాగము ప్రక్షిప్తమనుటకు వీలులేదు. అంతియేగాక పూర్వోదాహృతములైన పద్యములలోని ఉక్తిచాతుర్యములో కాళిదాసముద్ర కాన్పించుచునేయున్నదిగదా !

కాళిదాసు ఋతుప్రసక్తి అనన్యసాధారణ కల్పనానములసితము. పాలలో నీటివలె కథతో కలసిమెలసి వేర్పరుపరాని పొందికతో గూడియుండును. ఆ వర్ణనమును వెడలించిన కథలో నొకవెలితియును, మాంద్యమును పొడగట్టును.

భారవి కిరాతార్జునీయములో చేసిన శరద్వర్ణనము అతని భావనాశక్తికి నిదర్శనమును, రమ్యమును అయినమాట నిజమే. కాని, దానికి కథతో యథోచితముగ కలసిపోవు పొందిక కుదురలేదు. అర్జునుఁడు శరచ్ఛోభను చూచుచు తపస్సునకు పోయినాడను సంబంధముదప్ప ఆ శరత్తున కచ్చట చెప్పదగినంత సందర్భశుద్ధిలేదు. తొలుత పార్థుడు శరత్సౌందర్యము చూచినాడని చెప్పుటతో తనివి తీరక, మరల యక్షునిచేగూడ కవి శరద్వర్ణనము చేయించి ఆ సర్గము నంతటిని దానితో సరిపెట్టెను.

శిశుపాలవధమునందలి ఋతువర్ణనము కృతకమై తప్పనిసరిగా ఒకచోట ఆరు ఋతువులను

ప్రక్రమ్మరించినది. అందును విరహి మన్మథప్రసంగములు దప్ప ఋతుప్రభావము ప్రకృతిలోచేసిన శిల్పము గాని, భావవైవిధ్యముగాని మృగ్యము. అంతియే గాదు. కాళిదాసు రఘువంశ నవమ సర్గమున కిది ద్రుతవిలంబితవృత్తముతోగూడ చేసిన వ్యాఖ్యాను కరణము. ఈ ఋతుప్రసంగము తీసివేసినను, ప్రధాన కథకు ఇంచుకంతయు లోటురాదు.

రఘువంశమున చతుర్థ సర్గమునందు రఘురాజ్య ప్రస్తావమున శరత్తు వచ్చినది. రాజ్యమున స్థిరపడిన రఘురాజును పద్మచిహ్నితమైన శరత్తు రెండవరాజ్యలక్ష్మివలె ఆశ్రయించినదట!
4. 14.

శరదృతువు రాజుల కుద్యోగకాలము. దాని రాకతో వారి తేజస్సంపత్తి అతిశయించును. దానితో దాని తోడ్పాటుతో రాజులు విజయయాత్ర చేయుదురు. ఆ విషయమునే స్ఫురింపచేయుచు 'మేఘము లొకప్రక్క కొత్తిగిల్లగా ఆ రఘురాజుయొక్కయు సూర్యునియొక్కయు ప్రతాపము ఒక్కసారిగా దిక్కుల వ్యాపించినది' 4—15.

అని కవి శరద్వర్ణనమున కుపక్రమించెను.

'పుండరీ కాతపత్రస్తం
వికస త్కాశచామరః।
ఋతు ర్విడంబయామాస
న పునః ప్రాప తచ్ఛ్రియమ్॥'

తెల్లతామర పూలగొడుగుతో, రెల్లుపూల వింజామరలతో, శరదృతువు రఘురాజు ననుకరింప బోయినను, ఆతని శోభ దానికి రాలేదు.

హంస శ్రేణిషు తారాసు కుముద్వత్సు చ వారిషు।
విభూతయ స్తదీయానాం పర్యస్తా యశసా మివ॥

హంస పంక్తులందును, నక్షత్రములందును, తెల్లకలువలతోగూడిన స్వచ్ఛజలములందును, కన్పట్టు తళుక్కుబెళుకులు ఏమో? తెలియునా, అవి అందందు పరచుకొని విస్తరించిన రఘురాజుకీర్తి రమణీయతయే యైయున్నది.

'శరత్తునందు చెఱకుతోటలు సమృద్ధిగ నుండును. వాని నీడలందు కూరుచుండి సస్యపాలికలైన తియ్యబోణులు, బాల్యమునుండియు మొదలిడి రఘుచరిత్రను గానము చేయుచుండిరి' 4—20.

అగస్త్యనక్షత్రోదయము కాగానే నీరు కలక దేరి ప్రసన్నమైనది. రఘుశత్రుల మనస్సులు కలగి పోయినవి. 4—21.

మొత్తముమీద శరత్తు రఘుచరిత్రతో నెనరి పెనగి ఆతని శక్తికంటెను తానే ముందుగా ఆతనిని విజయయాత్రకు ప్రోత్సహించినదట. 'యాత్రాయై చోదయామాస తం శక్తేః ప్రథమం శరత్'॥

రఘువంశములో శరత్తు తరువాత కథా సందర్భమున దర్శన మిచ్చు వేఱొక ఋతువు వసంతము. ఋతుసంహారమునందలి వసంతముకంటె ఇందలి వసంతమున విషయవైవిధ్యమును, భావదీప్తియును ప్రముఖముగా కాన్పించును. దీనికంటెను కుమారసంభవమునందలి వసంతము భావోన్మీలనమునందును, కవితాసౌందర్యమునందును, ప్రౌఢతరముగా కాన్పించును. రఘువంశమునందలి వసంతమునకు కథతోనున్న పొత్తుకంటె, కుమారసంభవమునందలి వసంతమునకు కథతోడి పొందిక విశిష్టమైనది. సాధారణముగ రాజులు చైత్రవైశాఖములందు అరణ్యములకు వేట కేగుట పరిపాటి. కారణము—

జంతువులు ఆతపతాపమునకు ఒకచో నుండక స్వేచ్ఛాసంచారములు చేయుచుండుటచే వాని జాడ సుకరముగా కనుగొనవచ్చును. ఈ కారణమున దశరథుడు వసంతము వచ్చినపిమ్మట వేట కేగెనని చెప్పుట ఉపపన్నమైనది. కుమారసంభవమున శివ తపోభంగమునకు వచ్చిన మన్మథునితోగూడ వసంతము హిమసానువులందు ప్రవేశించినది. ఆ మన్మథుడును, ఆతని మిత్రుడు వసంతుడును, శివతపోవనభూమిలో ఎట్లు విజృంభించిరో కుమార కావ్యపు తృతీయ సర్గమున పరమకౌశలమున చిత్రింపబడినది.

# వర్ణన సౌందర్యము

రఘువంశమున 'సూర్యుడుత్తర దిక్కునకు పోదలచి తదభిముఖముగ సారథిచే రథమును త్రిప్పించి, ప్రాంతఃకాలమున హిమపాతము నరికట్టి, మలయ పర్వతమునుండి ప్రయాణము సాగించె'నని వసంతా విర్భావము వర్ణింపబడినది. కాని కుమార సంభవము నందలి వసంతప్రాదుర్భావము మఱింత చక్కగా నున్నది.

> కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ
> గంతుం ప్రవృత్తే సమయం విలంఘ్య
> దిగ్దక్షిణా గంధవహం ముఖేన
> వ్యలీక నిశ్శ్వాస మి వోత్ససర్జ॥

'సమయోల్లంఘనముచేసి సూర్యుం డుత్తరాభి ముఖుడుకాగా, దక్షిణదిక్కు దుఃఖముతోగూడిన నిట్టూర్పువలె, మలయపవనమును నిట్టూర్చు చున్నది.' ఈ వసంతపురాక సుఖాంతముకాక, మన్మథపత్నిదుఃఖములో నంతమగునని కవి సన్నగ సూచించెనా యనిపించును. ఇందలి శబ్దశక్తి మూలక మైన వాయికాధ్వని ఈ ఋతుప్రారంభమునకు క్రొత్తసొగసు తెచ్చినది.

రఘువంశమునందలి కింశుకపుష్పవర్ణనము కంటె కుమార కింశుక వర్ణనములో చమత్కార మున్నది. 'శిశిరము పోయిన వెంటనే మోదుగుచెట్ల యందలి మొగ్గలు రసోన్మత్తయైన స్త్రీ తన ప్రియునియందు చేసిన నఖరక్షతములవలె నున్నవి.' రఘు 9—32. సాధారణముగా నీ క్షతములు స్త్రీ ప్రయుక్తములుగాకంటె పురుషప్రయుక్తములుగా నుండుటయే కావ్యపరిపాటి. ఇందు రసోన్మత్త విశేషణము ఈ కృత్యమునకు సాధనమైనను, ఆ ధార్ష్ట్యము పురుషు లందుండిననే సొగసు. ఈ కింశుక వర్ణనము కుమార సంభవమున నిట్లున్నది. 'వికాసము నందని మోదుగుమొగ్గలు చంద్రవంకలవలె నుండి వసంతప్రియుడు అప్పుడే వనస్థలీప్రేయసులయెడల చేసిన నఖక్షతములవలె శోభించుచున్నవి.'

> బాలేన్దు వక్రా ణ్యవికాసభావాత్
> బభుః పలాశా న్యతిలోహితాని
> సద్యో వసన్తేన సమాగతానాం
> నఖక్షతా నీవ వనస్థలీనామ్. కు. 3—29.

రఘువంశమున వసంతములోని గానము తీగ లను మరపించి, అచ్చముగ రమణీమణుల సంగీత కోలాహలముగా పొడగట్టును.

> శ్రుతిసుఖ భ్రమర స్వనగీతయః
> కుసుమకోమల దంతరుచో బభుః
> ఉపవనాంతలతాః పవనాహతైః
> కిసలయైః సలయై రివ పాణిభిః॥
> ర. 9—36.

ఇంపైన తుమ్మెదరొదలగానములతో, పువ్వుల దంతశోభలతో, ఉద్యానలతలు గాలికి చివుళ్లు కదలు చుండగా, చేతులతో లయవేయుచు పాడుచున్న ట్లుండెను.

దీనికి పైమెరుగుగానున్న కుమారసంభవము నందలి, ఈ లతావృక్షానుబంధము దర్శింపదగినది.

> 'పర్యాప్త పుష్పస్తబక స్తనాభ్యః
> స్ఫురత్ప్రవాళోష్ఠ మనోహరాభ్యః
> లతావధుభ్య స్తరవో ప్యవాపుః
> వినమ్ర శాఖాభుజ బంధనాని॥. కు. 3-39.

నిండైన పూలగుత్తుల పాలిండ్లతో ఎఱ్ఱని చివురు పెదవులతో నొప్పుచు లతాసుందరులు వృక్ష ప్రియులను కౌగలించుకొనిరి. ఇందలి అచేతనముల కును కల్గిన మన్మథవికారము రసవంతముగదా!

ఋతుకావ్యమునందును, కుమార కావ్యము నందును వర్ణింపబడని, ఒక శృంగారచేష్ట రఘు కావ్యమున దర్శన మిచ్చును.

> అనుభవం నవ దోల మృదూత్సవమ్
> పటు రహః ప్రియకంఠజిఘృక్షయా।
> అనయ దాసనరజ్జు పరిగ్రహే
> భుజలతాం జలతా మబలాజనః
> రఘు. 9—51.

వసంతమున ప్రేయసీప్రియులు ఉయ్యాల లెక్కి ఊగుచున్నారు. స్త్రీలు దోలారజ్జువును గట్టిగా పట్టు

క్రొనగల్గినను ఆ పట్టువదలి భయపడు నెపమున ప్రియులను కౌగిలించుకొనుచున్నారు.

కుమార కావ్యమున వసంత వర్ణనము శిఖ రాయమాణము. మానవ మానవేతర ప్రాణులలో ఉచ్చస్థితినందిన రాగాతిశయ వర్ణనము అనితర సాధారణము.

> కాష్ఠాగత స్నేహ రసానువిద్ధం
> ద్వంద్వాని భావం క్రియయా వివవ్రుః॥
> కు. 3—35.

అనిచెప్పి కొన్ని రసవద్దృశ్యములను చిత్రించెను.

> మధు ద్విరేఫః కుసుమైక పాత్రే
> పపౌ ప్రియాం స్వా మనువర్తమానః॥
> శృంగేణ చ స్పర్శ నిమీలితాక్షీమ్
> మృగీ మకండూయత కృష్ణసారః॥
> కు. 3.36.

> దదౌ రసా త్పఙ్కజరేణుగన్ధి
> గజాయ గణ్డూషజలం కరేణుః॥
> అర్ధోపభుక్తేన బిసేన జాయాం
> సంభావయామాస రథాఙ్గనామా॥
> కు. 3—37

> గీతాంతరేషు శ్రమవారిలేశైః
> కించి త్సముచ్ఛ్వసిత పత్రరేఖమ్ ।
> పుష్పాసవాఘూర్ణిత నేత్రశోభి
> ప్రియాముఖం కింపురుష శ్చుచుమ్బ॥
> 3—38.

మగతుమ్మెద ప్రియురాలి ననువర్తించుచు, ఒకే పువ్వుగంచమున మధువు త్రావెను. కృష్ణ మృగము సుఖస్పర్శచే కన్ను లరమోడ్పు గనునట్లు తన కొమ్ముతో ఆడుఁలేడిని గోకెను.

కరిణి తమ్మిపూలతావిచే గమగమలాడు పుక్కిటి నీటిని పురుషగజమున కిచ్చెను. మగచక్రవాకము తామరతూటిని తాను సగము తిని తక్కిన సగమును తన సహచరి కిచ్చెను.

ఒక కింపురుషుడు, సంగీతముపాడి అలసిన తన ప్రియురాలి, మధుమదవిలోలనయనాభిరామమైన ముఖమును ముద్దుగొనెను.

రఘువంశమున, పదునారవ సర్గలో గ్రీష్మము ప్రసక్తమైనది. అందు వసంతావిర్భావమును సూచించి, గ్రీష్మములోని కొన్ని సుమధురదృశ్యము లను వర్ణించెను.

> వనేషు సాయన్తన మల్లికానామ్
> విజృంభ ణోద్గంధిషు కుట్మలేషు
> ప్రత్యేక నిక్షిప్త పద స్సశబ్దమ్
> సంఖ్యా మివైషాం భ్రమర శ్చకార॥.

ఉద్యానములందు అప్పుడే విడుచుచు, పరి మళము వెదజల్లుచున్న సాయంకాలపు మల్లెమొగ్గ లందు ఝుమ్మను రొదతో ప్రతిముకుళమునందును వ్రాలి లేచుచున్న తుమ్మెద, వాటి మొగ్గలను లెక్కించుచున్నట్లుండెను.

ఋతుశోభకు ప్రాణభూతములైన యంశము ములను కనుగొని వర్ణించుటలో ఈ కవి ప్రతి ఋతువర్ణనము లందంతటను సాక్షాత్కరించును.

ఒకడు కొన్ని తప్పులు చేసినను, తరువాత నాతడు చేసిన మంచిపనులవలన తొలి తప్పులు మరచిపోవుట సహజము. అట్లే గ్రీష్మము నిరవధిక తాపముతో కామిజనులను వేధించినను, మనసున కింపైన తియ్యమామిడిచివుళ్లను, పురాణమధువును క్రొత్తపాటలపుష్పములను వారి కిచ్చి తన తొలి తప్పులను రద్దుచేసికొనెనట. 16—52.

> మనోజ్ఞగంధం సహకారభంగమ్
> పురాణశీధుం నవపాటలంచ ।
> సంబధ్నతా కామిజనేషు దోషాః
> సర్వే నిదాఘావధినా ప్రమృష్టాః॥.

**పర్వత వర్ణనము :**

రఘువంశ మేఘదూతములందు అక్కడక్కడ పర్వతప్రసక్తి సాధనసూపినను విపులసుందరమైన వర్ణ

నము కుమారసంభవముననే కాన్పించును. కవీంద్రుడు కావ్యాదినుండి పదునారు శ్లోకములలో గిరిరాజుపటమును చిత్రించి మన ఎదుట పెట్టెను. ఈ గిరిరాజవర్ణనములో మూడు అంశములు ప్రాధాన్యము వహించినవి. గిరిరాజు స్థావరరూపములోని ఔన్నత్యమును, వైభవమును, ఆధిపత్యమును ముందు మన హృదయముల నాకట్టుకొనును.

'హిమపర్వతమునందలి సిద్ధులు సానువుల వరకును సంచరించు మేఘముల క్రింద చల్లనినీడలందు కూర్చుండి అచట్లు వర్షముకురియగా చలికి వణకుచు, పై శిఖరములందు కాయు వెచ్చనిఎండలలోనికి పోవుదురు' 1-6; 'పర్వతోపరిభాగములందున్న సరస్సులలోని పద్మములను కొన్నింటివి సప్తర్షులు కోసికొందురు. ఆ మిగిలిన పువ్వులను క్రిందిభాగమున సంచరించు సూర్యుడు తన కిరణములను పైకి ప్రసరింపజేసి, వికసింపజేయుచున్నాడు.' 1—16. ఇది ఆ హిమవత్పర్వతపు టౌన్నత్యము.

చంద్రకాంతులవంటి తెల్లని తమ వాలములు విసరుకొనుచు, చమరీమృగములు ఆ పర్వతమున సంచరించుచుండగా, ఆ లాంగూలచాలనములు పర్వతమహారాజునకు వీచోపులై అతని రాజశబ్దమును సార్థకపరచుట అతని వైభవమునకు నిదర్శనము.

> లాంగూలవిక్షేప విసర్పిశోభైః
> ఇతస్తతః చంద్రమరీచి గౌరైః
> యస్యార్థయుక్తం గిరిరాజశబ్దం
> కుర్వన్తి వాల వ్యజనైః శ్చమర్యః॥ 1—13.

ఆ పర్వతపుగుహలు శయ్యాగృహములై కిరాతదంపతులకు నివాససౌఖ్యమును గల్గింపగా, చెంతపొంతలవెలుగు ఓషధిలతలు నూనెపోయని పడకటింటిదీపము లగుచున్నవి. ఇది గిరిరాజు సమృద్ధికి తార్కాణము.

ఆ పర్వతము స్వర్గలోకవాసులైన సిద్ధులకు, విద్యాధరులకు, కిన్నరులకు మాత్రమే క్రీడాభూమి కాదు. నిత్యవనచారులైన కిరాతకులకు సైతము చనవైన స్వగృహ మగుచున్నది.

వేటలాడి అలసివచ్చిన కిరాతకులను, గంగాశీకరములకు తడిసి దేవదారువృక్షములను తెమల్చుకొనివచ్చు పిల్లగాలులు సేదదేర్చుచున్నవి. 1—15.

> **భాగీరథీనిర్ఝర శీకరాణాం**
> వోఢా ముహుః కంపితదేవదారుః।
> యద్వాయు రన్విష్టమృగైః కిరాతై
> రాసేవ్యతే భిన్నశిఖండిబర్హః॥ 1—15.

ఇది మన కన్నులకు కాన్పించు హిమవంతుని స్థావరరూపము. పర్వతరాజు జంగమరూపము, సప్తమహర్షులును, శివునకు కన్య నిమ్మని యడుగుటకు వెళ్లినప్పుడు ఇట్లు ప్రత్యక్షమగును.

బలిష్ఠములగు పాదవిన్యాసములచే భూమిని క్రుంగజేయుచు, హిమవంతుడు, అర్ఘ్యమును గైకొని జంగమరూపముతో వారికి ఎదురేగెను:

> తా నర్ఘ్యానర్ఘ్య మాదాయ
> **దూరా త్ప్రత్యుద్యయౌ గిరిః।**
> నమయన్ సారగురుభిః
> పాదన్యాసై ర్వసుంధరామ్.॥ 6—50.

గైరికాదిధాతువుల కెంబెదవి వాడు, దీర్ఘవిగ్రహుడు, దేవదారువులవంటి మాంసలభుజములవాడు, శిలాఫలకమువంటి వక్షస్సీమవాడు చూడగనే హిమరాజు నడచి వచ్చుచున్నాడని తెలియును.

> ధాతుతామ్రాధరః ప్రాంశు ర్దేవదారుబృహద్భుజః,
> ప్రకృత్యైవ శిలోరస్కః సువ్యక్తో హిమవా నితి.॥
> 6—51.

సంస్కృత సాహిత్యమున ఏ కవీంద్రుడును ఒక పర్వతముయొక్క స్థావరజంగమరూపములను భావించు నవసరము కలుగలేదు. కథాసందర్భమునుబట్టి ఉభయరూపములుగల పర్వతవర్ణనము చేయు నవకాశము కాళిదాసునకు లభించినది. దీనియందు ఇతని భావన సమగ్రసుందరమై, భావుకహృదయరంజక మైనది.

## చంద్రోదయము :

కుమారకావ్యపు అష్టమసర్గమునందలి చంద్రోదయ వర్ణనము అద్వితీయ భావనాసంకలితము. సర్వజ్ఞుడును, పరమరసజ్ఞుడును అగు శంకరుడు తన నూతన శృంగారానుభవమున సృష్టినంతటిని శృంగారమయముగ జూచి మురియుచున్నప్పుడు, గంధమాదనపర్వతమున చంద్రోదయమైనది. అది ప్రతిదినము వచ్చు చంద్రదర్శనమువంటిది కాదు. ఈనాడు అపూర్వభావస్ఫోరకముగా నున్నది.

ఉదయించు చంద్రుని మృదుకిరణములు కోమల యవాంకురములవలె మెరయుచు, గోటితో గిల్లి పార్వతికి కర్ణభూషణములు చేయదగినంత అందము చిందుచున్నవి.

> శక్య మోషధిపతే ర్నవోదయా
> కర్ణపూర రచనాకృతే తవ,
> అప్రగల్భ యవసూచికోమలా
> శ్ఛేత్తు మగ్రనఖసంపుటైః కరాః॥.
> 8—62.

ఆ ప్రభువునకు చంద్రుడును తనవలె కామిగానే కన్పడుచున్నాడు.

'ఆ నిశాకాంతుడు వ్రేళ్లవంటి తన కిరణములతో కేశపాశమువంటి చీకటిని ముడిచిపట్టుకొని, అరమోడ్చిన తామరమొగ్గలకన్నులుగల రజనీసుందరి ముఖమును ముద్దుగొనుచున్నట్లున్నాడట !

> అంగులీభిరివ కేశసంచయం
> సన్నిగృహ్య తిమిరం మరీచిభిః,
> కుట్మలీకృత సరోజలోచనం
> చుంబతీవ రజనీముఖం శశీ.॥ 8—63.

ఉన్నత ప్రదేశములందు చంద్రకాంతులు మెరయుచున్నవి. అధఃప్రదేశములందు రాత్రిచీకట్లు బలిసియున్నవి. బ్రహ్మదేవుడు గుణదోషములకు ఉచిత స్థానములనే కల్పించి యిచ్చినట్లున్నది.

> ఉన్నతేషు శశినః ప్రభాస్థితా
> నిమ్నసంశ్రయపరం నిశాతమః ।
> నూన మాత్మసదృశీ ప్రకల్పితా
> వేధసైవ గుణదోషయో ర్గతిః॥ 8—66.

కవిభావదీప్తికి, కవితాసౌందర్యమునకు నిదర్శకములైన పలుచిత్రణములతో ఈ చంద్రోదయ వర్ణనము సాగినది.

## జలక్రీడ :

రఘువంశమున కుశరాజకథాసందర్భమున కవీంద్రుడు జలక్రీడను వర్ణించెను. అందు స్త్రీల స్నానసౌందర్యము దర్శనీయము.

గ్రీష్మ సమయమున కుశరాజు స్త్రీలతోగూడ సరయూతీరమునకు వచ్చెను. రమణీమణులు నీళ్లలోనికి దిగి పలువిధముల క్రీడాకలాపములు నిర్వర్తించిరి. 'అందు నీటిలో ఓలలాడు స్త్రీల వస్త్రములు వితంబసీమల కంటుకొన్నవి. వెన్నెలకాంతిలో నణగిమణగిన నక్షత్రపంక్తివలె వారి మౌక్తికమేఖలలు పైకి దృశ్యాదృశ్యముగ గాన్పించుచు, నీటికి తడిసి ధ్వనించుట మానుకొన్నవి.' 16—65.

జలములో నీదులాడు స్త్రీల జడముడులు వీడి తిలకాదికము కరిగి కర్ణభూషణములు లేని వారి ముఖములు అలసియున్నను మనోజ్ఞములై యున్నవి.

> ఉద్బంధకేశః చ్యుతపత్రలేఖః
> విశ్లేషిముక్తాఫలపత్రవేష్టః
> మనోజ్ఞ ఏవ ప్రమదాముఖానాం
> అంభోవిహారాకులితోఽపి వేషః. 16—67.

రాజు తానును జలక్రీడలలో పాల్గొనెను. నీటిలో దిగిన రాజుపై సుందరాంగులు బంగరు కొమ్ములతో రంగురంగులనీళ్లు చిమ్మగా నాతఁడు ధాతుద్రవములతో కూడిన పర్వతరాజువలె నున్నాడు. 16—70.

ఈ జలక్రీడాప్రసక్తిలో తండ్రి శ్రీరామచంద్రుడు తన కిచ్చిన జైత్రాభరణము నీటిలో జారి

పోయినది. దాని సంపాదనమునకై ఆతడు ధనువు నెత్తి కుముద్వతియను నాగకన్యకను సంపాదించెను ఇట్లీ జలక్రీడావర్ణనము కథాసందర్భమున సుసంగతమై నిలచినది.

**మధుపానము :**

స్త్రీ పురుషుల శృంగారకేళిలో మధుపాన మొక ముఖ్యాంగముగ కాన్పించును. అది మదనోద్దీపకమై క్రొత్తయుత్సాహము పుట్టించి, వారి రసక్రీడకు మరింత అతిశయము చేకూర్చును. అంతియేకాక ఈ మధుపానము ఒక భోగలాంఛనముగ వైభవచిహ్నముగ పూర్వకావ్యములందు కన్పట్టుచుండును. రామాయణమున రామాద్యుత్తమ పాత్రలకును ఈ మధుపానము భోగచిహ్నముగా వర్ణితమైనది. దీని యనుభవవిశేషములను వైవిధ్యమును రావణాంతఃపురవర్ణనమున విపులముగా చూడగలము. [1]

మధువనగా ఈనాడు మద్యపాననిరతులు స్వీకరించు తీవ్రమైన మాదకద్రవ్యముకాక నాటి మధువన్నది హృద్యమును, ప్రియమును, నాతితీక్ష్ణమునునై స్త్రీలకుకూడ సంసేవ్యమైయున్నట్లు కాన్పించును. ఆ మధువు పూలనుండియును, పండ్లనుండియును, పండిన చెఱకుగడలనుండియును నిర్మించుచుండెడివారని పుష్పాసవ, ద్రాక్షరస, పురాణశీధు శబ్దములచే మనము తెలిసికొందుము.

ఈ మధుసేవనమును కాళిదాసు ముఖ్యముగా శృంగార ఘట్టములందు విధాయకముగ వర్ణించుచుండును.

'పుష్పాసవసేవనముచే కన్నులు సొగసుగా త్రిప్పు ప్రియురాలి ముఖమును కింపురుషుడు చుంబించెను.' 3.38

అనియును, అలకానగరమున చక్కని చుక్కలతో మేడలందుచేరి యక్షులు కల్పవృక్షప్రసూతమును రతిఫలమ్ము నగు మధువును సేవింతురనియు వర్ణింపబడెను. మే. 2.5. ఈ మధుసేవనము పార్వతీపరమేశ్వరుల శృంగారాభోగమునందును భాగమునందెను. గంధమాదన పర్వత విహారము నందలి ఈ మధుసేవనమును పరికింపుడు.

గంధమాదన వనదేవత పార్వతికి సూర్యమాణిక్య పాత్రలో కల్పవృక్షమధువును తెచ్చియిచ్చినది. అపుడు శంకరుడు భార్యతో నిట్లనును. 8—75.

'పార్వతీ! సఖీజనస్నేహమును మన్నించి అనంగదీపకమైన ఈ మధువును సేవింపుము.' అని చమత్కారముగా నా మధువు నామెచే త్రావించెను. పార్వతియును దానిని సేవించి తలవని తలంపుగా మామిడికి తియ్యమామిడితనము వచ్చినట్లు సొగసైన వికారమునకు పాల్పడెను. పిమ్మట ఆమె మదపారవశ్యమును దానియందు పరమశివునకు కల్గిన అభిముఖ్యమును రమ్యముగా నిట్లు వర్ణింపబడినవి.

'చలించు కన్నులును, తొట్రుపడు పాదములును, ఇంచుక క్రమ్మిన చెమటబొట్లును, కారణములేని నవ్వులును కల ప్రియురాలి ముఖమును శంకరుడు తన ముఖముతోకాక కన్నులతో త్రావదొడగెను.'

సర్వప్రాణి సాధారణమును శృంగారకళాచరమసీమయును అగు మదనక్రీడను కవులు హృద్యముగ వర్ణించుట పరిపాటి. దాని నితడు రఘువంశము 19 వ సర్గయందును కుమారకావ్యపు అష్టమ సర్గయందును వర్ణించినాడు.

అగ్నివర్ణుని శృంగారానుభవములో బాహ్యక్రీడ విపులముగను ఆభ్యంతరము సూచనా ప్రాయముగను వర్ణింపబడినవి.

చూర్ణబభ్రు లలిత స్రగాకులమ్
ఛిన్నమేఖల మలక్తకాంకితమ్।

1. న మాంసం రాఘవో భుంక్తే, న చాపి మధు సేవతే।
రా॥ సుందర. 36—41.
దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి।
శర్కరాసవ మార్ద్వీక పుష్పాసవ ఫలాసవాః॥
రా. సుం. 11—20.

ఉత్థితస్య శయనం విలాపినః
తస్య విభ్రమరతా న్యపావృణోత్॥

కుమారసంభవమున గిరిజాశంకరుల బాహ్యాభ్యంతర రతోత్సవములను తన రాసిక్యావధిగా చిత్రించి ఈతడు పలువురు ప్రాచీన విమర్శకుల తిరస్కారమునకు పాత్రమైనాడు. కేవల కళాదృష్టితో కావ్యత్వసిద్ధికై చిత్రితమైన ఈ సన్నివేశమును ఆధునిక సహృదయులు కళాత్మకముగ స్వీకరించి ప్రశంసింతురని తోచును. ఆ వర్ణనములోని కామనీయకమును రసౌచిత్యమును ఇటువించుక దర్శించుట అప్రకృతము కాదనుకొందును.

చుంబనా దలక చూర్ణ దూషితం
శంకరోపి నయనం లలాటజం।
ఉచ్ఛ్వాస త్కమలగంధయే
దదౌ పార్వతీవదన గంధవాహినే॥

కన్నులలో ధూళిపడిన, ఆ కన్నుల నూది వేయుట లోకసాధారణము. ఆ ప్రక్రియ నిట కవి ఈ శృంగార చిత్రణమున కుపయోగించెను. శంకరుఁడు పార్వతిని చుంబింపగా ఆమె ముంగురులందలి వాస చూర్ణము ఆతని లలాట నేత్రమున పడినది. ఆ కంటి నెరసుల నూదివేయుటకు ఆతడు తనకంటిని పద్మసుగంధముగల పార్వతీ ముఖ మారుతమునకు పాత్రము చేసెను.

గంధమాదన విహారమున పార్వతీ మధుపానానంతరము శంకరుఁడు తన మహిమచే అచట నొక మణిమందిరము సృష్టించి ఆమెతోనందు ప్రవేశించెను. తరువాతి దృశ్యమిది.

తత్ర హంస ధవళోత్తరచ్ఛదం
జాహ్నవీపులిన చారుదర్శనమ్।
అధ్యశేత శయనం ప్రియా సఖః
శారదాభ్ర మివ రోహిణీపతిః॥

హంసతెక్కలవంటి తెల్లని దుప్పటితో గంగా సైకతసీమవలె రమణీయముగ కాన్పించు పాన్పునందు శివుఁడు ప్రియాసహితుడై చంద్రుడు శరన్మేఘము నధిష్ఠించిన ట్లధివసించెను. తరువాత 'క్లిష్టచంద్ర మదయైః కచగ్రహైః' అను నొక శ్లోకముతో అభ్యంతరమునుగూడ నేర్పుతో చిత్రించి కవి ఆ ప్రకరణము ముగించెను.

**వివాహము :**

రఘు కుమార కావ్యములలోఅజేందుమతులయు, పార్వతీశంకరులయు, వివాహసన్నివేశములను రమ్యముగ చిత్రించినాడు. కాని, రఘువంశ వివాహవర్ణన మునే ఇంచుకమార్పుతో కుమారకావ్యమునగూడ విన్యసించుటకుగల కారణమేమో తెలియదు. ప్రతిభా సంపన్నుడైన కవి, ఒకే సన్నివేశమును తన భావనా బలముతో ఎన్నివిధములుగనైనను వర్ణింపవచ్చును. దిలీపునిరాజ్యపరిపాలనము తరువాత రఘురాజ్యపరిపాలనమును వర్ణింపవలసివచ్చినను, తన కళాకౌశల ముట్టిపడునట్లు వైవిధ్యము చూపెను. అట్లే ఇచ్చటకూడ ఆతడు తలచికొనిన వైవిధ్యము చూపలేని మందప్రజ్ఞకలవాడు కాడు. ఈ కారణమున కొందఱు కుమారకావ్యమునందలి వివాహఘట్టము లోని కొన్ని శ్లోకములు ప్రక్షిప్తము లేమోయని సందేహించిరి. కాని, వానిని ప్రక్షిప్తములనుటకంటె రఘుకావ్యమునందలి ఆ వర్ణనమునందు కవి కభిమానము హెచ్చు. వివాహనిర్దిష్టములైన అవే సన్నివేశములందు వేరు శ్లోకములు వ్రాయుట అనవసరమని వానినే గ్రహించినాడని తలంచుట ఇప్పటి కుచితమని తోచుచున్నది.

అజేందుమతీకల్యాణఘట్టమునం దాతడు చిత్రించిన దృశ్యములు ఎన్నటికిన్ని రంగుమాయక కల్యాణశోభను ఎలుగెత్తి చాటు ఉత్తమచిత్రములు.

వివాహప్రారంభమున రాజకుమారుడు పెండ్లి కొమరితచేతిని తన చేతితో పట్టుకొన్నప్పుడు మామిడి చెట్టు తన చివురు చాచి అశోకలతచివురును పెనవేసి పట్టుకొన్నట్లు శోభించెను. 7—21.

నవదంపతులు అగ్నికి ప్రదక్షిణముచేయు దృశ్య మిది.

ప్రదక్షిణప్రక్రమణాత్కృశానో:
ఉదర్చిష స్తన్మిథునం చకాశే, ।
మేరో రుపాన్తే ష్వివ వర్తమానం
అన్యోన్యసంసక్త మహస్త్రియామం॥.

కణకణవెల్గుచున్న అగ్నికి ప్రదక్షిణము చేయబోవు నా దంపతులు, ఎడబాయక తిరుగు రాత్రింబవళ్లు మేరుపర్వతమునకు ప్రదక్షిణము చేసినట్లొప్పెను. 7.24

దంపతులు లాజహోమము చేసినారు. దానినుండి సన్నని పొగవచ్చుచున్నది. ఆ ధూమరేఖ ఇందుమతి చెవిమీదినుండిపోగి ఆమె నల్లకలువను చెవియం దలంకరించుకొన్న సొగసును వహించెను. అంతియే కాదు ఆ పొగవల్ల పెండ్లికుమార్తె మొగ మెట్టి అందమును వహించెనో ఈ పద్యమున చూడుడు.

'త దంజనక్లేదసమాకులాక్షం
ప్రమ్లాన బీజాంకుర కర్ణపూరవ్
వధూముఖం పాటలగండలేఖం
ఆచారధూమగ్రహణా ద్బభూవ.'

ర. 7—27.

హోమమునుండి లేచిన ధూమముచే ఆమె కాటుక కళ్లు ఇంచుక కలిగినవి. చెవియందలి కర్ణపూరము ఇంచుక వాడినది. అరుణారుణములైన బుగ్గలు మరింత ఎఱ్ఱబడినవి. అట్టి వధూముఖము ఒక వింత శోభతో వెలుగొందుచున్నది.

ఇవే సన్నివేశములు ఇవే వర్ణనములతో కుమార సంభవ సప్తమసర్గమందు ఆ దంపతులకు తగినట్లు ఇంచుక మార్పులతో కన్పట్టుచున్నవి. వివాహమునకు ముందు పెండ్లికుమారుని ఊరేగింపుటుత్సవములోని పౌరకాంతల విభ్రమ చేష్టితములును రఘువంశమునుండి యధాతథముగ కుమార సంభవమున ప్రవేశించినవి.

**కుమారోదయము :**

రఘువంశమున రఘుకుమారుని జన్మము సందర్భమున ఈ వర్ణనము విపులముగా ప్రసక్తమైనది. దీని తరువాత దశరథపుత్రోదయమును కొంత విస్తరింపబడినది. తరువాతి రాజకుమార జన్మములు పునరుక్తికాకుండ ఒకటి రెండు వాక్యములతో సంక్షేపింపబడినవి.

రఘురాజు వంశోద్ధారకుడైన మహాపురుషుడు. ఆ వంశమునందు ఇంచుమించు ఎవ్వరికినిలేని గుణాతిశయము అతని చరిత్రలో సాక్షాత్కరించును. వంశమున కంతటికిని అతని యశశ్చంద్రిక, ఎనలేని శోభ కూర్చినట్లు మనకు పొడగట్టును. ఈ కావ్యమున అతని పుట్టుకకున్న ప్రాముఖ్య మెంతటిదో తెల్పుటకు కవి అతని జన్మవృత్తాంతమును విస్పష్టరేఖలతో చిత్రించినాడు. తరువాత చెప్పదగిన మహాపురుషుడు అవతారరూపియైన శ్రీరాముడే యైనను, కావ్యపరముగ మొత్తముమీద అతనికి ప్రాముఖ్యములేదు. కాళిదాస కావ్యమున అతడే ప్రధాన పురుషుడు కాదు. కథానాయకుడగు అతని చరిత్రము రామాయణములో నున్నంత ప్రముఖముగా ఇందుండవలసిన యవసరములేదని కవి తలంచి యుండవచ్చును. రామాయణమున సౌష్ఠవముగా వర్ణితమైన రామాదికుమారోదయము ఇందు సంక్షిప్తమైనను, లోటురాదని అతడు భావించి యుండవచ్చును.

కారణజన్ముడై, లోకోద్ధారకుడై పుట్టబోపు రఘుకుమారుని భాగ్యమును, తేజస్సును, పావిత్ర్యమును స్ఫురింపజేయుచు అతని మాతృమూర్తియైన సుదక్షిణాదేవి నిట్లు వర్ణించెను.

నిధానగర్భా మివ సాగరాంబరావ్
శమీ మివాభ్యంతర లీనపావకాం ।
నదీ మివాంతస్సలిలావ్ సరస్వతీవ్
నృప స్ససత్త్వాం మహిషీ మమన్యత॥.

గర్భవతియైన భార్యను చూచి దిలీపు డిట్లు అనుకొనెను. ఈమె నిధులుగర్భమునందుగల భూమి. లోపల అగ్ని అణగియున్న శమీతరువు. అంతస్సలిలయైన సరస్వతీనది.

ఆ పురుషోత్తముని జన్మమువలన దిక్కులు ప్రసన్నములైనవి. వాయువులు సుఖముగా వీచినవి. ప్రదక్షిణశిఖలతో అగ్ని హవిర్భాగములను స్వీకరించెను. అప్పుడు సర్వమును శుభోదర్కముగా నుండెను. అట్టివారి జన్మము లోకాభ్యుదయకరము గదా! 3.14.

పురిటింటియందంతటను నిండిన ఆతని తేజస్సుచే రాత్రి దీపములు బొమ్మలో చిత్రింపబడిన వానివలె తేజోహీనములైనవి. 3.15.

అట్టికుమార జన్మమునకు సంతోషము పట్టలేని మహారాజు దాతృత్వమిట్టిది.

తమకు సుపుత్రుడు పుట్టినాడను అమృత తుల్యమైన అక్షరము లుచ్చరించిన అంతఃపుర పరి చారకునకు చంద్రశుభ్రమైన రాజచ్ఛత్రమును చామరద్వయమును తప్ప ఇంకేమడిగినను ఇచ్చివేయు టకు ఆ రాజు సిద్ధముగానున్నాడు. అంతేకాదు— స్తిమిత నేత్రములతో పుత్రుని ముఖమును త్రాగి వేయుచున్న ఆ రాజు మనస్సునందు చంద్రునిచూచిన సముద్రపు పొంగువలె సంతోషపు వెల్లువ ఇముడలేక వెల్లివిరిసిపోయినది. 3—17.

పిమ్మట దశమసర్గమునందు నారాయణావతార రూపులైన రామాది సోదర చతుష్టయ జన్మకథనము నందు కవి తన పుత్రోదయవర్ణన కౌశలమును చూపెను.

దశరథుని రాణులు మువ్వురికిని వచ్చిన కలల యందు ఉద్భవింపబోవు పురుషోత్తముల ప్రాభవ భాగ్య తేజస్సంపత్తులను, చతురముగ సూచించి తర్వాత పెద్దరాణి రాత్రిభాగమున జ్యోతిర్లత వెలు గును కన్నట్లు తమస్సంహారకుడైన పుత్రుని ప్రస వించెనని శిశురాముని తేజోవిశేషమును, అసుర సంహా రమును వ్యంజించెను.

ఆతడు రఘువంశమునకే పెద్దదీపము. దాని తేజస్సుచే పురుటింటి దీపములన్నియు నిరసింపబడి నట్లు కాన్పించినవి. 10.69.

కుశరాజపుత్రుడైన అతిథి జన్మమును చెప్పు నది ఒక్కవాక్యమైనను లోకోత్తరముగ నున్నది.

అతిథి ర్నామ కాకుత్స్థాత్
పుత్రం ప్రాప కుముద్వతీ
పశ్చిమా ద్యామినీయామాత్
ప్రసాద మివ చేతనా॥.

కుశుని భార్యయైన కుముద్వతి, చేతన రాత్రి తుది జామునుండి ప్రసన్నతను కన్నట్లు, కుశుని వలన ఒకానొక పుత్రుని బడసెను.

కుమారసంభవమున కుమారీజన్మము వర్ణిత మైనది.

పర్వతరాజు తన భార్యయందు పార్వతీదేవిని కనగా, అది బాగుగా ప్రయోగింపబడిన రాజనీతి యందు ఉత్సాహగుణము సంపదను కన్నట్లున్నది. ఇచ్చట సర్వమంగళాదేవిని సంపదతో పోల్చుట యుక్తి యుక్తమైనది. ఆమె జన్మమున లోకమునకు మేలు కలుగబోవుచున్నదని చెప్పుచు, కవి యన్నమాట లివి.

'దిక్కులు ప్రసన్నములైనవి, ధూళిలేని గాలులు వీచినవి, శంఖధ్వనులపిమ్మట పూలవాన కురిసినది. స్థావరజంగమములైన సర్వప్రాణులకును ఆమె జన్మ దినము సుఖకరమైనది. కుమా. 1.23.

ఒక్కమాటలో ఆ సర్వమంగళ సౌందర్య మెట్టిదో చెప్పినాడు.

తయా దుహిత్రా సుతరాం సవిత్రీ
స్ఫురత్ప్రభామండలయా చకాశే
విదూరభూమి ర్నవమేఘశబ్దాత్
ఉద్భిన్నయా రత్నశలాక యేవ॥.

క్రొత్తమబ్బు ఉరుమునకు పుట్టిన రత్నాల మొలకతో విదూరభూమివలె కాంతిమండలముతో ఒప్పులొలుకు ఆ పుత్రికచే తల్లి ప్రకాశించెను.

కవి రఘువంశమున రెండు సందర్భములందు ప్రయాణమును వర్ణించెను. ఆ వర్ణనము మాఘుని శ్రీకృష్ణప్రయాణ వర్ణనమువలె అత్యుక్తిమంత

మును, సుదీర్ఘమునుకాక, ప్రకరణానుకూలముగా సహజముగా అమరియున్నది.

రఘువు దిగ్విజయయాత్రకు బయలుదేరి నాడు. రాజు పట్టణ వీధులందు పోవుచుండగా పెద్దముత్తైదువలు శుభావహముగ అతనిపై పేలాలు చల్లుట ఈ ప్రయాణదృశ్యమునందలి ఒక రమ్య సన్నివేశము.

అవాకిరన్ వయోవృద్ధాః
తం లాజైః పౌరయోషితః
పృషతై ర్మందరోద్ధూతైః
క్షీరోర్మయ ఇ వాచ్యుతమ్॥

ముత్తైదువలయిన పురస్త్రీలు ప్రయాణము చేయు నా రాజుపై క్షీరసముద్రతరంగములు మందరపర్వతము లేపిన తుంపురులను విష్ణుమూర్తిపై చల్లినట్లు పేలాలను చల్లిరి. తరువాత ఆ రాజు ప్రభుశక్తిచే నాతని మార్గము ఎట్లు మారెనో కవి చెప్పెను.

రజోభి స్స్యందనోద్ధూతైః
గజైశ్చ ఘన సన్నిభైః
భువఃస్తల మివ వ్యోమ
కుర్వన్వ్యో మేవ భూతలమ్॥

రథములనుండి లేచిన ధూళులచేతను, మేఘములవంటి ఏనుగులచేతను, భూతలము ఆకాశముగను, ఆకాశము భూతలముగను వింతగా మారిపోయినది. ఆ శక్తిమంతుడు మరుభూములను జలసమృద్ధములు గాను, నావలతో దాటదగిన నదులను సుఖముగా దాటతగిన వానినిగను, అడవులను బయళ్లుగాను చేసికొనుచు ప్రయాణము సాగించెను.

మరు పృష్ఠా న్యుదమ్భాంసి
నావ్యా స్సుప్రతరా నదీః।
విపినాని ప్రకాశాని
శక్తిమత్త్వా చ్చకార సః॥

రెండవ సందర్భము అజకుమారుని స్వయంవర ప్రయాణము.

త్రోవలో పటమండపములు నిర్మించి, సర్వసౌఖ్యము లొనగూర్చిరి. చుట్టుప్రక్కల పల్లెపట్టుల నుండి జనులు రాజభక్తితో కానుకలు తెచ్చిరి. అడవి త్రోవలైనను రాజపుత్రునకు ఉద్యాన విహారములవలె గడచిపోయెను.

త స్యోపకార్యారచితోపచారా
వన్యేతరా జానపదోపదాభిః
మార్గే నివాసా మనుజేంద్రసూనోః
బభూవు రుద్యానవిహారకల్పాః॥

**యుద్ధ వర్ణనము :**

ఇది రఘుకావ్యమునందు మూడుసార్లు ప్రసక్తమయ్యెను. అందు అజరాజునకు అసూయాగ్రస్తులగు స్వయంవరాగతరాజపుత్రులతో తటస్థించిన యుద్ధము విపులముగ వర్ణితమైనది. తక్కినవి రెండును రఘుదేవేంద్రులకును, రామరావణులకును జరిగిన సమరములు.

ఇతర సంస్కృతకవుల యుద్ధవర్ణనములవలె కాళిదాసు యుద్ధచిత్రణములు నిష్ఠురాక్షర క్లిష్టములును శస్త్రాస్త్ర సంఘర్షణ ప్రభూతజ్వాలా భీకరములును గావు. భవభూతి ప్రచండయుద్ధచిత్రములతో పోల్చినప్పుడు కాళిదాసు యుద్ధచిత్రములు మందకాంతితో పొడగట్టుచున్నట్లుండును. ఈతని యుద్ధవర్ణనములందు హుంకార విభ్రమముల కన్న అహంకారప్రగల్భవచనములును, విస్మయప్రద రణరంగ దృశ్యములును కాన్పించును. యుద్ధమును గూర్చి అతడెప్పుడు చెప్పినను గడుసుదనముతో స్మితవదనముతో మాటలాడినట్లుండునుగాని, కన్నులెఱ్ఱవార గంభీరముగ పల్కినట్లుండదు.

తయో రుపాంతస్థిత సిద్ధసైనికమ్
గరుత్మ దాశీవిష భీమదర్శనైః।
బభూవ యుద్ధం తుములం జయైషిణోః
అధోముఖై రూర్ధ్వముఖైశ్చ పత్రిభిః॥

ఇచ్చట 'గరుత్మ దాశీవిష భీమ దర్శనైః' అని చెప్పినను ఆతని ప్రసన్నశైలిలో భయంకర

దృశ్యమును భీకర వాతావరణమును ఏర్పడక అతని మాట సొగసుల వైపునకే మనసు మొగ్గుచుండును. ఈ సందర్భముననే చెప్పిన 'ప్రకోష్ఠే హరిచందనాంకితే' 'భుజే శచీపత్ర విశేషకాంకితే' అనునప్పుడు కరుకైన యుద్ధముకంటె కమ్మని కైతయే ప్రథమ దర్శనమిచ్చును. రామరావణ యుద్ధమున 'సీతా సంగమ శంసిని సవ్యేతరేభుజే నిచఖాన శరమ్' అన్నప్పుడు బాణము గ్రుచ్చుకొన్న నొవ్వుకంటె కవి పల్కులోని శృంగారరేఖయే చట్టువ మెరయును. మొత్తముమీద ఈతని వీరరౌద్రములు శబ్ద విన్యాసమునందుకంటె అర్థవిన్యాసమునందే ఎక్కువ ఆధారపడి యున్నవి.

రఘు దేవేంద్రుల యుద్ధమునందును, రామ రావణ యుద్ధమునందును ఇరువురి వీరుల వాక్క్రియాసంఘర్షణముకై పరిమితమైన వర్ణనము, అజుని సందర్భమున విశాలరంగమున ప్రవేశించినది.

అజునకు ఏ యొక రాజపుత్రునితోడను ప్రత్యేక విరోధము లేదు. ఇచట జరిగినది రెండు సైన్యముల సంకుల సమరము. ఇందు కవిభావన విస్తృతావకాశమును చిక్కించుకొన్నది. ఇచట విశాల పటమున కవి చిత్రించిన సమరదృశ్యములను పలు కోణములనుండి విస్మయావహముగ వీక్షింపగలము. 'ఇరుపక్షముల సైన్యములును తలపడగా కన్నుల కంధకారము కల్పించుచు ధూళి పెల్లురేగినది. ఆయుధములచే తెగిన గుఱ్ఱముల ఏనుగుల వీరుల రక్త ప్రవాహము ఆ చీకటికి సూర్యోదయమైనది. 7.42

ఆ యుద్ధభూమి మృత్యుదేవత పానశాలవలె నుండెను. 'బాణములచే తెగిన తలలే పండ్లు. నేలపై జారిన పాగాలే గిన్నెలు. వాకలుగట్టిన నెత్తురే మద్యము. 7.49.

ఒకడు శత్రుఖడ్గముచే తల తెగి, వెంటనే దేవతాత్మము నంది, ఎడమతొడపై ఒక అచ్చరవానను కూర్చుండబెట్టుకొని యుద్ధభూమిలో నింకను నేల కొరుగక ఆడుచున్న తన మొండెమును చూచెను. 7.51.

యుద్ధభూమి క్రూరదృశ్యమునకు ఈ పద్యము చక్కని యుదాహరణము.

సరోష దష్టాధిక లోహితోష్ఠై:
వ్యక్తోర్ధ్వరేఖా భ్రుకుటీ ర్వహద్భి: ।
తస్తార గాం భల్లనికృత్తకంఠై:
హుంకారగర్భై ర్ద్విషతాం శిరోభి:॥

కోపముతో కరచిన ఎఱ్ఱని పెదవులుగలవి; పైకెత్తిన కనుబొమ్మలుగలవి, లోలో హుంకరించుచున్నవి, ఐన యోధులతెగిన శిరస్సులతో ఆ రణరంగము నిండిపోయినది. ఇట్టి యుద్ధరంగమున ఏకైకవీరుడై నిలచిన రాజకుమారుని ధనుష్పాండిత్యమిట్టిది.

సదక్షిణం తూణముఖేన వామం
వ్యాపారయన్ హస్త మలక్ష్యతాజౌ ।
ఆకర్ణకృష్టా సకృదస్య యోద్ధు:
మౌర్వీవ బాణాం త్సుషువే రిపుఘ్నాన్॥

ఆతడు అమ్ములపొదిపై కుడిచేతి నాడించుచు, ఎపుడు బాణము తీయుచున్నాడో, ఎపుడు వేయుచున్నాడో తెలియక వింటిత్రాటినుండియే బాణములు పుట్టుకొనివచ్చి శత్రువులను చెండాడుచుండెనేమో అన్నట్లుండెను, 7.57.

కావ్యమునకు నిర్దేశింపబడిన వర్ణనావళిలో చాల విషయముల నీతడు ఆయా సందర్భముల కుచితముగా చొప్పించి కౌశలముతో చిత్రించుట ఇంతవరకు చూచియుంటిమి. పూర్వపట్టికలోని మంత్రాలోచనము ద్యూతము అను నంశములు మాత్రము ఈతని కావ్యత్రయములో ప్రసక్తము కాలేదు. ఏదో ప్రసక్తితెచ్చి వర్ణనములు చొప్పించుట ఈతని పరిపాటి కానందువలన వానికిచట తావులేక పోయినదని మన మూహింపగలము. పట్టికలో లేకపోయినను వేట, ఆశ్రమములు, భగవత్స్తుతి మున్నగు నంశములు యథోచితముగా ఈతని కావ్యము లందు వర్ణింపబడియున్నవి. ఈ విమర్శనమున వేరు వేరు ప్రకరణముల హాని ప్రమేయమువచ్చి యుండుట చేతను గ్రంథ విస్తర భీతిచేతను వాని వివరములను ఇచ్చట ప్రస్తావింపలేదు.

# నా కరెక్టు అడ్రసు

శ్రీ తాళ్లూరి శివరామకృష్ణయ్య

పెద బాబూ!
నేను నీ తల్లిని కానని
ఎందు కనుకుంటున్నావయ్యా?
ఏదో చిన్నవాడు
ముచ్చట పడుతున్నాడని
పురాణ శ్రవణం మాని
నవ కవిత్వం ముషాయిరాలకు
హాజరవుతున్నా గాని,
అంతమాత్రంతో నీకు
ఆవేదన కలిగిస్తానని అనుకోలేదయ్యా.
రాజుల రోజులు గతించి
ప్రజా రాజ్యాలు వెలిసిన
ఈ నాడు కూడా నన్ను
ప్రబంధ పంజరంతోనే
బంధించి ఉంచాలని
ఎందు కనుకుంటున్నావయ్యా?
మనం అద్దెఇల్లు వదిలిపెట్టి
సొంత ఇంటికి వచ్చామని
మరిచిపోయావా పెదబాబూ?
అప్పుడు సంస్కృతం వారి ఇంట్లో
అద్దెకుండేవాళ్లం ఇదే తూర్పువీథిలో
మనలాగానే ఇల్లు లేని ఇంకొందరితో కలిసి;
గోడలమీద పురాణ దేవతల
పటాలు తప్ప తగిలించటానికి

ధైర్యం చాలేదికాదు
అంతా ఏమనుకుంటారో నని;
పడమటి వీధిలోని తెల్లబంగళాలో
రంగు రంగుల పటాలు చూపిస్తానని
చిన్నబాబు ఒకసారి మనలను రమ్మన్నాడు.
నువ్వు నసేమిరా రానంటే చివరికి నేను వెళ్లాను.
క్రీస్తు పటానికి అప్రక్క షేక్స్పియర్ చిత్రం
ఈ ప్రక్క డికెన్స్ బొమ్మ
ఇంకా ఎంద రెందరివో చూశాను.
నా ఇంటిని కూడ అలాగే
అలంకరించుకోవాలని సంబరపడ్డాను.
విశ్వరూపానికి అప్రక్క శ్రీ శ్రీని
ఈ ప్రక్క వీరేశాన్ని నిలిపాను.
ఇంటాయన నిప్పులు క్రక్కుతూ వచ్చాడు
ఇల్లు ఖాళీ చెయ్యమన్నాడు.
చినబాబు ఆసరా చూసుకొని నేను
మనవీధిలోనే సొంత ఇల్లు
నిర్మించుకున్నాను,
నవలే ఇటికలుగా
గేయమే సున్నంగా;
నీవు చేయి అందించకపోగా
ఇటికల్లో గట్టిలేదనీ
సున్నంలో రసం లేదని
గేలి చేశావు.
కాని ఎన్ని గాలిదుమారాలకు
తట్టుకుని నిలబడిందో మనఇల్లు
నీకు తెలియదా బాబూ ?
రోజుకు ఒక్కపూట తిండికి కూడ గతిలేక
మానరక్షణకైనా సరిపడ గుడ్డ దొరకక
జీవచ్ఛవాల్లా వున్న మన వీధిలోని

## నా కరెక్టు అడ్రసు

ఎంతోమందిని చూశాక, నేను
పన్నీటి స్నానాలూ,
మృష్టాన్న భోజనాలూ,
చీనిచీనాంబరాలూ
వదిలేశానంటే నీ కింత అలుకెందు కయ్యా ?
మనసు సంక్షోభం చెందినపుడు
మాటలు తడబడుతుంటే
అవి నీకు తిట్లుగా వినబడినయ్.
అంతమాత్రానికే నీ తల్లిని
కళావరు రాణీగా
గజ్జెల గుర్రంగా
నకిలీ సైతానుగా చిత్రించుకున్నావా బాబూ ?
నన్నెవరూ మానభంగం చెయ్యలేరయ్యా
మీరిద్దరూ నాకు అండగా వున్నంతవరకూ.
పురాణశ్రవణం పూర్తిగా మానాలనీ
నవకవితనే రోజూ పాడాలనీ
నేను అనుకోవటం లేదు.
ఇద్దరే ముద్దూ చెల్లించాలనే
నా యీ తపనంతా బాబూ.
చిన బాబూ !
తన తల్లి అందం ఏనాటికీ
తరగి పోగూడదనీ,
కన్నతల్లి నోటిమాటలో
కఱుకుతనం కనపడరాదనీ
ఆందోళనతో ఆవేదనలో
పెద్దవాడు ఏదో ఒకమాట అన్నాడని
అంత ఆగ్రహ మెందుకయ్యా ?
తనకు నచ్చిన బాటలోనే
ఎల్లకాలం నేను పయనిస్తానని
పాపం, కలలు గన్నాడు ;
ఆ కల చెదిరిపోగానే
నిజాన్ని ఎదుర్కొనే ధైర్యం లేక,
నేనేదో తప్పుదోవ పట్టాననీ,

ఎవరో నన్ను అవమానం చేస్తున్నారనీ
నా రూపం మారిందనీ
నా గుణం చెడిందనీ
ఊరికే క్షోభపడ్డాడు
పేదల బాధలు
వంచితుల గాథలు
నీలో రేపిం క్రాంతిని
నేను గుర్తించాను బాబూ.
అందుకే నా వేషం మార్చాను.
మాటకూడ మారింది.
అయినా బొత్తిగా
దిగంబరత్వాన్నీ
అశ్లీలాల వాడకాన్నీ
భరించలేను బాబూ.
బండ తిట్లు తిడితేనే గాని
భావం అర్థం కాదా ?
బంధనాలు త్రెంచటమంటే
స్వైర విహారం చెయ్యామనా ?
పెద్దవాడి క్షోభను
సహృదయంతో అర్థంచేసుకో బాబూ
వాడివద్దనుంచి నీవు
నేర్చుకోవాల్సింది చాలా వుంది.
ఉరకలు వేస్తూ పోతున్న
నీ భావనా స్రవంతికీ
నిశ్చల సరోవరం లాంటి
వాడి మానసిక ప్రవృత్తికీ
పొందిక కుదిరిన నాడే
నా నోములు ఫలిందగలవు బాబూ.
పెదబాబూ !
'నా అడ్రెసు దొరకటం లేదన్నావు గదూ ?
మన ఇంటి ముందున్న నెంబరు
నీవు చూడనే లేదా బాబూ ?
తూర్పు వీధిలో మనది
ఒకటో నెంబరే నయ్యా.

# ఆంధ్రదేశ చరిత్ర భూగోళ సర్వస్వము - ముఖద్వారము

## శ్రీ నిడుదవోలు వెంకటరావు

ఆధునికయుగంలో విజ్ఞానసర్వస్వాలకు శ్రీకారము చుట్టినవారు సుగృహీతనాములైన కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుగారు. వారు మూడు సంపుటాలు—ఆంధ్రవిజ్ఞానసర్వస్వము ('అ'కారము) ప్రకటించిన తరువాత కీర్తిశేషులైరి. కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు వానిని పెంపుచేసి రెండు సంపుటాలలో—మనోహరంగా ముద్రించి లోకానికి అందజేశారు. తరువాత, తెలుగు భాషాసమితివారి విజ్ఞానసర్వస్వము సంపుటాలు—సంగ్రహాంధ్ర విజ్ఞాన సర్వస్వ సంపుటాలు వెలువడినవి.

ఈ సర్వస్వాలలో—ప్రత్యేకంగా, ఆంధ్రదేశానికి సంబంధించిన, తెలుగు భాషాసమితివారి, 'తెనుగు సంస్కృతి' సంపుటమున్నది. కాని, దానిలో-చరిత్ర-సాహిత్యము—భూగోళము సర్వవిషయములు కలిసి యున్నవి. ఆ కారణముచేతనే గాబోలు నేడు హైదరాబాదు—ఆంధ్ర రచయితల సంఘము వారు ప్రత్యేకముగా, ఆంధ్రదేశచరిత్ర భూగోళమునకు సంబంధించిన సర్వస్వమును—సిద్ధముచేయుటకు— సంకల్పించి—ప్రస్తుతము ఆ రాబోవు గ్రంథమునకు ప్రాతిపదిక—ముఖద్వారము ప్రకటించియున్నారు. కనుక ఈ ఉద్యమము ప్రశంసనీయమే.

ఈ గ్రంథమున—526 పుటలున్నవి. ఈ సర్వస్వము అకారాదిగా సమకూర్చబడినది. ప్రతి పుటయందు క్రమసంఖ్య వ్యక్తి లేక స్థలము—ఆధారములు—అని శీర్షికలున్నవి. గ్రంథాంతమున 'పరిశిష్టము'అనే పేరుతో 12 పుటలున్నవి. (ఇందు (పరి)అని సూచింపబడినది.)

ఈ శీర్షికలలో వ్యక్తి లేక స్థలము—అన్న దాని క్రింద [1]ఆరోపములు, ఆధారములు అన్న శీర్షిక క్రింద ఆకరములు ఈయబడియున్నవి. ఈ గ్రంథానికి—6 పుటల పీఠిక—ఆంగ్లభాషలో నున్నది. 'నివేదన'అనుపేరితో తెలుగున మఱి మూడు పుటలున్నవి. ఆంగ్లపీఠిక—ఆంధ్ర రచయితల సంఘము అధ్యక్షులైన శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారిది. నివేదన, కార్యదర్శి డాక్టరు పల్లా దుర్గయ్యగారిది.

ఇట్టి చారిత్రక భూగోళ సర్వస్వములు సంధానించుట సామాన్యమైన పనికాదు. బహుదుర్ఘటమైనది. బాధ్యతాయుతమైనది. అందులోనూ, ఆంధ్ర దేశచరిత్ర, భూగోళము[2]—అన్నది మరీ దుస్సాధ్యము. అచ్చులోకాకుండా, అముద్రితంగాఉన్న అపారగ్రంథ సంచయంనుండి, విషయసేకరణచేసి-విశేషపరిశ్రమతో, విచక్షణతో ఇట్టి గ్రంథాలు రూపొందించవలెను. ఆపైని సేకరించిన విషయాలను, ఏకాకారంగా

---

1. ఆరోపములు (Entries) 2. ఆకరములు (References).

2. ప్రాచీనాంధ్రభూగోళమును, శాసనశబ్ద కోశమును కీర్తిశేషులు కుందూరి ఈశ్వరదత్తుగారు రచించినారు. అవి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారిచే ప్రకటితములు. అవి ఆయా పరిశ్రమ చేయుటకు ప్రాథమికములై ప్రశంసనీయములై యున్నవి.

గ్రంథస్థము కావలెను. ఇట్టి పని సాధికారముగా నిర్వహించుటకొక, సంపాదకుడు ఆవశ్యకము.

అయితే, ప్రస్తుత సర్వస్వములో, ఎక్కడా 'సంపాదకుడు'-అన్న పేరేలేదు. కార్యదర్శి నివేదికలో- 'ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారి అధ్వర్యమున- 'ఆంధ్రదేశచరిత్ర—భూగోళ సర్వస్వము'అను బృహత్కార్యము చేపట్టినది' అనియున్నది. దీనినిబట్టి ఈ సర్వస్వము సంపాదకుడులేని సర్వస్వము—అని నిర్ణయించవచ్చును.

ఈ సర్వస్వమునకు, సాహిత్యాధారములు చారిత్రకాధారములు—అని రెండు శీర్షికల క్రింద గ్రంథము లీయబడినవి. వానిలో ప్రధానముగా, ఇది చరిత్రకాబట్టి చారిత్రకాధారములు మొదట పరిశీలింతము.

## చారిత్రకాధారములు

ఇందు 61 గ్రంథములున్నవి. ఇంగ్లీషు తెలుగే గాక, ఇరవై ఉర్దూ గ్రంథాలున్నవి. చరిత్రకు ప్రధానాధారంగా, ప్రామాణికంగా శాసనాలను, పరిశోధకులు అంగీకరించారు. శాసనాలులేని చరిత్రే ఉండదని చారిత్రకుల అభిప్రాయం. అట్టి పరిస్థితుల్లో ఈ చారిత్రక సర్వస్వంలో, 'శాసనాల' ప్రస్తావన అనేది పూజ్యంగా ఉండడము దురూహ్యం. అంతేకాదు. ఇందున్న 11 వేల 684 ఆరోపాల్లోను ఒక్కచోటనైనా వీని ప్రసక్తిలేదు. ఇంతకన్న విడ్డూరమైనది ఇంకొకటి. ఆంధ్రదేశ రాజకీయచరిత్రకు, గ్రామచరిత్రలకు, సాంఘికవ్యవస్థలసమీక్షకు—పరమాధారమైనవి, 181 సంపుటాల్లోఉన్న 'మెకంజీ సంపుటాలు'. ఇందులో వాని వివరణగాని—అథవా వానినిగూర్చి ఒక జ్ఞాపికకూడాలేదు. తక్కిన గ్రంథాలతోకూడా ఒక చారిత్రక సర్వస్వమువలె విలువ కట్టడానికి వీలులేని యీ సంపుటాలని యిట్లు పేర్కొన్నారు.

38. మెకంజీ సంపుటములు—మె. సం.

అయితే—మెకంజీ సంపుటాలనికూడా సంప్రతించినామని చెప్పుటకు గాబోలు—ఇన్నివేల ఆకరాల లోను—70 మాత్రమే వానినుండి ఉదాహరింపబడ్డాయి.

ఇంతకూ — ఈ మెకంజీ సంపుటాలన్ని అముద్రితంగా ఉన్నవి. ఈ సర్వస్వంలో—ఒక సులభమైన పద్ధతి అనుసరింపబడ్డది. అముద్రితంగాఉన్న గ్రంథాలని పరిశీలించి, ఆకరాలుతీయడం చాలా కష్టం—అందుచేత, ఈ సర్వస్వంనిండా—అచ్చు పుస్తకాలనుండే ఆకరాలు గ్రహింపబడినవి.

చరిత్రకు సంబంధించిన గ్రంథాలనైనా పేర్కొవలసినవి, ఈ సర్వస్వంలో కానవచ్చుటలేదు. కొన్ని పేర్కొన్నా సరిగాలేవు. ఉదాహరణకు— '50 సంఖ్య. దక్షిణహిందూదేశ శాసనములు' అనియున్నది. ఇది ఎన్నిసంపుటాలో చెప్పలేదు. ఈ శాసన సంపుటాలు పది. అయితే—ఈ పదింటిలోను—మొదటి మూడింటిలో ఆంధ్రదేశచరిత్రకు సంబంధించిన శాసనములు లేనేలేవు. అయినా ఇందులో ద—హిం—అని సంకేతమిచ్చి—II సం. అని చాల చోట్ల ఉన్నది.[3]

'ఆంధ్రదేశ చారిత్రక సర్వస్వము'—అన్న ఈ గ్రంథంలో ఆంధ్రదేశ చరిత్ర పరిశోధనను ప్రారం

---

3. The approximate number of Telugu Inscriptions discovered sofar may be 8000. They are mainly published in Vol. 10, and along with other inscriptions in volumes 4 to 8 of the South Indian Inscriptions. Prof. D. B. Diskalkar, Dravidian or South Indian Inscriptions. P. 177.

Journal of Indian History Vol. XXXIV, Part II. August 1956.

ఈనాటికి తెలుగులో శాసనసంఖ్య పెరిగి యుండవచ్చును. తెలుగు శాసనములు 10000 వఱకు నుండునని చారిత్రకుల యభిప్రాయము.

ధించి, ప్రశంసనీయమై, చారిత్రాత్మకమైన పని చేసిన—'ఆంధ్రదేశేతిహాస పరిశోధక మండలి'ని[4] పేర్కొనకపోవడమెట్లు సరిగదా—ఆ మండలివారు ప్రకటించిన 35 సంపుటాలను సూచించకపోవడం—అత్యాశ్చర్యకరముగా ఉన్నది. ఆ మండలివారు ప్రకటించిన — రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక (వేంగి సంచిక), కళింగసంచిక, కాకతీయసంచిక, రెడ్డి సంచిక, విజయనగరసంచిక—ప్రసక్తి యిందులేదు. తక్కినవానిలోని విషయములు ఈనాటి చారిత్రక గ్రంథాలలో గతార్థములైనా, 'కళింగ సంచిక'లోని విషయాలు — ఇంగ్లీషులోనే యున్నవిగాని, తెలుగు పుస్తకాలలో లేనేలేవు. కళింగదేశము—ఆంధ్రదేశములోని అంతర్భాగమేగదా—ఆ దేశచరిత్ర మన కక్కఱలేదా?

చారిత్రక సర్వస్వమని పేరున్న ఈ గ్రంథంలో—ఆంధ్రదేశాన్ని ఆదినుండి నేటివఱకు పాలించిన—రాజుల చరిత్ర — శాతవాహనులు—ఇక్ష్వాకులు — సాలంకాయనులు — విష్ణుకుండినులు — పల్లవులు—తూర్పు చాళుక్యులు—వెలనాటి చోళులు — కాకతీయులు—రెడ్డిరాజులు—విజయనగర రాజవంశములు (సంగమ, సాళువ, తుళువ, ఆర్వీటి)—గోలుకొండ నవాబులు—దక్షిణదేశనాయకరాజులు—ఆంగ్లేయులు — స్వాతంత్ర్యావతరణము — సంగ్రహముగానైనా లేకపోవడం, మరీ అన్యాయం.

## భూ గో ళ ము

చరిత్రకు సంబంధించినదే భూగోళము—ప్రాచీనాంధ్ర భూగోళమన్న ప్రాతిపదిక గ్రంథమీవఱకే ప్రకటితమైనట్లు తెలిపాను. ఆ గ్రంథాన్ని సర్వస్వసంధాత ఉపయోగింపలేదు. దీనివలన, ఎంత అనర్థకము వచ్చినదో చూడండి. పూర్వము తెలుగు దేశము నాడులుగా విభజింపబడియుండేది. ఆ నాడుల పేర్లు నేటికి సంఘంలో నిలిచియేయున్నవి. ఆ నాడుల వివరాలు సంగ్రహంగానైనా—పీఠికలో లేవు.[5] విషయము, మండలము, సముతు గ్రామము పల్లె మొదలైనవాని వివరాలు అంతకంటేలేవు. ఆపైని పీఠికలో గ్రామాల పట్టికనుగుఱించి ఏవిధంగా వ్రాయబడినదో తెలుపుచున్నాను.

"We wish that the Government of Andhra Pradesh will publish authorised lists of villages in Telugu or lists in English with proper dia Critical marks to help the field of Research". (Introduction P. II.)

పూర్వము మదరాసు ప్రభుత్వమువారిప్పటికి 46 ఏండ్లక్రిందట అట్టి గ్రంథమును ఇంగ్లీషులో (ఆంధ్రేతర పరిశోధకుల కుపయోగపడునట్లు) ప్రకటించియున్నారు.[6]

## సా హి త్యా ధా ర ము లు

తక్కిన దేశభాషలకన్న తెలుగులో పూర్వ కావ్యాలన్నీ రాజులకు అంకితాలు కావడముచేతనూ, కృత్యవతారికలలో ఆయారాజులకు సంబంధించిన చారిత్రక విషయాలు తెలుపబడడంవల్లనూ అవి దేశ చరిత్రాధారాలలో ముఖ్యమైనవిగా పరిగణితాలైనవి. ఈ సర్వస్వంలో—138 గ్రంథా లుదాహరింపబడినవి. అయితే వానిలో కొన్ని చరిత్రకు సంబంధించినవి కావు.

పుట XV. 2. 'అథర్వణకారికావళి. అథర్వణుడు. అథర్వ'. కాని అథర్వణునిగూర్చి ఆకరము

---

4. The Andhra Historical Research Society. Rajamahendravaram. Journal of the A. H. R. S.

5. ప్రత్యేకంగా ఒక్క నాడులన్నుగుఱించి చేయవలసినపని బ్రహ్మాండమంత ఉన్నది. ప్రస్తుత మే సర్వస్వములోను సమగ్రంగా కాకపోయినా, సంక్షిప్తముగానైనా నాడుల చరిత్రలు లేవు.

6. Alphabetical list of villages in the Madras Presidency–Government of Madras Publication 1924. ఇందు-జిల్లా, తాలూకా వారీగా గ్రామములు వర్గీకరింపబడినవి.

పుట 7—110 సం. అథర్వణుడులో నాగ 1—10 అనియున్నదిగాని—'అథర్వ' లేదు.

,, 5. 'అహోబల పండితీయము. అహోబలుడు. అహో'. ఇది 24 పుటలో 560 సంఖ్య అహోబలపండితుడు అని ఆరోప మిచ్చుకొంటకు—అంతే.

,, 8. 'ఆంధ్రశబ్ద చింతామణి—నన్నయ 'ఆం. చి'. ఇది అన్నింటికన్నా చిత్రం.

నన్నయనుగూర్చి 235 లో 41 సం. నన్నయ భట్టుక్రింద—51 ఆకరము లున్నవి. అందులో 'ఆం. చి' అను సాంకేతమేలేదు.

పై మూడింటికి—చరిత్రతో సంబంధమేమి? ఇక యిం దుదాహరింపబడ్డ కవుల గ్రంథముల పేళ్ళు కొన్ని సరిగాలేవు.

పుట. XIV.

46. నాగఖండము — నాగరఖండము.

47. నాచికేతూపాఖ్యానము — నాసికేతూపాఖ్యానము.

పుట. XVI.

78. మైరావణ చరిత్ర—మైరావణ చరిత్ర.

పుట. XVIII.

89. ముద్దుపళని—ముదు పళని.

93. రామాయణము-తరిగొండ వెంగమాంబ (రా. (తరి)

తరిగొండ వెంగమాంబ రచించినది వశిష్ఠ రామాయణముగాని, రామాయణముగాదు. అది వేదాంత గ్రంథము—దీనినుండి గ్రహింపబడిన ఆకరములెన్ని?

101. నక్కలంక వీరభద్రకవి—వక్కలంక వీరభద్రకవి.

104. విష్ణుపురాణము—వెన్నెలకంటి సూర్యకవి. విష్ణుపురాణకర్త వెన్నెలకంటి 'సూరన'గాని సూర్యకవికాదు.

పుట. XIX.

116. వెణుతథుపల్లి విశ్వనాథకవి — వెణుతురుపల్లి విశ్వనాథకవి.

117. కుంటుముక్కల తిరుమలనాదకవి—కుంటముక్కల తిరుమలనాథకవి.

121. కట్టా పరదరాజు—కట్టావరదరాజు.

123. సకల కథాసార సంగ్రహము. అయ్యలరాజు రామభద్రకవి. ఇది ముద్రితమా? అముద్రితమా?. ఆ గ్రంథగద్యలో—'అయ్యలరాజు' అన్న మాట లేదే.

132. సుగీవ విజయము—సుగ్రీవ విజయము.

పైవన్నీ చరిత్రకు సంబంధించినవే, కాని భూగోళానికి సంబంధించిన దొకటీ లేదు. ఇప్పటికి 106 యేండ్ల క్రిందట చెన్నపట్టణము భూగోళాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించిన ప్రశస్త పద్య కావ్యం—మతుకుమల్లి నృసింహకవి 'చెన్నపురీ విలాసము' ఇందులేదు. చెన్నపట్టణము దామెర అయ్యప్పనృపతి తన తండ్రియైన చెన్నప్పనాయనిపేర నిర్మించినాడు.[7]

ఇది ప్రధానముగా చారిత్రక భూగోళ సర్వస్వము. అట్టి సందర్భములో—ఇందు—చారిత్రకాధారములకన్న ద్విగుణముగా సాహిత్యాధారములను చూపుట చాలా వింతగా నున్నది. ఆ పైని ముందునే నుదాహరించిన మూడు సంస్కృత గ్రంథములే గాక, తెలుగుదేశ చరిత్రకెంతమాత్రము సంబంధము లేని—సంస్కృత కవుల పండితుల ప్రసక్తి ఈ

7. 'చూ. అముద్రితము. దామెర అంక భూపాలుని ఉషాపరిణయము.

గీ. ప్రళయ కావేరి మైలాపురంబు గల్మి
బీరమునఁ బోర నది మట్టువెట్టఁ దండ్రి
పేరఁ దన్మధ్య భూమినిఁ బ్రథు విఖ్యాతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి.

అవతారిక. పుట. 16.

Sources of Vijayanagar History. S. K. Iyengar. P. 77.

గ్రంథమున నెందుకు గలిగినదో — అంతకంటె దురూహ్యము.

XXIII పుటలో — చారిత్రకాధారములలో— 30 వ సంఖ్యగా 'సంస్కృత వాఙ్మయచరిత్ర— డా॥ కృష్ణమాచారి—'సం. వా. చ.' అని కలదు. కాని యిందు తెలుగుదేశపు సంస్కృత కవులు, ఆలంకారికులు—వారి కృతులను గూర్చియే యున్నది. అందు ప్రత్యేకముగా చారిత్రకభాగములేదే! అప్పు డిందులో ప్రయోజనశూన్యమైన—ఇన్ని యాకరము లెందులకు?

సర్వస్వకర్తలు—ఏ గ్రంథము చారిత్రకాధార ములలో చేర్పవలెను? ఏ గ్రంథము సాహిత్యాధారము లలో చేర్పవలెను? అన్న విచక్షణ పాటించినట్లు లేదు. చారిత్రకాధారములో సంస్కృత వాఙ్మయ చరిత్ర పేర్కొనుటయే యిందులకు తార్కాణ— ఇదేగాక, చారిత్రకాధారములలో—'తంజావూరి సరస్వతీ మహలు గ్రంథాలయములోని తెలుగు లిఖిత పుస్తక ముల కేటలాగు' రెండు సంపుటములు 13 వ సంఖ్యగా ఉదాహరింపబడియున్నవి. ఈ రెండు సంపు టాలు, తెలుగు సాహిత్యమునకేతప్ప — ఆంధ్రదేశ చరిత్ర కెంతమాత్రమూ సంబంధించినవికావు. ఇక— చారిత్రకాధారములలో ఆంధ్రదేశ చరిత్రకు సంబం ధించిన రెండు ముఖ్యగ్రంథాలు విడిచిపెట్టబడినవి.[8]

## ఆధారాలు—సమన్వయము

చారిత్రక భూగోళ సర్వస్వములో చరిత్రకు భూగోళమునకు సంబంధించిన—విషయాలకు వ్యక్తు లకు మాత్రమే స్థానమున్నదిగాని, సాహిత్యవేత్తలకు కవులకు స్థానమేలేదు. ఈ సర్వస్వములో అట్లు కాకుండా, తెలుగు కవులనుగూర్చి—ఆరోపము లున్నవి. ఆకరము లున్నవి.

ఇది సుతరామూ అసంబద్ధము — నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుడు, మొదలగువారినిగూర్చిన ఆకరాలు కొన్నిపంక్తులకు మించినవి. ఇంకొక చిత్ర మేమంటే—ఈ కవులలో కొంతమందికి — తెలుగు కావ్యాలనుండి ఆకరాలు లేవు. ఇంగ్లీషుభాషలో వ్రాసిన, 'దక్కను పూర్వచరిత్ర'నుండి యీయబడి నవి. తెలుగు కవులను గూర్చి—తెలుగున ప్రకటింప బడిన సర్వస్వములో—ఇంగ్లీషు గ్రంథమునుండి ఆకరముల నిచ్చుట, ఎట్టిదో పాఠకలోక మూహింప వచ్చును. దీనినిబట్టి సర్వస్వకర్తలు — చారిత్రక సాహిత్యాధారములను కలగాపులగముచేసి—సమన్వయము చేయకుండా గ్రంథము ప్రకటించినారని విస్పష్ట మగుచున్నది.

ఈ సందర్భమున నింకొక విషయము చెప్ప వలసియున్నది. తెలుగుదేశచరిత్రలో ముఖ్యముగా— విజయనగర సామ్రాజ్యము దక్షిణదేశనాయకులు వీరిని గూర్చి పరిశోధన జర్గినపుడు ఆ పరిశోధనకు శాసన ములతోపాటు తెలుగు సాహిత్యకావ్యగ్రంథములు అపార ముగా తోడ్పడినవి. ఆ చారిత్రకగ్రంథా లన్నింటి లోను చారిత్రక వ్యక్తులను సూచించునప్పుడు, తెలుగు కావ్యాలలోని ఆకరాలే యీయబడినవి. ఇందువల్ల— తెలుగుదేశచారిత్రక వ్యక్తులు ఇటు దేశచరిత్రలోను, అటు కావ్యాలలోనూ రెండుచోట్ల మనకు ప్రత్యక్ష మవుతూంటారు. అందుచేత, ఒకే చారిత్రకవ్యక్తికి చరిత్ర ననుసరించి సాహిత్యాన్ని అనుసరించి ఒకే చోట — ఒకేస్థలములో—ఆకరాలుండును. రెండు చోట్ల ఉండనే ఉండవు.

ఈ సర్వస్వకర్త లిట్టి ముఖ్యవిషయాన్ని విస్మరించడముచేత ఆరోపాలు, ఆకరాలు, చర్విత చర్వణంగా, అమితంగా, అనావశ్యకంగా పెరిగిపోయి, గ్రంథస్వరూపాన్ని పూర్తిగా మార్చివేశాయి.

ఈ గ్రంథ మీరీతిగా తయారుకావడానికి ఒకే

---

8. (1) Further sources of Vijayanagar History, 3 Volumes—Dr. N. Venkata Ramanayya Madras University Publication.

(2) Descriptive Catalogue of Mackenzie Manuscripts. (Local Tracts) 2 Vols. Published by the Government Oriental Manuscripts Library Madras.

ఊహ తట్టుతున్నది. మొదట నేను చెప్పినట్లుగా— అచ్చులో గ్రంథాలే గ్రహించడంవల్ల, ఒక సర్వస్వమునకు తగినంత సాధనసామగ్రి సంధానకర్తలు సమకూర్చలేకపోయినారని, చారిత్రకభూగోళ విషయాలు చాలా తోపించినట్లు తెలిసికొని, ఏవిధంగానైనా గ్రంథం పూర్తికావలెననే సంకల్పముతో సాహిత్య సంబంధములైన కవి కావ్యములను చేర్చవలసివచ్చినదని మన మనుకోవచ్చును.

ఇక యిందులో, ఆరోపాలు, ఆకతాలు వీని ధోరణి చూడండి.

## అ కా రా ది సూ చి క

ఈ గ్రంథమున అకారాదిసూచిక సమకూర్చబడినంత అస్తవ్యస్తముగా మతే యేకోశమునందునూ లేదు. తెలుగున వ్యక్తుల పేళ్లు అకారాదిగా సంతరించినప్పుడు—సాధారణముగా పేరు మొదట ఇంటిపేరు తరువాతనుంచి, పేరు మొదటి యక్షరముతోడనే ప్రారంభమగును. అప్పుడొక వ్యక్తిపేరు గ్రంథములో ఒక్కపర్యాయము మాత్రమే వచ్చును.[9] ప్రస్తుత సర్వస్వమునం దట్లుగాదు. ఆయాగ్రంథముల నుండి సంగ్రాహకులు, ఏరీతిగా వ్రాసినారో, పరిశీలన లేకుండా యథాతథముగా—ఒక్కమారుకాదు—రెండు మూడుసారులు—చర్వితచర్వణముగా ముద్రితములైనవి. వాని వైఖరి యెట్లున్నదో ఈ క్రింది వివరణము వల్ల గ్రహింపవచ్చును.

| పుట సంఖ్య. | క్ర. సం. | వ్యక్తి. |
|---|---|---|
| | | **అ** |
| 3 | 15 (a) | అక్కిరాజా ఉమాకాంత పండితుడు |
| 43 | 91 | ఉమాకాంతము—అక్కిరాజా |
| 10 | 190 | అన్నమంత్రి బెండపూడి |
| 319 | 5 | బెండపూడి అన్నమంత్రి |
| 12 | 241 | అప్పయాచార్యుడు బొమ్మకంటి |
| 323 | 19 | బొమ్మకంటి అప్పయార్యుడు |
| 15 | 318 | అమరేశ్వరుడు చిమ్మపూడి |
| 164 | 129 | చిమ్మపూడి అమరేశ్వరుడు |
| 17 | 364 | అయ్యంకి బాలసరస్వతికవి |
| 515 | 14 | అయ్యంకి బాలసరస్వతి (పరి) |
| 21 | 476 | అల్లమరాజా సుబ్రహ్మణ్యకవి |
| 497 | 28 | సుబ్రహ్మణ్యకవి—అల్లమరాజా |

9. తెలుగు సాహిత్యమున ప్రప్రథమముగా కవుల పేళ్లు కావ్యముల పేళ్లు అకారాది క్రమముగా సమకూర్చిన కీర్తి ఆంధ్రపత్రికా సంస్థవారిది. వారు క్రీ. శ. 1927 లో ఆంధ్రగ్రంథమాలలో ప్రకటితమైన—ఆంధ్ర వాఙ్మయ సూచికలో దీనిని వ్యాప్తి చేసిరి. ఆ వెనుక 'భారతి'లోను వ్యాసకర్తల నామములు, పేరుతోనే అకారాది క్రమమున వెలువడుచుండెడివి. తరువాతి సర్వస్వముల అకారాది సూచికల కెల్ల మార్గదర్శకులు, ఆంధ్రపత్రిక వారే. తెలుగుభాషా సమితివారు ప్రకటించిన విజ్ఞానసర్వస్వమున అకారాది సూచిక సైతవాని ననుసరించినవే. అందు పేరులోని మొదటి యక్షరముతోడనే కవుల నామము లున్నవి.

| పుట సంఖ్య. | క్ర. సం. | వ్యక్తి. |
|---|---|---|
| 22 | 484 | అల్లసాని పెద్దన |
| 287 | 126 | పెద్దనార్యుడు అల్లసాని |
| 28 | 55 | ఆదిపూడి సోమనాథరావు |
| 503 | 18 | సోమనాథరావు ఆదిపూడి |
| 29 | 74 | [10]ఆనందాచార్యులు. పి. |
| 515 | 24 | ఆనందాచార్యులు పనప్పాకము (పరి) |
| 42 | 55 | ఉన్నవ లక్ష్మీనారాయణ |
| 415 | 64 | క్ష్మీనారాయణ ఉన్నవ[11] |
| 42 | 56 | ఉన్నవ లక్ష్మీబాయమ్మ |
| 415 | 71 | లక్ష్మీబాయమ్మ ఉన్నవ |
| | | **క** |
| 59 | 63 | కందుకూరి వీరేశలింగము |
| 442 | 146 | వీరేశలింగం పంతులు కందుకూరి |
| 61 | 16 | కట్టమంచి రామలింగారెడ్డి |
| 399 | 264 | రామలింగారెడ్డి కట్టమంచి |
| 80 | 187 | కాశీనాథుని నాగేశ్వరరావు[12] |
| 246 | 89 | నాగేశ్వరరావు కాశీనాథుని |
| 90 | 171 | కూచిమంచి తిమ్మకవి } |
| | 172 | కూచిమంచి తిమ్మకవి } 3 |
| 195 | 22 | తిమ్మకవి కూచిమంచి } |
| 93 | 239 | కృష్ణమూర్తిశాస్త్రి శిష్టు |
| 466 | 42 | శిష్టు కృష్ణమూర్తికవి |
| 93 | 240 | కృష్ణమూర్తిశాస్త్రి శ్రీపాద |
| 470 | 51 | శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి |
| 103 | 6 | కొక్కొండ వెంకటరత్నము |
| 445 | 45 | వెంకటరత్నం కొక్కొండ |

---

10. పుట 8. సం. **142.** అనంతాచార్యులు నంద్యాల విజ్ఞా. తె. IV. 706 అని కలదు.
పరి. 24. ఆనందాచార్యులు పనప్పాకము విజ్ఞా. తె. IV. 706 అని కలదు.
ఇరువురు వేఱువేఱు వ్యక్తులా?

11. ముద్రితములో నున్నట్లుదాహృతము.

12. ,,

13. ముద్రితము.

| | | |
|---|---|---|
| 521 | 166 | దూబగుంట నారాయణకవి (పరి) |
| 249 | 168—169 | నారాయణభట్టు—3 ఆరోపములు |
| ,, | 171 | |
| | | **ప** |
| 260 | 31 | పండితారాధ్యుడు |
| 348 | 268 | మల్లికార్జున పండితారాధ్యుడు |
| 272 | 95 | పాలకుర్తి సోమనాథుడు } 3 ఆరోపములు |
| 273 | 129 | పాల్కురికి సోమనాథుడు } |
| 503 | 15 | సోమనాథకవి పాల్కురికి } |
| 272 | 94 | పాలకుర్తి సూరప్ప |
| 273 | 130 | పాల్కురికి సూరనామాత్యుడు |
| 274 | 1 | పింగళి గోవింద్రపెగడ |
| 307 | 8 | బండరుపు 14గోవింద్రపెగడ |
| 298 | 29 | పోతనామాత్యుడు 15బమ్మెర |
| 309 | 33 | బమ్మెర పోతన |
| | | **బ** |
| 311 | 81 | బసవ భూపాలుడు |
| | 82 | బసవభూపాలుడు |
| 523 | 219 | బసవరాజు— (పరి) |
| 312 | 26 | బాపిరాజు అడవి |
| 6 | 86 (a) | అడవి బాపిరాజు |
| 315 | 15 | బిజ్జాల తిమ్మక్షితిపతి |
| 523 | 226 | బిజ్జ తిమ్మభూపాలుడు |
| 317 | 24 | బుచ్చి సుందరరామశాస్త్రి మాధవపెద్ది |
| 358 | 91 | మాధవపెది బుచ్చి సుందరరామశాస్త్రి |
| | | **భ** |
| 330 | 19 | భావరాజు వెంకట కృష్ణారావు |
| 443 | 8 | వెంకటకృష్ణారావు భావరాజు |
| 333 | 1 | భుజంగరావు మంత్రిపెగడ |
| 393 | 99 | రాజా మంత్రిపెగడ భుజంగరావు |

14. ముద్రితము.
15. ,,

16. ముద్రితము 17. ముద్రితము.

## ఆంధ్ర దేశ చరిత్ర భూగోళ సర్వస్వము - ముఖద్వారము

### మఱికొందఱు చారిత్రకవ్యక్తులు; ఇతరులు

ఒకేవ్యక్తినిగూర్చి, ఎన్నెన్ని ఆరోపము లున్నవో చూడండి

### అ

| | | | |
|---|---|---|---|
| 7 | 123 | అనంతభూపాలుడు మట్లి | |
| | 126 | అనంతరాజకుమార మట్ల | |
| | 127 | అనంతరాజు | |
| | 128 | అనంతరాజు మట్ల | 6 ఆరోపములు |
| 340 | 35 | మట్ల అనంతరాజు | |
| | 36 | మట్లకుమార అనంతరాజు | |
| 32 | 135 | ఆర్వీటి శ్రీరంగరాయలు | |
| 472 | 86 | శ్రీరంగరాయలు ఆర్వీటి | |

### క

ఈ గ్రంథమున 'కృష్ణదేవరాయలు'[18]—ఒకే వ్యక్తికున్న ఆరోపముల కవధి.

| | | | |
|---|---|---|---|
| 92 | 208 | కృష్ణదేవరాయలు | 1 ఆరోపములు |
| 93 | 254 | కృష్ణరాయ క్షితీంద్రుఁడు | 1 ,, |
| 94 | 255—265 | కృష్ణరాయుడు | 11 ,, |
| 469 | 14 | శ్రీకృష్ణ దేవరాయలు | 1 ,, |

### గ

| | | |
|---|---|---|
| 143 | 35 | గోపమంత్రి |
| | 43 | గోపభూవరుడు |
| | 44 | గోపమంత్రి |
| 246 | 103 | నాదిండ్ల గోపమంత్రి |
| 522 | 184 | నాదిండ్ల గోపయ. పరి. |

### త

| | | |
|---|---|---|
| 13 | 259 | అప్పాజీ[19] |
| 196 | 55 | తిమ్మయ దండనాథుడు సాళువ. బాలభారత వ్యాఖ్యాత |
| | 61 | తిమ్మరస మౌళి |
| | 63 | తిమ్మరసు |
| | 64 | తిమ్మరసు సాళువ |

---

18. తెనుగు సంస్కృతిలో 'కృష్ణదేవరాయలు'క్రింద ఒకటే ఆరోపము.

19. ,, 'తిమ్మరసు'క్రింద ఒకటే ఆరోపము.

| పుట సంఖ్య. | క్ర. సం. | వ్యక్తి. |
|---|---|---|
| 9 | 166 | అనితల్లి |
| 515 | 22 | ఆనంద రంగ క్షమాపతి |
| ,, | 23 | అనందరంగాధిపుడు |
| 516 | 29 | ఆర్వీటి బుక్కరాజు |
| 31 | 132 | ఆర్వీటి బుక్కరాజు |
| 519 | 115 | గోళ్ల పెదరామనాయకుఁడు |
| 285 | 72 | పెద రామ పార్థివుడు |
| 520 | 134 | జాట్టయలెంక |
| 182 | 3 | జాట్టయలెంక |
| 521 | 173 | ధవళేశ్వరపు మార్కండేయుడు |
| 362 | 191 | మార్కండేయుడు |
| 523 | 216 | బండారు లక్ష్మీనారాయణ |
| 415 | 65 | లక్ష్మీనారాయణ బండారు |
| 524 | 242 | మంత్రిప్రెగడ సూరన |
| 499 | 28 | సూరము ప్రెగడమంత్రి |

స్థ ల ము లు

| పుట సంఖ్య. | క్ర. సం. | స్థలము | |
|---|---|---|---|
| 79 | 159 | కాళహస్తి | 11 ఆకరములు |
| 469 | 11 | శ్రీకాళహస్తి | 4 ,, |
| 94 | 266 | కృష్ణరాయసముద్రము | |
| 525 | 285 | శివ కృష్ణరాయ సముద్రము (పరి) | |
| 213 | 2 | దక్షవాటిక | |
| 214 | 3 | దాక్షారామము | |
| 227 | 1 | ద్రాక్షారామము[20] | |

వీని యన్నింటికి మించిన దీ క్రిందిది.

| | | |
|---|---|---|
| 250 | 4 | నిజాం కాలేజీ |
| 258 | 1 | నైజాం కాలేజి |

కొన్నిమాత్రమే చూపబడ్డవి—స్థలసంకోచముచేత.

---

20. దాక్షారామమును 'ద్రాక్షారామము' అనరాదు. అది దక్షప్రజాపతి యజ్ఞస్థలము. 'దక్షస్యారామభూమిత్వాత్ దాక్షారామ ఇతీర్యతే'. చూడుడు. ప్రతాపరుద్రీయ రత్నాపణ వ్యాఖ్య; అహోబల పండితీయము.

పై వివరణ చూచినచో నీ అకారాది సూచిక ఎంత అసంబద్ధముగా అస్తవ్యస్తముగా తయారైనదో తెలియగలదు. వ్యవహారములో య—ఎ—వేం—వె— మారుచుండునని, అట్టివి గ్రంథస్థమునైనప్పుడు సరియగు రూపములుండునన్న సంగతి సర్వస్వ కర్తలు గమనింపలేదు. ఇంతకు నీ పేళ్లన్నియు నీ వఱకే 'సర్వస్వము'లలో కెక్కినవే. వీనిలో కొన్ని చోట్ల వర్ణక్రమముకూడా పాటింపబడలేదు.[21]

అకారాది సూచికలోనున్న ఆరోపములకు ఆధారములు—ఆకరములు చూపబడినవని యీ వఱకే తెలిపియున్నాను. అయితే- ఈ అకారాది సూచికవలె, ఆ ఆధారాలూ, ఆకరాలుకూడా, అత్యంత లోప భూయిష్ఠముగాను— అప్రామాణికముగాను ఉన్నవి.

మొదట— ఆధారములేని ఆరోపాలనుగూర్చి వివరిస్తాను. తరువాత ఆరోపముల పరీక్ష—ఆకరముల పరిశీలన.

ఇక యిందు విడిచిపెట్టిన ఆరోపాలను గూర్చి వివరించాలంటే అది ప్రత్యేకంగా ఒక పెద్ద వ్యాసమవుతుంది. వెంటనే స్ఫురించినవి కొన్ని మాత్రమే తెలుపుతాను. చారిత్రక కావ్యాలైన—పోచిరాజు వీరన్న మనువంశపురాణము; మాచవరపు పావనా మాత్యుని నందవరచరిత్ర; అమరవాది రామకవి వాసిరెడ్డీయము; కాణాదం పెద్దన సోమయాజి విప్రకుల దర్పణము—మొదలైనవాని ప్రసక్తి యిందు లేదు. ఆద్యతనకాలంలో, చరిత్ర ప్రసిద్ధులైన— పిఠాపురం మహారాజు, పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రి, శేషాద్రి రమణ కవులు మొదలైనవారు లేనే లేరు. ఆంధ్రదేశ చరిత్రను ప్రథమముగా రచించిన బుక్కపట్టణము రాఘవాచార్యులపేరు చెప్పకపోవడం సరేగదా, ప్రస్తుతకాలంలో ఆంధ్రదేశ చరిత్రకులలో అగ్రగణ్యులైన డాక్టరు మారేమండ రామారావుగారి పేరు పీఠికలో లేకపోవడం శోచనీయం. ఇట్లాంటి వెన్నో?

## ఆరోపములు — అధారరహితములు

**ఈ క్రింది ఆరోపముల కాధారములు చూపబడలేదు.**

| పుట సంఖ్య | క్రమ సంఖ్య | వ్యక్తి లేక స్థలము | ఆధారములు |
|---|---|---|---|
| 1 | 17 | అంజామనెతరక్షి ఉర్దూ | ? |
| 6 | 94 | అణా గ్రంథమాల | |
| 14 | 284 | అబ్దుల్‌హక్ డాక్టర్ | |
| 16 | 334 | అమీరుహమ్జా | |
| | 346 | అమ్జద్, హైదరాబాదీ | |
| 19 | 409 | అరస్తూయార్‌జంగ్ | |
| 21 | 465 | అలీ నవాజ్‌జంగ్ | |
| 22 | 500 | అల్లామా ఇబ్నెఖాతూన్ | |

21. ఈ నాడు మనం ఆంగ్లేయ వర్ణక్రమాన్ని విడిచిపెట్టి ఆంధ్రథామ్రదతో పేళ్లు మార్చుకొని వ్యవరిస్తూండగా, ఈ సర్వస్వములో—వానిని పూర్వరీతిగా ఇంగ్లీషులో వాడడం—చిత్రం.

పుట. 112 సం. 2. కోకనాడ సముద్రశాఖ—కాకినాడ దగ్గర. అంటే కోకనాడ వేఱా?

దీని మించినది మఱియొకటి.

పుట. 391. సం. 56. రాజమండ్రి (గ్రామీణ).

సం. 57. రాజమండ్రి—రాజమండ్రి తాలూకా; తూ. గో. జిల్లా.

రాజమహేంద్రవరము—అని నన్నయనాటినుండి ప్రసిద్ధమైన పేరేల విడిచిరో దురూహ్యము.

| | | |
|---|---|---|
| 24 | 554 | అహమద్ (ఉర్దూకవి) |
| 25 | 6 | ఆంధ్ర చంద్రికా గ్రంథమాల |
| | 7 | ఆంధ్ర జనసంఘము (నిజాంరాష్ట్ర) |
| | 14 | ఆంధ్రపూర్ణులు (వడగనంబి) |
| 26 | 18 | ఆంధ్రయతి (సరస్వతీ తీర్థ) |
| | 19 | ఆంధ్ర రచయితల సంఘము |
| | 24 | ఆంధ్ర సారస్వత పరిషత్తు |
| 28 | 55 | ఆదిపూడి సోమనాథరావు |
| 29 | 77 | ఆపస్తంబుడు |
| 32 | 149 | ఆల్బకర్కు – అఫన్సో—డి—అర్వీ |
| 35 | 13 | ఇదారె అదీబియాతె ఉర్దూ |
| 36 | 35 | ఇబ్నెనిషాతి (ఉర్దూకవి) |
| 37 | 50 | ఇమాదుల్ ముల్కు (కవి) |
| 44 | 121 | ఉస్మాన్‌సాగర్ (గండిపేట్) |
| 46 | 9 | ఎట్టియాపురం (సంస్థానము) |
| 49 | 93 | ఏత్తిమల వరుసలు |
| 51 | 141 | ఎల్లుభట్టు |
| | 142 | ఎల్లుభట్టు కంచము |
| | 144 | ఎల్లోజి |
| 56 | 4 | ఔబళార్య కృష్ణపండితుడు, దేవరకొండ |
| 68 | 183 | కర్నూలు — కడప కాలువ (571/5) |
| 76 | 77 | కాపవరము |
| 92 | 209 | కృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయము |
| 113 | 34 | కోటరామచంద్రపురము (సంస్థానము) |
| 119 | 186 | కోస్తా ఆంధ్రా లేక సర్కారు ప్రాంతము |
| 147 | 141 | గోవిందస్వామి (చిత్రకారుడు) |
| 206 | 8 | తూర్పు కనుమలు |
| 215 | 18 | దాతర్‌స్వామి (ఉమర్ ఖయ్యాం) |
| 271 | 81 | పార్థసారథి వైయాకరణి |
| 272 | 99 | పాలకొండ గుట్టలు |
| 339 | 15 | మచ్‌ఖండ్ ప్రాజెక్టు |
| 403 | 356 | రాయలసీమ |
| 482 | 109 | సరోజినీనాయడు—ముత్యాల |
| 497 | 17 | సుబ్బరాయాచార్యులు—శ్రీముష్ణం |

## ఆరోపముల పరీక్ష

పుట. 77. 109, కామాక్షమ్మ—హర. 2-23. హర అనగా హరవిలాసము. అందు 2-23 లో 'ఊలవడె కంచికామాక్షి నుత్తరించె' అన్న పద్యమున 'కామాక్షి' అనియే కలదు. 'కామాక్షమ్మ' అని లేదు.

పుట 110. 194. కోటవి అన్నామాత్యుడు 195. కొటవి వెన్నయామాత్యుడు.

ఇద్దఱు నొకటే—

విక్రమార్క విభుడు వెన్నవిభుడు—సింహాసన ద్వాత్రింశిక 1—43.

ఆశ్వాసాంతగద్యలలో 'వెన్నయామాత్య' అనియే కలదు.

పుట 114. 48. కోటి వెంకనార్యుడు. రె. రా. 240. రె. రా. అనగా, మల్లంపల్లి సోమశేఖరశర్మగారి రెడ్డిరాజ్యముల చరిత్ర. ఆంగ్లము. క్రోటివెంకనార్యుడనుపేరు కందుకూరివారి కవుల చరిత్రనుండి గ్రహించినది. అది సరికాదు. అతని పేరు నదురుమాటి వెంకనార్యుడు—చూ. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము—పుట 410. 'న'లో నుండవలెను.

పుట. 154. 27. చరిత్రికొండ నృసింహుడు ?[22]. అప్ప 5—112. అప్ప—అనగా అప్ప కవీయము. అందు 'కొలందిగ మున్నుచెప్పెఁ జలికొండ నృసింహుడు' అని యున్నది. చలికొండ నృసింహుడు సరియైనది. అందుననే 'వెలగకు వెల్గయంచు సరవిం జలికొండ నృసింహుఁ డాడఁగా' అని 5—114 లో మఱియొక ఆకరమున్నది. కాని యిం దీయబడలేదు.

పుట. 172. 2. నొడగంగదేవుడు. ఇది చోడగంగదేవుడుగా నుండవలెను. పైని 1 లో చోడ అన్నదేవరామ ఉన్నది.

పుట. 190. 40. తరుణసిరి—హర. 1—28 హరవిలాసము 1—28 లో 'తరుణాసిరి' అని యున్నదిగాని 'తరుణసిరి'లేదు. 'తరుణాసిరి తవాయి గోవ రమణాస్థానంబులన్';—తరుణసిరి — అప్పగణ భంగము.

తరుణాసిరి అనునది 'దన్నాసరి—దనాసరి'గా మాఱినది—దనాసరి—గోంగూరకు ప్రసిద్ధి.

పుట. 207. 5 తెనుగు జొమ్మయ్య—ఇతడు తెలుగు జొమ్మయ్య. 'తెలుగు జొమ్మయగారి దీలుపర్చితివా.' (ప్రాస) పండి. పురా.

| | | |
|---|---|---|
| 267 | 170 | పసర్లపూడి |
| 274 | 138 | పాశర్లపూడి |

ఇది 'పాసెర్లపూడి'లంక. వడ్డాది సుబ్బారాయ కవి జన్మస్థలము. "పుట్టుక 'పాసెర్లపూడి'లంకను"; వసురాయ చాటు ప్రబంధము.

పుట. 295. 26. పానుగుపాటి వేంకట మంత్రి—ఇతడు పాణుగుపాటి వేంకటమంత్రి — చూ. ఆడిదము సూరకవి పాణుగుపాటి వేంకట మంత్రి శతకము.

పుట 299. ఇందు 'పొఱంటి వెన్నడు' అను పేరులేదు.

'అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి
నసేకులు రాజనందనుల్
సనిన బొఱంటి వెన్నఁ డనుసంభవుడయ్యె'
—విరియాల కామసాని గూడూరు శాసనము

ఈ పొఱంటివెన్నడే—పొరంకి, పోరంకి వెన్న డుగా సిద్ధేశ్వర చరిత్రమున, ప్రతాప చరిత్రమున పేర్కొనబడినాడు.

పుట 326. 16. బ్రహ్మయ్యశాస్త్రి—చెర్ల. తిరుపతి వేంకటకవుల గురువగు బ్రహ్మయ్య శాస్త్రి 'చర్ల' బ్రహ్మయ్యశాస్త్రి—కాని 'చెర్ల' కాదు. 'చర్ల బ్రహ్మసుధీగురూత్తముని వాచాపూర్తి కీర్తింపఁగా'. (చ—యతి). తిరుపతిశాస్త్రి చాటువు.

పుట. 336. 36. మంచికంటి జాబిన—ఇతడు మంచికంటి ఓబనగాని 'జాబిన' కాదు. ఈత డప్పకవి గురువులలో నొకడు.

వెస నన్ను లక్షణవేత్త గావించిన
ఘను మంచికంటి యోబన కవీంద్రు'
అప్పకవీయము 1—32

అప్ప—4—అను సాంకేతికము తప్పు.

పుట. 360. సం. 161. మారనార్యుడు. (చెదలువాడ మహాత్ముడు)

సకల. 1—8. సకలనీతికథానిధానమున తెలుగుకవిస్తుతిలోని దీ పద్యము.

ఇచట—'చెదలువాడ మహాత్ముని మారనార్యు నిన్' అనియే ముద్రణములో కలదు. 'చెదలువాడ మహాత్ముడు' అనగా భారత కవిత్రయములో ఎఱ్ఱా

22. ముద్రితము.

(ప్రెగ్గడ. చదలువాడ నివాసి. మారనార్యుడు—మాదన—మార్కండేయ పురాణ కృతికర్త. కాబట్టి మారనార్యుడు చెదలువాడమహాత్ముడుకాడు. ఇద్దఱు వేరు. ఇందు రెండును ద్వితీయావిభక్త్యంతాలు. ఇద్దఱు వ్యక్తులు.

పుట. 361. 169. మారయకవి—మై రా. 1—18—21.

మై రా. అనగా మైరావణచరిత్ర—మైరావణ చరిత్ర రచించిన కవి మాడయకవిగాని మారయకవి కాడు. 'ప్రౌఢ వన్నింట సర్వయమాడ సుకవి' అని యందే ప్రాసలో నున్నది. (1—21).

పుట. 483. 129. సర్వయమాదకవి—'మాడకవి'గా నుండవలెను.

పుట. 361. 190. మార్కండేయ మునినాథుడు. కాశీ. 1—58.

కాశీ. అనగా కాశీఖండము. అందున్న పద్య పాద మిది.

'ఉండు నేపీట మార్కండేయ మునినాథ
సజ్జలింగ మనంగశాసనుండు.'

ఇచట మార్కండేయ మునినాథుడనగా మార్కండేయ మహాముని తన సజ్జలింగమునన్న శివుని—రాజమహేంద్రవరమున స్థాపించినాడు.

మార్కండేయుడు పౌరాణికవ్యక్తిగాని చారిత్రకవ్యక్తి కాడు. అట్లయిన-తక్కిన పౌరాణిక వ్యక్తులు చేర్పబడవలెను.

పుట. 420. 13. వటమూలు సోమనాథుడు—నాగ. 1—10.

ఇది తెలుగుకవిస్తుతిలోనిది—వటమూలు సోమనాథు డొక వ్యక్తి కాడు—ఇద్దఱు వ్యక్తులు. మూలములో, 'వటమూలు సోమనాథు' అని ద్వితీయాంతములుగా నున్నవి. వటమూలుని, సోమనాథుని అని యర్థము — వటమూలుడు, వేమన గురువులలో నొకడు.

'భవదూరుడు వటమూలుడు
శివమయ చిన్మయుడు సోమశేఖర గురుడున్'
అని వేమన పద్యములు.

ఈతడు, ఆత్మసంబోధన చేసికొనుచు 'వటమూలమందిరా' అను శతకము రచించినాడు. అందైదు పద్యములు లభించినవి.

(చూ. భారతి—జూన్—1935

## ఆరోపములు: వ్యత్యాసములు—సందేహములు

| పుట సంఖ్య. | క్ర. సం. | వ్యక్తి లేక స్థలము |
|---|---|---|
| 3 | 26 | అగస్త్యేశ్వరుడు. భీమ 3—172. ఇతడు చారిత్రక వ్యక్తియా? |
| 33 | 168 | అళియ తిమ్మరస. ఇది 'అ' క్రింద నున్నది. 'అ' క్రింద వ్రాయవలెను—అళియ అనగా అల్లుడు. |
| 34 | 19 | ఇందులపల్లి భవానీపతి (కవి). ఇతని యింటిపేరు 'ఈదులపల్లి'. 'ఈ' క్రిందనుండవలెను. (చూ. కవుల చరిత్ర) |
| 43 | 95 | ఉమామహేశ్వరుడు. ఇతడో చారిత్రక వ్యక్తియా? |
| 53 | 7 | ఐనవోలు. ఇది అయ్యనవోలు. 'అ'లో నుండవలెను. |
| 58 | 61 | కందుకూరి జనార్దనుడు. ఇతడు చారిత్రక వ్యక్తియా? |
| 67 | 177 | కర్ణాటక్షితినాథుడు. ఇది ప్రత్యేక వ్యక్తిపేరా? |
| 72 | 284 | కస్తూరి—కస్తూరి స్మృతి? చారిత్రకమా? |
| 80 | 170 | కావలి వెంకటబొర్రయ్య తె. రా. 13 |

| | | |
|---|---|---|
| 93 | 232 | కృష్ణమాచార్యులు ఆణవల్లి } ఇద్దఱు |
| | 236 | కృష్ణమాచార్యులు యణవెల్లి } వేర్వారా? |
| 94 | 275 | కృష్ణసుధి—అలం. శా. ? |
| 130 | 94 | గర్భధారకుడు—ప్రత్యేక వ్యక్తి పేరా? |
| 153 | 11 | చతుర్ముఖపురము (చేబ్రోలు) |
| | | చేబ్రోలు—తామ్రపురి—చూ. తె. క. చ. |
| 157 | 58 | చాళుక్య విశ్వప్రభువు |
| | 59 | చాళుక్య విశ్వేశ్వరుడు, 49 వ పుటలోని 108 సం. |
| | | ఎలమంచి విశ్వేశ్వర చక్రవర్తి ఒక్కడే. |
| 206 | 1 | తెట్టు—మదనపల్లి తా. చిత్తూరు జి. |
| | | కాని చరిత్ర ప్రసిద్ధమైనది నెల్లూరుజిల్లా కావలి |
| | | తాలూకా తెట్టు. అది సంస్థానము. దీనినిగూర్చి మోచర్ల |
| | | వెంకన్న కవి పద్యము ప్రచారమైనది. |
| | | తెట్టు కుమారకృష్ణజగ |
| | | తీవరనందను రాజ్యలక్ష్మికిం |
| | | బట్టు ధరాంగనారమణి |
| | | పాపల బొట్టు, రిపూరుగాలి వా |
| | | కట్టు, సముజ్జ్వలద్ధృతికి |
| | | గట్టు బుధాళికి వేల్పుఱా జెట్టు వా |
| | | గ్దిట్టల కున్కిపట్టగు మదీయ |
| | | నివాసము యాచభూపతీ! |
| 218 | 27 | దివ్యేలేంద్రుని సూరధీరుడు? |
| 259 | 7 | పంచకము అద్దేపల్లి—అద్దేపల్లి పంచకము. 'అ' క్రింది |
| | | నుండవలెను. |
| | | చూ. చిలుకూరి చతుష్టయము. పుట 165. సం. 153. |
| | | చూ. బొమ్మగంటి షట్కము. పుట 323. సం. 20. |
| 280 | 9 | పూర్వరేటిచోళులు? |
| 302 | 1 | ప్రాగటూరు—కాదు ప్రాకటూరు. |
| 311 | 78 | బసవన దండనాయకుడు—హర. 3—30. |
| | | హర. అనగా హరవిలాసము. అందు 3—30 లో |
| | | 'బసవఁడు' అని మాత్రమే యున్నది. కాని బసవన |
| | | దండనాయకుడు అని లేదు. బసవడు అని చూడగానే— |
| | | బసవన దండనాయకుడు చారిత్రక పురుషుడని చేర్చి |
| | | నారు. శుద్ధముగా అసంబద్ధము. ఇచ్చట బసవడనగా |
| | | సాక్షాత్తు నందీశ్వరుడు. ఈశ్వరుడు తపస్సు చేయ |
| | | సంకల్పించినప్పుడు ప్రమథవర్గమును, నందీశ్వరుని |
| | | విడిచిపెట్టెను. |
| | | 'తపముసేయంగ మదిలోనఁ దలచి విడిచెఁ |
| | | బ్రమథవర్గంబు దానును బసవఁడపుడు.' |

ఆరోపాలలో కొన్నిటికి కుండలీకరణం చేసిన అంకెలు ఇంగ్లీషు అక్షరాలు ఉన్నవి. ఇవి ఎందుకొఱకో?

| | | |
|---|---|---|
| 5 | 68 | అట్లేరు నది (57 M/15) |
| 13 | 263 | అప్పాపురం (Project System), (65 D/8) |
| 32 | 148 | ఆలేరునది (56/0/7) |
| 35 | 11 | ఇడగలి కాలువ (57 N/15) |
| 35 | 16 | ఇనగాల ఏరు (57 M/15) |
| 46 | 16 | ఎద్దువాగు (65 D/2) |
| 47 | 57 | ఎఱ్ఱవంక (57 F/9) |

ఇట్టివి 236 ఉన్నవి. అసలు గ్రంథంలోకూడా—పై విధముగానే ఉంచుతారా?

## ఆకరముల పరిశీలన

ఈ గ్రంథమున నీయబడిన ఆకరములు మూలగ్రంథములతో సంప్రతింపబడియుండలేనట్లు తోచుచున్నది 'ఉదాహరణమునకు కొన్ని చూపుచున్నాను.

పుట. 21. 482. అల్లయ వీరభద్రుడు. శివలీ. 1—1. శివలీ. అనగా శివలీలావిలాసము. అందు 1—1—అనగా మొదటి పద్యము—కాని శివలీలావిలాసమున తొలి పద్యములో వీరభద్రుని పేరేలేదు—పద్యమిది.

'శ్రీ దనరార మ్రొక్కిన గి
రీంద్రవరాత్మజఁ జేర్చువేళఁ ద
త్పాద సముల్లస న్నఖర
దర్పణవీథులఁ దేజరిల్లు యే
కాదశమూర్తి భేదములఁ
గన్నులపండువుసేయు శంభుఁ డా
హ్లాదకరుండు గాచు మన
యల్లయదొడ్డనృపాలశేఖరున్'

ఇం దల్లయదొడ్డరాజు పేరున్నది.

పుట 56. 6. ఔ. ఔబళేశుడు మేదర మెట్ల.

1. ప్రబో. 30;
2. కావ్యా—75;
3. చా. మం. 1-90.

1. ప్రబో. అనగా ప్రబోధ చంద్రోదయము[24].

30 అనగా ప్రథమాశ్వాసములోని 30 వ పద్యము. అందులో ఏపేరూలేదు. 30 వ పద్యము—కుకవినింద.

ఆ వె. కరభములకుఁ బుష్పిత రసాల వాటికఁ
దిరుగఁ గంటకంబు దొరకనట్లు
కుకవి కీటకములకు సుకవి కావ్యములోన
నెమక వీసమంత నెరసు లేదు.[24]

2. కావ్యా—75. కావ్య. అనగా కావ్యాలంకార సంగ్రహము—భట్టుమూర్తి రచితము. అందు 75. అనగా 75 వ పద్యము. అందులో 'మేదర మెట్ల ఔబళేశుడు' అను పేరేలేదు. ఆ పద్యము చూడండి.

సీ. ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవ తిప్ప
ధరణీశుఁ డేరాజు తాతతాత
నరనుతుం డైన పిన్నమరాజు సౌజన్య
ధన్యుఁ డే రాజన్యు తాతతండ్రి
యమితన్న భవుం డైన యార్వీటి బుక్కభూ
తల నాథుఁ డేరాజు తండ్రితండ్రి
యసమాన దాన విద్యాధురంధరుడగు
రామరాజేంద్రుఁ డే రాజుతండ్రి
తే. యట్టి సోమాన్వయాబ్ధిశీతాంశుఁడనఁగ
నమరు శ్రీరంగవిభు పుత్రియై చెలంగు ..

24. ప్రబోధ చంద్రోదయము నంది మల్లయ ఘంటసింగయ కవుల కావ్యము. ఇప్పటికి డెబ్బదేండ్ల క్రిందట క్రీ. శ. 1900 లో వీరేశలింగముగారిచే ముద్రితమైనది, తిరిగి అచ్చువేయబగిన కృతి.

లక్కమాంబను వరియించె లలితశీల
సమ్మహాసాధ్వి సోదరు లధికయశులు. 1—75 పుట 21.

3. చా. మం. 1—90. చా. మం. అనగా చాటుపద్యమణిమంజరి.

అందు 1—90 అనగా ప్రథమ భాగము 90 వ పుట. కాని ఈ పుటలో 'ఆక్షేపము' అను శీర్షిక క్రింద 4 పద్యములు—(చంపకోత్పలములు). 'అతని ప్రశస్తి' అను శీర్షికలో సీసపద్యములో మూడు పాదములు మాత్రమే యున్నవి. ఇవియన్నియు గోపరాజు రామప్రధానికి సంబంధించినవి గాని—మేదర మెట్లబొబ్బశేశున కెంతమాత్రమును సంబంధించినవి కావు. మఱి యీ ఆకరమెక్కడిది?

ఈ సందర్భమున చాటుపద్యమణిమంజరి లోని ఆకరములు ప్రకటనకర్తలు పరిశీలింపలేదని యీ క్రింది యుదాహరణలనుబట్టి చెప్పనచ్చును.

పుట. 58. 61. కందుకూరిజనార్దనుడు. చా.మం. 177.

చాటుపద్య మణిమంజరి రెండు భాగములుగా నున్నది. మొదటి దానికి 1 అని, 2 వ భాగమునకు II అని సూచనలున్నవి. కాని పై ఆకరమున, I, II సూచనయే లేదు. ఈ ఆకర మే భాగములోనిది?

పుట 75. 62. క్రొత్తావులపల్లి (సంస్థానము) చా. మం—135. ఏ భాగములోనిది?

ఇట్లే పుట—86. 62 కుమార తిమ్మడు; చా. మం. 57.

127. 4. గజపతి. చా. మం. 316.

145. 99. గోలుకొండ. చా. మం. 113, 48, 51.

319. 5. బెండపూడి అన్నమంత్రి. చా. మం. 73, 74.

339. 21. మచ్చర్ల తిమ్మన. చా.మం.287.

కొన్నిమాత్రమే చూపితిని. అన్నింటిని చూపుట కవకాశము లేదు. ఇంకొక్కటిచూపి విరమిస్తున్నాను.

పుట. 358. 98. మాధవరాయకవి. వసు. 1—1. అనగా తొలిపద్యము—అందు మాధవరాయ కవి పేరేలేదు—పద్యమిది.

'శ్రీ భూపుత్రి వివాహవేళ
నిజమంజీరాగ్రరత్నస్వలీ
లాభివ్యక్తవరాంఘ్రిరేణు
భవకన్యాలీలయంచు న్మదిం
దా భావింప శుభక్రమాకలనచే
ద్రత్నముం గప్పు
సీతాభామాపతి బ్రోవుతన్
తిరుమలేంద్ర శ్రీ మహారాయనిన్'

దీనినిబట్టి వసుచరిత్ర తొలిపద్యములో మాధవరాయ కవి పేరు లేదు.

## అచ్చుతప్పులు

ఇట్టి 'సర్వస్వము'లలో అచ్చు తప్పులుండుట కణుమాత్రమైనా అవకాశములేదు—అంతేకాక, ప్రాయికంగా—ఈ సర్వస్వముఖద్వారమంతా, సంజ్ఞావాచకాలు—ఊళ్లపేళ్లు, మనుష్యులపేళ్లు, స్థలాల పేళ్లు—వీనితో నిండియున్నది. అట్టి సందర్భంలో అచ్చు తప్పులుంటే ఎంతప్రమాదకరమో సర్వస్వకర్త లూహింపవలసియున్నది.

| పుట. | సం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 81 | అతిగొప్పల | గొప్పల |
| 14 | 299 | వెల్లూరి | వెల్లాల |
| 15 | 311 | మమరినేడు | అమరినేడు |
| 50 | 112 | ఎలిగందల | వెలిగందల |

| పుట. | సం. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 52 | 20 | ఏదువాడల | ఏడువాడల |
| 55 | 19 | ఓడుగంటి | ఓరుగంటి |
| 56 | 6 | మెదరమెట్ల | మేదరమెట్ల |
| 59 | 71 | గణిపయ్య | గణపయ్య |
| 64 | 100 | కన్నడ్డీమణి | గన్నడ్డీమణి |
| | | పిలలమజ్జి | పిల్లలమజ్జి |
| 68 | 178 | కరాట | కర్ణాట |
| 72 | 279 | రహిం. X నెం | దహిం. X నెం. |
| 79 | 145 | కాలహస్తి | కాళహస్తి |
| ,, | 155 | కాల్దరి | కాల్దారి |
| 84 | 2 | కున్కుటపతి | కుక్కుటపతి |
| 86 | 66 | దూర్జటి | ధూర్జటి |
| 87 | 93 | సోమపీఠి | సోమపీథి |
| 90 | 176 | కూడత్ | కూడలి |
| 103 | 12 | చాచయ్య | బాచయ్య |
| 113 | 16 | కోటదొత్త | కోటదొడ్డ |
| 114 | 42 | అరాధ్యులు | ఆరాధ్యులు |
| 116 | 100 | కోసయ | కూనయ |
| 124 | 35 | గగాదానుడు | గంగాదాసుడు |
| 127 | 7 | గపపతి | గజపతి |
| 129 | 51 | వుధాని | ప్రధాని |
| 136 | 33 | గుతి | గుత్తి |
| 138 | 73 | ప్రైడాల | పైడాల |
| 171 | 4 | చోక్క | చొక్క |
| 175 | 14 | జచదేక | జగదేక |
| 177 | 59 | జడాచోళ | జటాచోళ |
| 181 | 1 | జిక్క | చిక్క |
| | 2 | జిక్తి | భక్తి |
| 190 | 39 | తరిగొప్పల | తరిగొప్పుల |
| 198 | 106 | మూకరాజా | మాకరాజా |
| 245 | 69 | నాగార్జునచార్యుడు | నాగార్జునాచార్యుడు |
| 248 | 159 | పర్లాకిమడి | పర్లాకిమిడి |
| 249 | 184 | ఆఖివిళ్ల | ఆణివిళ్ల |
| 251 | 5 | పటం | పట్నం |
| 252 | 36 | సం. హి. చ. | సం.. వా. చ. |
| 264 | 84 | అన్నేము | అన్నెము |
| 267 | 165 | పల్లె | పళ్లె |
| 272 | 93 | క్రామము | గ్రామము |

| | | | |
|---|---|---|---|
| 286 | 116 | ఎనుముపల్లి | ఎనుములపల్లి |
| 293 | 21 | హ్వాతం | స్వాతం |
| | 33 | సురథామ | సురధాని |
| 297 | 7 | పోచిన | పోచన |
| 302 | 1 | ప్రాగటూరు | ప్రాకటూరు |
| 307 | 8 | గోనింద | గోవింద |
| 320 | 13 | బెలిదేవి | బెలిదేవ |
| 362 | 197 | మూర్కో | మూర్కో |
| 389 | 15 | ఈడ్పుగంటి | ఈడ్పుగంటి |
| 397 | 220 | బ్రహ్మకాస్త్రి | బ్రహ్మశాస్త్రి |
| 401 | 307 | కొన్నేపల్లి | కన్నేపల్లి |
| 414 | 53 | బోల్ల | లోల్ల |
| 447 | 114 | నందిగానం | నందిగామ |
| 448 | 133 | గొబ్బూరి | గొబ్బూరి |
| 474 | 1 | శ్రేషలూరి | శ్రేష్ఠలూరి |
| | 2 | షట్సహ | షట్సహస్ర |
| 476 | 8 | షేక్25 | షేర్ |
| 480 | 53 | సనరవోలు | సనదవోలు |
| 487 | 59 | మేకరాజు | మాకరాజు |
| 489 | 41 | సంస్థాద | సంస్థాన |
| 492 | 20 | బిక్షవృత్తి | బిక్షావృత్తి |
| 500 | 57 | కొమ్మరెడ్డి | కొమ్మిరెడ్డి |

కొన్నిమాత్రమే చూపితిని. స్థలసంకోచముచే మిగిలినవి చూపలేదు.

పైని వివరించినవేగాక ఇంకా ఎన్నెన్నో అప్రామాణికాలు అసంగతాలు అయిన విషయాలిందున్నవి. వాని నన్నింటిని విశదంగా తెలుపుటకు ఇది సమయమూకాదు—ఉచితమూ కాదు. ఈ గ్రంథాన్ని బట్టి చూచినట్లయితే—ఆంధ్ర రచయితల సంఘమువారు వేసిన ప్రణాళిక యొకటి, చేసినది మఱియొకటి అయినదని చెప్పకతప్పదు. ఇట్లాంటి గ్రంథాలలో ఆరోపాలు ఆకరాలు సేకరణ జరిగిన తర్వాత—ముఖ్యంగా ప్రతి ఆరోపాన్ని—ఆకరాన్ని కూలంకషపరిశీలనచేసి, వాని పర్యవేక్షణ అయిన తరువాతనే గ్రంథరూపంగా రూపొందించాలి.

జ్ఞాపిక—

సమీక్షా గ్రంథ స్వరూపాన్నిబట్టి — ఈ వ్యాసంలో విధిగా అంకెలు, పేర్లు అపరిమితంగా ఉదాహరింపవలసి వచ్చింది. ఇందుమూలంగా పాఠకులకు క్లేశము కలిగించినందులకు మన్నింపగోరుచున్నాను.

---

25. శ్రీకాకుళంజిల్లా చీపురుపల్లితాలూకాలో నున్నది. షేర్ మహమ్మదుపురంకాని షేక్—మహమ్మదుపురంకాదు. షేర్—అనగా పెద్దపులి. షేక్ వంశనామము.

* ఆంధ్రదేశ—చరిత్ర—భూగోళ సర్వస్వము, 'ముఖద్వారము'; భారతప్రభుత్వ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వముల ధనసహాయముతో ప్రకటింపబడినది; ఆంధ్ర రచయితల సంఘము, విద్యానగరము, హైద్రాబాదు—7; వెల. 10 రూపాయలు. ప్రతులకు—ప్రొఫెసర్—కె. లక్ష్మీరంజనం ఎం. ఏ.; ప్రెసిడెంటు; ఆంధ్రరచయితల సంఘము, హైదరాబాదు 7.

# ఇన్ ఝండే కే నీచే

శ్రీ కలువకొలను సదానంద

ముందుగానే మనవి చేసుకుంటున్నాను—దేశభక్తుల్ని నొప్పించాలన్న ఉద్దేశం నాకు లేదు. అందరూ దేశభక్తులే! వాళ్ళు రెండు జాతులు. మట్టిని ప్రేమించేవాళ్ళు కొందరు; మనుషుల్ని ప్రేమించేవాళ్ళు మరికొందరు. మీరు రెండోరకం వాళ్ళయితేనే ఈకథ చదవండి. మొదటిరకం వాళ్ళయితే, నా మేలుకోసం మానెయ్యండి.

మహాప్రభో! నేను నిన్ను తిడితే, అది నేరమే! నిన్నుతిట్టను. ఏడుస్తాను. గుండె బాదుకుంటాను. ఇరవైఏళ్ళ క్రిందట మా అమ్మ 'సంసారం' సినిమా చూసివచ్చి సరదాగా పాడిందొక పాట. 'ఏడువకు ఏడువకు నాచిట్టితండ్రీ, భావిభారత బాలవీరుడవు నీవు!' అప్పుడూ ఏడ్చాను. ఇరవైఏళ్ళ తరవాత ఇప్పుడూ ఏడుస్తాను. నాగుండె మూలుగును పెదవులమీద పలికిస్తాను. అది నేరమని ఏ జడ్జీకూడా చెప్పడు. పుట్టగానే పసిపాప ఏడుస్తుందికదా? నువ్వు దాని నోరు మూయించగలవా? ఏడ్చే స్వాతంత్ర్యం మానవాధముడి జన్మహక్కయ్యా బాబూ! నేను ఏడుస్తాను. నీకు వేడుక చేస్తాను.

స్వీయకథ చెప్పుకునేవాడు ఊరూపేరూ చెప్పుకోవాలి కదా? మొదటే నాపేరు చెప్పాను. ఊరు—అశోకపురం అనేపేరు బాగుంది కాబట్టి, అదే అనుకోండి. కూలీలు, పంతుళ్ళు, ఎన్‌జీవోలు మొదలైనవాళ్ళు భారత జాతికి స్పెసిమన్లు. వాళ్ళలో నేనొకణ్ణి.

మీరు రోజా వార్తాపత్రిక తిరగేసే అలవాటున్న వాళ్ళయితే—ఆగస్టు పదిహేను తర్వాత రెండోరోజునో, మూడోరోజునో తప్పక ఈమాటలు చదువుతారు.

'అశోకపురం ప్రాథమిక పాఠశాలలో స్వాతంత్ర్యదినోత్సవం జరిగింది: సభకు శ్రీ జి. రామకృష్ణయ్య అధ్యక్షత వహించారు. ఉపాధ్యాయులు సర్వశ్రీ కాదర్‌ఖాన్, దానియేలు, నాగరత్నపిళ్ళె ప్రభృతులు ప్రసంగిస్తూ ప్రాణాధికమైన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవాలని నొక్కి వక్కాణించారు. ప్రధానోపాధ్యాయులు వందన సమర్పణచేశారు. పిల్లలకు మిఠాయిలు పంచిపెట్టబడినవి. పురవీధులలో గొప్ప ఊరేగింపు జరిగింది.'

ఇందులో చివరిమాటను మళ్ళీ ఓమారు చదువుకోండి. మీరు ఉలికిపడకపోతే పోవచ్చు. నాసంగతివేరు. నేనొక జపాన్. నాగుండె హిరోషిమా. ఆమాట ఒక ఆటంబాంబు!

పత్రికలవాళ్ళు చాల దయగలవాళ్ళు. అందుకే ఆ నాలుగైదు మాటలైనా అచ్చువేస్తారు. ఊరేగింపు జరిగింది—అంటూ ముగిస్తారు. ఆ ఊరేగింపు ఎలా జరిగింది, ఎలా ముగిసింది—చెప్పాలంటే అదొక కథ అవుతుంది. క్రిక్కిరిసిపోయిన మహాపట్నంలాంటి ఆ వార్తాపత్రికలో అంతచోటు ఎక్కడుంటుంది? అందుకే ఆమాటను యిక్కడ సాగదీస్తున్నాను.

వెనకటి రోజుల్లో—లేకలేక కొడుకుపుట్టిన్న మహారాజుగారు 'ప్రజలంతా పండుగచేసుకోవాలహో!' అంటూ రాజ్యమంతా చాటించేవారని మనం కథల్లో వింటుంటాం. పండుగచేసుకోవాల్సిన పుట్టుదరిద్రుల్నికూడా ఈ వసుంధర భరిస్తున్నదని ఆ మహారాజుగారు ఆలోచించేవారు కాదేమో! లేకుంటే ఆయనగారి ఏలుబడిలో అందరూ చల్లగా వుండేవారేమో!

# ఇస్ ఝుండీ కే నీచే

ఇప్పుడు మనకు రాజులులేరు. అయితే రాజుల్లాంటి వాళ్ళు, రాజప్రతినిధుల్లాంటి వాళ్ళు, వాళ్ళు ప్రకటించే చాటింపులూ లేకపోలేదు. రాజధానినుండి జిల్లా అధికార్లులకు, వాళ్ళనుండి మనపై అధికారులకూ అవి అంచెలవారీగా వస్తాయి. ఘనత వహించిన మా ఆఫీసరుగారి వద్దనుండి అలాంటి చాటింపు ఒకటి రానేవచ్చింది. 'ఇందు మూలమున యావన్మందికీ తెలియజేయడమేమనగా—ప్రతి పాఠశాలలోను స్వాతంత్ర్యదినోత్సవము జరుపుకోవలెను. ఉదయం రమారమి ఏడున్నర గంటలకు జెండా ఎగుర వేయవలెను. గ్రామములోని ప్రముఖులను రావించి ఉపన్యాసము లిప్పించవలెను. నినాదములతో పురవీధులలో ఊరేగింపు జరుపవలెను. ఈవిధముగా జరిపిన తదనంతరము మాకొక సమగ్రమైన నివేదిక తయారుచేసి పంపవలెను. ఇది అతి జరూరు'

పెద్దలమాట పరిహసింప దగింది కాదు సుమా! స్వాతంత్ర్య దినోత్సవంకంటే అతి జరూరైన విషయం దేశానికి మరేముంది? తమ ప్రాణాల్నిసైతం తృణప్రాయంగా అర్పించి, మన పూర్వులు మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టింది ఎందుకయ్యా? ఏడాదికొకసారి ఘనంగా పండుగ జరుపుకోడానికే గదా?.. ఊరేగండోయ్ ఊరేగండోయ్, ఉపాధ్యాయులారా! బోలో స్వతంత్రభారత్‌కి జై. బోలో నోరారా!

ఊరేగింపు ఒక్కటి మాత్రం నాకు యిష్టం లేదు. ఈమాట అన్నందుకు నన్ను అపార్థం చేసుకోకండి! రచయిత మనసువిప్పి మాట్లాడుకోవాలంటే — పాఠకుల కంటే ఆత్మబంధువులు ఆ దిక్కుమాలినవాడికి మరెవరున్నారు? అస్థిరమైన ఈ జీవితంలో నాకు అత్యంత ప్రియమైనది ఒకటుంది. అది—ఆగస్టు పదిహేను! అంతే ప్రియమైన నా జీవితంలో నాకు బొత్తిగా ఇష్టంలేనిది ఒకటుంది. అది—ఊరేగింపు!

అయితే, కేవలం నా ఒక్కడి ఇష్టానిష్టాలతో మా హెడ్మాష్టరుగారి కేంపని? ఆయనకు అత్యంత ప్రియమైనది విధేయత! మనం ఉత్తరమో, విజ్ఞాపనమో వ్రాసేటప్పుడు చివర 'ఇట్లు తమ విధేయుడు' అని వ్రాస్తాం. మా హెడ్మాష్టరుగారు కూడా అమాటే వ్రాస్తారు. అయితే మనం లాంఛనంగా వ్రాస్తాం; ఆయన కలాన్ని గుండెలోముంచి మరీ వ్రాస్తాడు. విధేయత అంటే అలా వుండాలి! పై అధికారులు అప్పజెప్పిన పనిని ఆయన కలలో గూడా కాదనలేదు. ఆయన కలలు నాకెలా తెలుసంటారా? ఎందుకు తెలియదు? పైవాళ్ళిచ్చిన రాఫిల్ టిక్కెట్లు పుస్తకాల్ని ఆయన ఎప్పుడూ నిరాకరించలేదు. అంతెందుకూ, ఆయన ఎప్పుడూ ఒక్కపూట కూడా సెలవు పెట్టలేదు. అలాంటివాడు ఊరేగింపు వద్దు మొర్రో అంటే వింటాడా? రామ రామ! దొరవారు ఖరారుచేసిన కార్యక్రమాన్ని తు. చ. తప్పకుండా జరిపించి, ఊళ్ళోని సందుగొందులైనా విడిచిపెట్టకుండా ఊరేగింపు జరిపించి, కాపాడగల ప్రభువులకు రిపోర్టు వ్రాసిపంపడూ? ఒక్క ప్రభువులకే ఏమిటీ, ప్రజలకందరికీ తెలియాలి గనుక 'గొప్ప ఊరేగింపు జరిగె' నంటూ న్యూస్ రిపోర్టుకూడా వ్రాసిపంపడూ?

ఊపిరాడని ఇరుకు వీధిలోనుండి ఆరోజు ఉదయం మువ్వన్నెజెండా నింగికెగిరి 'హాయ్' మంటూ స్వేచ్ఛగా గాలి పీల్చుకొంది. ఇద్దరు ముగ్గురు ఉపాధ్యాయులు పిల్లల్ని ఉద్దేశించి ప్రసంగించారు. ఉపాధ్యాయులెప్పుడూ వుత్త ఆదర్శాలే వల్లిస్తారు! బ్రతకటానికి అవి పనికిరావు. మా చిదానందం కూడా నాలుగుమాటలు మాట్లాడాడు. పిల్లల యెదుట మేజావద్ద నిలబడి మాట్లాడుతున్న చిదానందం ఎలావున్నాడో చూడండి. ఇస్త్రీ చేయని చొక్కా—ఇంకా పూర్తిగా ఆరని ఉతికినచొక్కా—చందమామలో మచ్చల్లా అక్కడక్కడా చిరుగులున్న చొక్కా తొడుక్కున్నాడు. సిల్కులపెట్టి, చక్కగా దువ్వుకొచ్చిన క్రాపులో తడి అప్పుడే ఆరిపోయి, తల బూరుగుపత్తిలా తయారైంది అన్నగారు చప్పరించి పారేసిన నారమామిడి టెంకలా వుంది అతని మొహానికి ఆ... చిదానందం ఆ శుభోదయాన

కనీసం ఉప్పువేసుకున్న చద్దన్నం తినిగానీ, కాఫీపొడి చారీవాలని వేడినీళ్ళు త్రాగిగానీ రాలేదన్నమాట హరిశ్చంద్రుడికి ఆదర్శమంత సత్యం! లేకపోతే అతను మాట్లాడుతున్నంతసేపూ రెండుచేతులూ మేజామీదమోపి, అలా వంగినుంచోడు. అతనికంటిలో కాంతిలేదు. గొంతులో జీవంలేదు. ముఖంలో చేవలేదు. అతను చిదానందం. ఆనందాన్నిచ్చే ఏ భౌతిక పదార్థమూ అతనికి అందుబాటులో లేదు. అతని ఆనందమంతా—కంటికి కనిపించని 'చిత్తు' అనబడే పదార్థంలోనే వుంది.

అతన్ని పిడికిట్లోపెట్టి పిండినా, మనం మందుకైనా చూడలేని కాంతి, జీవం, చేవ—అతని పలుకుల్లో మాత్రం నిండు గోదావరిలా వున్నాయి.

చిదానందం అన్నాడు: 'మనమంతా స్వతంత్ర భారత పౌరులం. స్వాతంత్ర్యం స్వర్గంకంటే గొప్పది. ఆ స్వాతంత్ర్యంకోసమే మనం జీవించాలి. ఆ స్వాతంత్ర్యంకోసమే మనం సంతోషంగా చావాలి!'

చిదానందం! గొప్పమాటే అన్నావు. అయితే ముప్పూటలా ముక్కుదాకా మెక్కి, తేరెక్కి పూరేగే వాడు గంభీరంగా అనవలసినమాట నువ్వంటున్నావేమిటీ? నీ కింకేమీవద్దా? నువ్వు కోరకపోయినా, నీ కోసం నీ పెళ్ళాం కోరుకునే కొత్తచొక్కా నీకు వద్దా? గడ్డం గీచుకోవటానికి పావలాకాసు వద్దా? కడుపులో పేగులు ముడుచుకుపోకుండా వుండేందుకు చద్దన్నం వద్దా? 'ఆహా, స్వాతంత్ర్యం' అంటూ ఆకాశమంత పెద్ద పంజరంలో కూర్చుంటావా? నేను నీయంతటి మహాశయుణ్ణి కానుబాబూ! నాకు ప్రాణం కావాలి. శ్వాసలాంటి స్వాతంత్ర్యం కావాలి! స్వాతంత్ర్యంతో బాటు సుఖశాంతులు కావాలి! ఈ మూడూ నా జన్మహక్కులు. కాదనే వాడెవడైనా వుంటే—వాడు పూర్వజన్మలో బానిసల వ్యాపారి!

త్రివర్ణపతాకాన్ని గురించి నేను ఒకటిరెండు నిమిషాలు మాట్లాడాను.

ఈ పతాకం నాకు క్రొత్తకాదు. దీనితో నాకు దాదాపు పాతికేళ్ల పరిచయంవుంది. నా చిన్నతనంలో—మా అన్నయ్యకు ఓ నేస్తం వుండేవాడు. విశల్ అనే రైల్వేగార్డు. అతన్ని చూచినప్పుడల్లా నాకు మూడురంగుల జెండా గుర్తుకు వస్తుంది. ఈ జెండాను చూచిన ప్రతిసారీ, ఇందులో విశల్ ముఖం నాకు కనిపిస్తుంది.

పిల్లలూ! నేను మీ యంత చిన్నవాడుగా వుండేరోజుల్లో ఓనాటి ఉదయం మామూలుగానే బడికి వెళ్లాను. బడిఅంతా చాలా సందడిగా వుంది. ఏమంటే — మనక్కు స్వరాజ్యం వచ్చిందన్నారు మా పంతుళ్లు. స్వరాజ్యం అంటే మాకు అర్థం కాకపోయినా, మేమందరం ఎంతో సంతోషించాం. అంత సంతోషాన్ని ఈనాటిదాకా మళ్లీ అనుభవించలేదనుకోండి. మా పంతుళ్లు మాకు చిన్న చిన్న కాగితపు జెండాలు, వాటిని గుచ్చి పెట్టుకోడానికి గుండుసూదులూ యిచ్చారు. ఆ జెండాలో మూడు రంగులున్నాయి. మధ్యలో తెలుపు, ఒక అంచున ఎరుపు, రెండోఅంచున ఆకుపచ్చ. ఎరుపు, ఆకుపచ్చ రంగుల నడుమ తేడా నాకు ఆ పసితనంలో తెలియలేదు. ఆరెండు రంగులూ నాకంటికి అందంగానే కనిపించాయి. ఆకుపచ్చరంగు—పైన, ఎర్రరంగు—క్రిందా వుండేటట్లుగా నా కాగితం ముక్కను ఎదురు రొమ్మున చొక్కాకు గుచ్చుకుని మురిసిపోతూ బడిముందర నిలబడ్డాను. అప్పుడు దారిన పోతున్న విశల్ నా దగ్గరికి వచ్చి 'అలా కాదురా బుల్లిగాంధీ, ఇలా!' అంటూ నా జెండాను తిరగేసి గుచ్చాడు. ఆయన రైల్వేగార్డు కదా? ఎర్రజెండా, పచ్చజెండా అతనివే కదా? ఆ రెండురంగుల తేడా నాకంటే ఆయనకే బాగా తెలుసుమరి!

ఆరోజున మేము—నేటి పౌరులం, అంటే నిన్నటి బాలలం—మహోత్సాహంతో, ఎక్కడెక్కడ ఇళ్ళున్నాయో అక్కడికల్లా ఊరేగింపు వెళ్లాం. జేజేలు పలికాం. కేరింతలు పెట్టాం. చప్పట్లు కొట్టాం. గాంధీజీకి జై అన్నాం. జీన్నా జిందాబాద్

అన్నాం. అలుపూ సొలుపూ లేకుండా నడిచాం. ఎందుకు, ఎందాక అన్న ప్రశ్నే లేకుండా నడిచాం. రెండు పుష్కరాలు నడిచాము. ఇలా నడుస్తూ వుండగానే మా గులాబీరేకుల పాదాల్లోని మార్దవ మంతా మాసిపోయింది. ఇప్పుడికాళ్లు ఎలాకాయలు గాచిపోయాయో చూడండి. ఇక మావల్లకాదు మేము నడువలేము. 'ఎంతెంతదూరం, ఇంకెంత దూరం?' అనుకుంటూ నడవటానికి మాలో ఓపిక చెప్పుల్లా అరిగిపోయింది మా తరం గడిచిపోయింది, ఈతరం మీది! నడవడం యిక మీవంతు. ఊరేగండి. వీధు లన్నీ తిరగండి. ఎవరికి, ఎందుకు, ఏం లాభం అని ఆలోచించకుండా జేజేలు పలకండి. ఈ లేత ప్రాయంలో మీరు నిజమైన స్వతంత్రులు. పెద్ద వాళ్లయ్యాక మీకు ఆ స్వాతంత్ర్యం వుండదు వీధుల్లో నిబ్బరంగా తలెత్తుకుని తిరిగే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మీలాంటి చిన్నవాళ్లకేగానీ, నాలాంటి పెద్దవాళ్లకు లేవు.

ఊరేగింపు మొదలైంది.

ప్రాణము, మానము, ధనము—ఈమూడూ మనిషి వదులుకోడానికి యిష్టపడనట్టివి. ప్రాణం వున్నా, నేను జీవచ్ఛవాన్ని. ధనం అందామా—సున్నలన్నీ నావే! ఇక మిగిలింది మానం! దాన్ని పోగొట్టుకోవడం నాకు సుతరామూ ఇష్టంలేదు. మరోమాటలో చెప్పాలంటే—వీధుల్లో నడవడం నా కిష్టంలేదు.

అయినా నడవక తప్పదాయె! ఇది స్వాతంత్ర్య దినం!

పశువుల పండుగ అంటే ఏమిటో మీకు తెలుసనుకుంటాను. ఆరోజు పశువులకు ప్రభలు కడతారు. వీధుల్లో వాటిని తరుముతారు. అవి మొండికేస్తే వెంటబడి డప్పులు వాయిస్తారు. పాపం, బ్రతికినంతకాలం రెక్కలు ముక్కలు జేసు కుంటూ, బ్రతుకుతున్న నేరానికి నానాగడ్డి తింటూ విధిరాకాసి తమ మెడలమీద బిగించికట్టిన కాడికి అంకితమైపోయిన నిర్భాగ్యప్రాణులవి — నోరులేని జీవాలవి— ఆ వేడుకపూట వీధికి యిరువైపులా క్రిక్కిరిసిపోయిన జనసమూహాన్ని చూసి బెదిరిపోయి, అడుగు కదలక బొమ్మలై నిలబడిపోతే, వెనక డప్పులు హడలగొట్టేస్తూవుంటే ఎటు వెళ్లడానికీ దిక్కులుతోచక, అడ్డదిడ్డంగా చిందులు వేస్తాయి. నాటి పేరుమీదుగా జరిగేపండుగ అది.

ఇది స్వాతంత్ర్య దినం!

వీధుల్లో వెళ్లటానికి భయమెందుకు? మనుషులు నడవటానికే గదా—అశోకవర్ధన చక్ర వర్తిని మరపించే ఇంచక్కని బాటలు వేయించారు మనవాళ్లు?...అడగవలసిన మాటే!

అయితే నేను చెబుతున్నది మాన్యుల్నిగురించి కాదు! సామాన్యుల్ని గురించి. వీధిలో గండుపిల్లి మీసాలు నాక్కుంటూ నిలబడివుంటే, చిట్టెలుక ఎలా నడుస్తుంది? చారల బెబ్బులి కోరలు బయటపెట్టి పచార్లుచేస్తూవుంటే మేకపిల్ల ఎలా నడుస్తుంది? బ్రహ్మరాక్షసి నింగికి నిచ్చెన వేసి నట్లు నిలబడి 'నరవాసన, నరవాసన' అని పెడ బొబ్బలు పెడుతూంటే, దాని కాళ్లసందులోంచి ఏ బ్రాహ్మడు నడిచిపోగలడు?

చిన్నప్పుడు ఒకరకమైన బొమ్మల పజిల్స్‌తో కాలక్షేపం చేయడమంటే నాకు చెవికోసుకునేటంత సరదా. ఇదిగో, ఇక్కడ ఎలుకవుంది. అక్కడ కలుగు వుంది. కలుగు చేరుకోవడానికి ఎన్నో దారులున్నాయి. వుడుగడుగునా ఎన్నోపిల్లులు ఎలుకను పట్టుకుందా మని పొంచి చూస్తున్నాయి. పిల్లినోట్లో పడకుండా ఎలుక కలుగులోకి వెళ్లిపోవాలి. నువ్వు దానికి దారి చూపించగలవా?

అల్లరి మేకపిల్ల అడవిలో తప్పిపోయింది. అడవి చివర మేకలకాపరి వున్నాడు. అడవినిండా పులులూ, తోడేళ్లూ వున్నాయి. మేకపిల్ల ప్రాణా లతో బయటపడేమార్గం ఏదో కనుక్కో!

ఇలాంటి పజిల్స్‌లో — నిరపాయకరమైన చుట్టుదారి ఒకటే వుంటుంది. ఆ దారిని నేను

యిట్టే కనిపెట్టేసి, ఆపదలోంచి బయటపడ్డ ఎలుకలా, మేకపిల్లలా సంబరపడి పోయేవాణ్ణి. పెద్దయ్యాక ఈ ఆట నాకు నిత్యజీవితావసరమై పోయింది. ఇప్పుడీ బొమ్మగీయండి. ఓ పాతిక వీధులు. ఈ చివర—పెంకులు రాలిపోతున్న నా అద్దెకొంప లోంచి నేను తొంగిచూస్తున్నాను. నా తల మేక తలకాయలాగా వుండాలి! ఆ చివర దూరంగా నేను పని చేసే బడి. (బడి ఎలావుండాలి? మీ వూళ్ళో బడిని చూసి గీయండి!) వీధుల్లో, వీధి మలుపుల్లో పులులు, తోడేళ్ళు, కత్తులు నూరిన కసాయి వాళ్ళు, పాత రాతియుగపు బ్రహ్మరాక్షసులు! బాబోయ్, గంట ఎనిమిదైపోయింది. నేను బడికెలా వెళ్ళాలి?

వెతికే వాడికి ఏదోఒక దారి కనిపించకపోదు. నేనెప్పుడూ ఆ ఒక్క దారిలోనే నడుస్తాను. వీధులన్నీ తిరగడం ఎప్పుడో మానేశాను.

ప్రభుత్వకార్యాలయాలపైన, ప్రైవేటు భవనాలపైన జాతీయపతాకా లెగురుతున్నాయి. రంగు కాగితాల తోరణాలు రెపరెప లాడుతున్నాయి. పిల్లలు బారులుబారులుగా వీధిలో నడుస్తున్నారు. వాళ్ల చేత మా చిదానందం బిగ్గరగా జేజేలు పలికిస్తున్నాడు. పోలేరమ్మజాతరలో నడిపింపబడే పొట్టేలులా నడుస్తున్నాను నేను. పడుపుకత్తె పటాటోపం కోసం ముఖంనిండా పౌడరు పులుముకున్నట్లు—కృత్రిమమైన మందహాసాన్ని నా ముఖంనిండా పులుముకున్నాను. ఏదో ముఖ్యమైన కర్తవ్యం నా ఒక్కడి నెత్తిన వున్నట్లు, ఇప్పుడు నేనాకర్తవ్య పాలనలో మునిగిపోయి వున్నట్లు—ప్రక్కలకైనా చూడకుండా నడుస్తున్నాను. శత్రువులు కంటబడితే ఉష్ట్రపక్షి ఇసుకలో తల దూరుస్తుందట! వట్టి దద్దమ్మ అది! నేను వీలైనంతవరకు మౌనంగానే నడుస్తున్నాను. తప్పనిసరియై సహోపాధ్యాయులతో మాట్లాడవలసివస్తే, కందమూలాలతో పొట్టపోసుకుంటున్న పరమసాత్వికునిలా మెల్లగా మాట్లాడుతున్నాను. దొంగను తేలుకుడితే, వాడు మౌనంగా వుండక నోరు బాదుకుంటాడా?

ఊరేగింపు ముందుకు సాగిపోతూవుంటే—నృత్యాలపోటీలో వినిపించే మృదంగంలా నా గుండె మ్రోగసాగింది. బకాసురుడికి ఆహారంగా బండెక్కి కూర్చున్న పిరికివాడి మరణవేదన ఎలాంటిదో నాకు బోధపడసాగింది.

అదిగో, ఆ మలుపు తిరిగితే పెద్దబజారు!

ఆ బజారులో ఎన్నోవస్తువులు అమ్ముడు పోతాయి. ఉప్పు నుంచి విస్కీదాకా అన్నిటికీ వెలలున్నాయి. ఆ వస్తువులకు ప్రాణంలేదు. నాకు ప్రాణం వుంది. అయితే నా పరువుప్రతిష్ఠలకు పెద్ద బజారులో పైసా విలువకూడా లేదు. నా పాలిటి తోడేళ్ళు అక్కడున్నాయి!

పురాణదేవతలపట్ల నాకు అసూయవేసింది. అనుకున్నంతలో అదృశ్యమైపోయే విద్య వాళ్లకు తెలుసు. ఆ విద్య నాకుంటే—నిబ్బరంగా ఎన్ని వీధులైనా తిరగవచ్చు. ఆ విద్య నాకు తెలియదు. నా విద్యలు వేరే వున్నాయి.వాటిని శరణు వేడెదగాక!

ఒక చదరం గీయండి. నాలుగు మూలలకూ ఎ, బి, సి, డి అని పేర్లు పెట్టండి. ఊరేగింపు నాలుగు భుజాలనూ చుట్టిరావాలన్నమాట! ఇప్పుడు నేను ఎ బి అనే గీతమీద మూడువంతులదూరం నడిచాను. బి సి—అనేది పెద్దబజారు. ఇక కొద్ది క్షణాల్లో ఊరేగింపు బి వద్ద మలుపు తిరుగుతుంది. అటుతరవాత సి వద్ద మలుపుతిరిగి డి వైపుగా కదిలి వస్తుంది. ఎబి ని, సిడి ని ఖండిస్తూ పెద్దబజారుకు సమాంతరంగా ఒక గీత గీయండి. అది ఒక సన్నటిసందు. ఊరేగింపులోనుండి ఊడిపడి, నేను ఆ సందుదారి పట్టాను. కాలాన్ని, దూరాన్ని సరి తూచుకుంటూ నడిచి, సందు రెండోచివర మళ్ళీ ఊరేగింపుతో కలుసుకున్నాను.

పెద్దగండం తప్పింది! చిన్నప్పుడు జలగండం, అగ్నిగండం, వాహనగండం వగైరాలు తప్పిపోయాయి. అలాంటివాటిలో ఇదొకటి. సురక్షితంగా మళ్ళీ బడి చేరుకున్నాను. పిల్లలందరూ కొండకొమ్మున కురిసిన వానలా చెల్లాచెదరుగా వెళ్ళిపోతున్నారు.

చిదానందం నాదగ్గరకు వచ్చాడు పిప్పర మెంటొకటి నాచేత బెట్టాడు. నోట్లో వేసుకున్నాను. తియ్యగావుంది. రెండో క్షణంలోనే ఈ మాటన్నాడు—'పెద్దబజార్లోంచి వచ్చేటప్పుడు నువ్వు కనిపించలేదేం?......నందగోపాలుడు నిన్ను గురించి అడిగాడు.' నా నోట్లోని పిప్పరమెంటు తృటిలో చేదైపోయింది.

నందగోపాలుడంటే — యశోదమ్మ ముద్దుల కొడు కనుకునేరు? ఆ నందగోపాలుడు గోపికల బట్టలు లాక్కుని, వాళ్ల పరువుతీశాడు. ఈ నందగోపాలుడు బట్టలిచ్చి పరువుతీస్తాడు.

అతను సర్వోపగతుడు! ఇందుగలడందులేడని సందేహమే వలదు. అతను మా వూళ్లో వున్నట్లే మీ వూళ్లోనూ వున్నాడు.

అదిగో,— 'కలయో, వైష్ణవమాయయో, యితర సంకల్పార్థమో, సత్యమో' అన్నట్లు మాటలోనే వచ్చాడు నందగోపాలుడు! సైకిలు దిగాడు. ఎదుట నిలబడ్డాడు. ఆ చూపుల్ని సహించడం ఎవరి తరం? పురుగును చూసినట్టు చూశాడు. ఈ భరతఖండంలో ఎన్ని పురుగులు బ్రతకటం లేదు! అవి బట్టలు కట్టుకోవు. అయినా వాటిమానం పోదు.

నందగోపాలుడు మంచివాడే! మర్యాదగా మాట్లాడుతాడు. చేతితో తాకకుండానే నా తల వంచేస్తాడు.

'ఇదేం బాగా లేదు సార్!'

నందగోపాలూ! నీకు నచ్చజెప్పడం ఎలా? ఇస్తాను. నీ సొమ్ము ఎక్కడికీ పోదు. నేను చాలా మంచివాణ్ణి! ఒకరి ఋణం పెట్టుకోకూడదని ఎప్పుడూ అనుకుంటుంటాను. అదిపోనీ, ఎలావుంది నీ వ్యాపారం? బాగానే వుందా? ఏమిటో పాపం, అడ్డమైన వాళ్లకందరికీ అప్పులిచ్చి, వాళ్లవెంట తిరగడంతోనే సరిపోతూ వుంది నీ పని! అన్నట్టు—నీ కొడుకు ఎన్నో క్లాసు? మూడో క్లాసా? మూడో క్లాసు పంతులు చిదానందం! బాగానే చెబుతాడులే! అతనుకూడా నీకు డబ్బివ్వాలనుకుంటానూ? అరియర్సు రాగానే యిచ్చేస్తాడులే!...

నందగోపాలుడి ముందర నేను మాట్లాడలేకపోతాను. మాట్లాడే ఒకటి రెండు మాటలైనా నంగినంగిగానే ఏడుస్తాయి. అతను వాలి!

'ఆరునెలలైపోతున్నాయి. మీరేమో కంటికైనా కనిపించరు. ఏమనుకోవాలి మేము?...' అంటూ ముఖం మాడ్చుకున్నాడు నందగోపాలుడు.

నేను చాలా ఆత్మీయంగా అతనిచేయి పట్టుకుని 'ఔనౌను, ఆరు నెలలై పోయాయి. ఈ నెల జీతం రాగానే పూర్తిగా యిస్తాను నందగోపాలూ!' అంటూ చిరునవ్వు నవ్వాను. వ్యభిచరిస్తూ పట్టుబడిపోయిన వేశ్య పోలీసువాణ్ణిచూసి అలా నవ్వుతుందేమో!

'మీ యిష్టం సార్! ఈ నెల చూస్తాము. ఆ తరవాత మమ్మల్ని నిందించి లాభం లేదు. చెప్పలేదనుకునేరు?' అంటూ సైకిలెక్కి వెళ్లిపోయాడు నందగోపాలుడు.

నందగోపాలూ! మనమిద్దరం ఒకే గడ్డమీద పుట్టాం. ఒకే ఊటనీరు త్రాగి పెరిగాం. ఒకే గాలి పీల్చి బ్రతుకుతున్నాం. అయినా—నీకూ నాకూ ఎంత వ్యత్యాసం! నిన్ను చూస్తే నా తల వంగిపోతుంది. నన్ను చూస్తే నీ తల పైకి లేస్తుంది. నాకులేని ఆ స్వాతంత్ర్యం నీ కెక్కడిది? అది ఎందులో వుంది?

ఉన్నట్లుండి—కంగారు పడిపోతున్నట్లుగా కేకలు వినిపించాయి. గుడ్లు పెడుతున్న కోడిని గుంటనక్క ఎత్తుకుపోతుంటే, కోళ్లుగల మారాజు అలా కేకలేస్తాడేమో! ఆ గొంతు లక్ష్మీపతిది! బడి ఎదుటివైపున చిరుతిళ్లు అమ్మే ఆసామీ పేరే లక్ష్మీపతి. అతని ప్రియమైన పది రూపాయల కాగితం ఒకటి ఎందుకు అలిగిందో—పువ్వులమీద వాలే సీతాకోక చిలుకలా ఎగురుతూ రోడ్డుదారి పట్టింది. పుట్టింటికి వెళ్లిపోతున్న ముద్దుల పెళ్లాం వెంటబడ్డట్టుగా—లక్ష్మీపతి కొట్టుదిగివచ్చి, ఫుట్‌బాల్

ఆటగాడిలా ఆ కాగితంవెంట కొంతసేపు కదం త్రొక్కి, చిట్టచివరికి దాన్ని చేతికి దొరకబుచ్చుకున్నాడు.

అతని ముఖంలో చిరునవ్వు!

ఆ నవ్వుకు ప్రాణం పోసినది ఏది?

అదే! డబ్బు!

అర్థంలోనే అన్నీ వున్నాయి.

నా ప్రాణానికీ దానికీ, నా మానానికీ దానికీ, నా శ్వాసకూ దానికీ, నా స్వేచ్ఛకూ దానికీ, నా సర్వస్వానికీ దానికీ ఏవో బ్రహ్మముడు లున్నాయి. కంటికి కనిపించని ముడులు అవి. ఆ అంగం ఆరోగ్యంగా వుంటేనే, తక్కిన అంగాలన్నీ బాగుంటాయి. ఆ అంగం దెబ్బతింటే, ఇదిగో—మనిషి వాలాగా తయారవుతాడు.

మనిషికి శారీరకంగా జబ్బుచేస్తే—రోగిని వేపాకుతో మంత్రించే వైద్యులింకా వున్నారు. ఆర్థికమైన జబ్బులు రాకుండా వుండటానికి ప్రభుత్వం వారి మంత్రాక్షరాలు యివిగో: 'పొదుపు చేయండి!' కొత్తమందులు కనిపెట్టి వాటిని ఎలుకలమీద, కోతులమీద ప్రయోగించే శాస్త్రవేత్తలకు మల్లే—ప్రజల సమస్యలకు పరిష్కారంగా కొన్ని నినాదాలను సృష్టించి చేతులు కడుక్కోవడంతో ఏలినవారి బాధ్యత తీరిపోయినట్లే!

'పొదుపు చేయండి' అనే మాట నా పట్ల ఒక వెక్కిరింత! నా అవసరాలకు చాలినంత సంపాదనే వుంటే, తిరణాలకు వెళ్లను. తాగి తందనాలాడను. అంతో యింతో పొదుపు చేస్తాను. అయితే—మిగిలితే కదా, పొదుపు చేయటం?

'నీ జీతమంతా ఏం చేస్తావు' అని నా ప్రియమైన పాఠకులు నన్ను అడగరు. ఆ మాట అడిగే వాళ్లు కొందరున్నారు. వాళ్లు కేవలం దేవు డనబడే భావాన్ని వివిధ రూపాల్లో ప్రతిష్ఠించి పూజించేవాళ్లు. వారికి దేవుడిపట్లవున్న విశ్వాసం—భౌతికజీవనంలోని కరుణామయమైన, దివ్యమైన సంఘర్షణపట్ల వుండదు. వడ్డీకాసులవాణ్ణి నమ్ముకుని బ్రతుకుతున్న మహాప్రభువులారా! మనిషి గుండెగోడలమాటున దివ్యజ్యోతిలా వెలిగే ఆర్ద్రతను, సానుభూతిని ఆ వేంకటేశ్వరుడైనా ఆరాధిస్తాడని మీకు తెలియదూ?

'ఇద్దరు, లేక ముగ్గురు చా'లన్నారు. సరే అన్నాను. వారానికి ఒకపూట ఉపవాసం చెయ్యమన్నారు - అప్పటికి నేనేదో నిత్యకల్యాణం పచ్చతోరణంగా మహాతినిబ్బలిసిపోతున్నట్లు! ఆ మాటనుకూడా గీతోపదేశంగానే భావించాను. నీచత్వానికి పరాకాష్ఠను 'ఆడంబర'మని తిట్టిపోసి, దానిపట్ల అంటరానితనాన్ని పాటించాను. సాంఘికావసరాలలో ప్రముఖపాత్ర వహించే రేడియో, గడియారంలాంటి వస్తువుల్నిగూర్చి కలలుగనటం తప్పితే, అవి లేనందుకు ఏనాడూ చింతించి ఎరుగను. మరి ఎందుకు బ్రతకలేకపోతున్నాను?

ఎక్కడినుంచో ఎక్కడికో వేగంగా కదిలివెళ్లిపోతున్న ఈ అణువంత చిన్నగోళంలో—సువిశాలమైన భారతదేశం నాది! ఇప్పుడిక్కడున్న ఈ గ్రహం గంటక్రితం యిక్కడలేదు వెయ్యిమైళ్ల వెనక వుండింది. మరోగంటకల్లా మరి వెయ్యిమైళ్లు ముందుకు వెడుతుంది. ఈ భూమికి సుస్థిరతలేదు. భూమిమీద నిలుచున్న మనిషి ఈ వాస్తవాన్నిగూర్చి ఆలోచించటానికి ఇష్టపడటంలేదు. ఈ భూమికి స్థిరత్వం వుందనుకుంటున్నాడతను. తన యిల్లూ, తన కొట్టూ, తన పొలం కదలటంలేదుకదా? ఎక్కడున్న యిల్లు అక్కడే వుంది! ఎక్కడున్న పొలం అక్కడే వుంది! ఇవన్నీ తనవి! ఎక్కడున్న గొంగళి అక్కడే వుంది! అది నాది!

నా దేశ విస్తీర్ణతనుగూర్చి నే నొకప్పుడు గర్వించాను. నేను భారతీయుణ్ణి! నాదనుకుంటున్న ఈ దేశంలో నా కొక్కసెంటుభూమికూడాలేదు. పరుల నేలమీద నడుస్తున్నాను. పరుల నీడలో తలదాచుకుంటున్నాను. నేను భారతీయుణ్ణయితే ఎవరిక్కావాలి? డబ్బిచ్చి కొనగలవాడిదే ఈ గ్లోబు!

దేవుడనేవాడు నా కిచ్చినవి మూడు. ఈ

భూమిమీద శ్వాసించటానికి ఒక ప్రాణం, చచ్చేదాక ఆ ప్రాణాన్ని నిలుపుకొనటానికి ఒక ఉద్యోగం, పవిత్ర భారతదేశంలో పుట్టి, గిట్టే ఒక వరం!

అడ్డదారులు త్రొక్కటానికి ఏమాత్రం అవకాశంలేని పవిత్రమైన, గౌరవరహితమైనవృత్తి నాది. దానిద్వారా నాకు వచ్చే జీతంలో ఏం మిగులుతుంది? ఆ జీతం డబ్బుల్ని కనీసావసరాలు మూడింటికి మాత్రమే వినియోగిస్తాను. తిండి కొంటాను. గుడ్డ కొంటాను. నిలువనీడకు అద్దె చెల్లిస్తాను. 'సదానంద, నీ పదాంబుజమ్ముల మదిన్నమ్మి యున్నానురా'అంటూ నా కాళ్లవద్ద పడివున్న నా ప్రియ బాంధవి, కన్నవాళ్లకు జాలిగొలిపే నా ముద్దుబిడ్డలు ముగ్గురు, పగలల్లా దేవుణ్ణి ఆడిపోసుకుంటూ, రాత్రి పూట ముక్కోటి దేవుళ్లను పేరుపేరునా స్మరిస్తూ, నిదురలో తీయని కలలుగంటూ బ్రతికే నేను— ఐదుగురం బ్రతకాలి! కలలు ఫలించే రోజుకోసం బ్రతకాలి! బ్రతకటానికి డబ్బు చెల్లించాలి!

నలకూబరుడి చేలాన్ని ఎగరేసుకుపోయిన పావురాలకు మల్లే—నా జీతం డబ్బుల్ని చిటికెలో మటుమాయంచేసే వింత పావురాలు—అవిగో, అల్లవిగో—ఆకాశపు లోతుల్లో మసకమచ్చలా కనబడుతున్నాయి చూడండి. వాటి పేరు ధరలు!

'ధరలు తగ్గాలి', 'దారిద్ర్యం తొలగాలి!'—ఇవికూడా మనవారి నినాదాలే! మంత్రాలతో మామిడికాయలు రాల్చేద్దాం! గోనెసంచులు పట్టండి!

పెరిగితే పెరిగాయిగానీ, పరమఛాందసుడని నేను అపోహపడ్డ మహాకవిచేత అభ్యుదయకరమైన మాటను పలికించాయి ధరలు. 'ఈ దయగల సర్కారువారు నాకు యిలా బిరుదాలు, బహుమతులు యివ్వకపోతే—మిరపకాయల ధరలు కాస్త తగ్గించి పుణ్యం కట్టుకోరాదూ?' అని వాపోయా రాయన. గుంటూరు మిరపకాయలాంటి మాట! ఓ కవీ, మిరపకాయలో కారం వున్నంతదాక నీ కీర్తి నిలిచియుండుగాక!

ఈ ధరలు ఎందుకు తగ్గవు? నా తల్లి గొడ్డుటావుకాదే? ఈ ధాన్యాగారం వట్టిపోలేదే!' 'విరగపండిన జొన్నచేనిలా తయారైన జనాభాకు సరిపడ్డంత గింజలు దేశంలో లేవయ్యా, కనుక వున్న గింజల్ని వేలంపాటకు పెట్టాం' అని అంటే ఒప్పుకోవలసిందే! అయితే కిరాణాకొట్టువాడు 'సరుకంతా అమ్మేశాం బాబూ, ఇక మీరు వస్తుండండి!' అనాలి గదా? అంటున్నాడా? సూర్యుడు ఉదయించడం ఏనాడైనా మానుకున్నాడా? ఏభైకోట్ల మందీ కొంటూనే వున్నారు, తింటూనే వున్నారు. మనిషికీ మనిషికీ మధ్య అంతరాలు పెరిగిపోతూనే వున్నాయి. పదిమంది అప్పులపాలై పోతున్నారు. ఆ పదిమంది దారిద్ర్యం పదకొండోవాడి పాలిటికి పాడియావై బువ్వ పెడుతున్నది. రెక్కలకష్టంతో గంజిత్రాగి బ్రతుకుతున్న వాడొకడైతే, వాడిచ్చే వడ్డీలతో పరమాన్నం కుడుస్తున్న వాడొకడైనాడు. పదిమంది క్షేమంకోసం ధరలు నేలకు దిగివస్తే, పాపం ఆ పదకొండోవాడి బ్రతుకేం కావాలి? ధరలు దేవతల్లాంటివి. అవి నేలమీదికి దిగిరావు!

పొదుపు ఉద్యమశాఖవారు నన్ను పొదుపు చెయ్యమంటుంటే నేనేం చేశాను? అప్పులు చేశాను! ఆడంబరంకోసం చేసిన అప్పులు కావు అవి. నా అవసర నిమిత్తమై నా కుటుంబ ఖర్చులకుగాను అప్పుచేశాను. ఇందుకుగాను నూటికి నెల ఒకటింటికి కొంత వడ్డీచొప్పున ప్రతినెలా చెల్లిస్తూ, పరిస్థితులు అనుకూలించినవెంటనే ఋణవిముక్తుడను కాగలను. అంతవరకూ నా తల—ఇది మేధావంతుడి తల—నీవద్ద తాకట్టు పెట్టుకో!

పరిస్థితులు అనుకూలించేదెప్పుడు? మెడలో మాంగల్యంకట్టి, నిద్రపోయే కోరికల్ని మేల్కొల్పి ఆదరాబాదరాగ్గా యుద్ధరంగానికి వెళ్లిపోయిన మొగుడి కోసం కళ్లు కాయలు గాచేలా ఎదురుచూచే కొత్త పెళ్లికూతురికి మల్లే ఎంతకాలం ఈ నిరీక్షణ? నన్ను కన్పించి వెళ్లిపోయిన నావాడు వున్నాడో, చచ్చాడో? వస్తాడో, రాడో? వాడొచ్చేలోపల ఏ ఇంద్రు

డొచ్చి నన్ను చెరిచిపోతాడో? ఏ మాయలమరాటీవచ్చి నన్నెత్తుకుపోతాడో?

గుండెకుండలో ముగ్గబెట్టిన నా ఆశ పండేదెప్పుడు? లాటరీ కట్టమంటారా? లక్ష రూపాయ లొస్తుందంటారా? నాకు రాదు! ఇది సత్యం! ఒక్కడికొస్తే రావచ్చు అందరికీ రాదు. సత్యాన్ని ఆ ఒక్కడిపరం చెయ్యమంటారా? వదు. అందరిపక్షానవున్న సత్యాన్నే చెప్పుకుందాం! నాకు లాటరీలో బహుమతిరాదు! అలాంటి గొంతెమ్మకోరికలు నాకు లేవు.

పిల్లనిచ్చిన మామగారిమీద అలుకబూనమంటారా? పాపం, అత్తమామలు ఆయనకు లేరు!

నాకు అప్పులిచ్చినవాళ్ళు నన్ను వేధిస్తారు. నా అప్పు తీర్చవలసినవాళ్ళూ నన్ను వేధిస్తారు. నేను అప్పు తీర్చవలసివస్తే అసలు, వడ్డీ—మొత్తం చెల్లించాలి. నా అప్పు తీర్చవలసినవాళ్ళు నాకు వడ్డీ యివ్వరు. వడ్డీలు కట్టవలసిరావడం ఎంత దయనీయమో, వడ్డీలిమ్మని అడగడం అంత హేయం! పవిత్రమైన దారిద్ర్యంలో తలమునకలవడానికే యిష్టపడతానుగానీ, హేయమైన బ్రతుకును నేను కోరను. కూడుపెట్టి కాపాడే ప్రభుత్వం నా కివ్వవలసిన అసలుమాత్రం యిచ్చి, అవసరంలో ఆదుకుంటే అదే పదివేలు! నా ఇంక్రిమెంటల్ అరియర్సు, అలాంటి మరికొన్ని బకాయిలు నన్ను తమ ఒడిలోకి తీసుకుని ఓదార్చే శుభవేళ ఎప్పుడొస్తుంది? ఈ ఏడా? పై ఏడా? మరొక ఐదేళ్ళకా?

తాకట్టులోవున్న నా తలకాయను విడిపించుకునేదెప్పుడు? ఆరుబయట స్వేచ్ఛగా నిలబడి, హాయిగా ఊపిరి పీల్చుకునే దెప్పుడు? ఇటువంటి స్వాతంత్ర్య దినోత్సవాన్ని కొండంతఉత్సాహంతో జరుపుకునే ఆ మహాపర్వదినం ఎప్పుడు? ఈ ప్రశ్న ఎవరినడగాలి? సుదర్శనచక్రంలాంటి ఎన్నికలు తరుముకొచ్చినప్పుడు నా గుమ్మం వెతుక్కుంటూవచ్చి నా వోటుకోసం కాళ్ళావేళ్ళాపడే ఈ వ్యవస్థ నడగనా? ఈ వ్యవస్థకు గొడుగుపడుతున్న జెండా నడగనా?

ఇంతదూరం నడిచి ఎక్కడికొచ్చానేను? ఇప్పుడెక్కడున్నాను? ఇక్కడే! ఈ జెండా క్రిందే! తల పైకెత్తాను. ప్రాణాధికమైన నా జెండా–నా మానాభిమానాలతో సమానమైన జాతీయజెండా—రెపరెపలాడటంలేదు. వాడిపోయిన పువ్వులా, నవ్వలేని నా గుండెకాయలా ముడుచుకుంది. ఎందుకు? ఏమైంది? నిన్నెవరేమన్నారమ్మా?

కన్నతల్లిలాంటి నా జెండా—తన పాదాలవద్ద నుంచున్న నన్నుచూసి, నిస్సహాయంగా నిట్టూరుస్తోందా?

‘అప్పిచ్చిన ఏ అమెరికావాడో, రష్యావాడో, మరొకడో దిగంతాలలో నిలబడివున్నాడేమో, వాడి కంటిపాపలో తన బొమ్మ పడుతుందేమోనన్న గుబులుతో గగనవీధిలో స్వేచ్ఛగా ఎగరలేకపోతోంది నా ‘జెండా’అంటూ అతిశయోక్తులు చెప్పడం నా కిష్టం లేదు, చెప్పను. ఉన్నమాటే చెబుతాను.

జెండా వూరుకోవడానికి కారణం — గాలి కదలటంలేదు.

ఉప్పుమూటమోసే గాడిదలా నా గుండె యిలా మూలిగింది : ‘ఎగురవే ఎగురవే ఎగురవే జెండా!’

# కవిత్వమున అర్థస్ఫురణ

శ్రీ కేతవరపు రామకోటి శాస్త్రి

కవిత్వములో అర్థము అప్రధానముకాదు. అస్పష్టత ఆదరణీయమునుకాదు. కవిత్వములో అర్థము ప్రధానముకాబట్టి ఆ యర్థమును ఒక భాషలోనుండి మరొక భాషలోనికి సులభముగా మార్చుకొని అన్ని భాషలవారును ఆ కవిత్వమును ఆస్వాదింపవచ్చును. అవును నిజమే. మనము కవిత్వము నొక్కదానినే వ్రాయుటలేదు. జాబులుకూడ వ్రాయుచున్నాము. మనము వ్రాయుచున్నదానికంతటికిని మన యవస్థ యేదో మనముపడుచు మనముపడుచున్న అవస్థకు మరికొంతమంది పాఠకులను లోనుచేసికొనుటయే ప్రయోజనము. మన జాబులకును అదే ప్రయోజనము. కాని మనము మన జాబులను కవిత్వ మనుకొనుటలేదు. మనము వ్రాయుచున్న నవలలను మనము కవిత్వ మనుకొనుటలేదు. కథలను కవిత్వ మనుకొనుటలేదు. మరి దేనినిగూడ ఆ విధముగా అనుకొనుటలేదు. ఒక్కకవిత్వమునే కవిత్వ మనుకొనుచున్నాము. అవునా? కవిత్వము అర్థప్రధానము. నవల అర్థప్రధానము. కాదా మరి! అట్లే కథ కూడ. ఇప్పుడు విచారింపవలసినది అర్థప్రధానము కానిదేది అని. ఏదియునులేదు. అన్నిరచనలును అర్థప్రధానములైనప్పుడు ఒక్క కవిత్వమును గురించియే ఆ మాట నంతగా నొక్కిచెప్పవలసిన అవసరములేదు కవిత్వము రమణీయార్థ ప్రధానము. మిగిలిన రచనలు వట్టిఅర్థప్రధానములు.

అర్థము అనుభవింపవలసినది. అది మూర్తము కాదు. చర్మచక్షువుకు విషయముకాదు. ఇంద్రియమునకు విషయమైనదానినుండి కానిదానిని తెలుసుకొనుచున్నాము. శబ్దము . ఇంద్రియ విషయము. అర్థము దాని కతీతము. అద్వితీయ పరబ్రహ్మమును గూర్చిన ఎరుకకు శబ్దము ప్రమాణము. కాని శబ్దము పరబ్రహ్మమును సాక్షాత్తు బోధింపదు. అట్టి శక్తి దానికిలేదు. శబ్దము బ్రహ్మసూచకమే గాని బ్రహ్మబోధముకాదు. కాని బ్రహ్మజ్ఞానమున కంతకంటె వసతియైన సాధనాంతరములేదు. అందువల్లనే శబ్దము ప్రమాణముగా గ్రహింపబడినది.

శబ్దవ్యవహారముజోలి లేకుండ కవిత్వము పృథక్ప్రసిద్ధముగాలేదు. ఏదేని మూర్తవస్తువు నాశ్రయింపని అగ్నిరూపమును చూచినవారులేరు. కవిత్వమనగా రమణీయార్థముకదా! అది అగ్ని వంటిది. అదియును అంతే. అది శబ్దము నాశ్రయించియుండును. కవిత్వము లేకుండ శబ్దమున్నది. శబ్దములేకుండ కవిత్వములేదు. కవిత్వము రూపము శబ్దము. శబ్దము అర్థము కవిత్వము. మరి సర్వరచనయును శబ్దరూపమేకదా? మరి కవిత్వము విషయమున దాని ప్రత్యేకత ఏమున్నది? ఏమియును లేదు ఏ యర్థమును కవిత్వముగా వెలయించుటకు కవి సంకల్పించుచున్నాడో ఆ యర్థమునకు వాహకములైన శబ్దములను, ఆ యర్థము కవిత్వ మనిపించుటకు వీలుగా కూర్చుచున్నాడు. ఆ కూర్పులో ఆ ప్రయత్నము లేకపోయినచో అది కవిత్వ మనిపించదు. అనగా ఒకానొక విశిష్టమైన యర్థము కవిత్వ మనిపించుటయు అనిపించకపోవుటయు తదర్థవ్యక్తి హేతువులైన శబ్దములయొక్క విశిష్టరచనాలక్షణము మీద నున్నది. ముందు రూపముచూచి మనిషి యనిపించిన తరువాతగదా మనిషితో వ్యవహరించు

నట్లు వ్యవహరించుట? ఒక యర్థమును కవిత్వమనుకొనుచున్నాము. ఒక యర్థమును అట్లనుకొనుట లేదు. ఆ యనుకొనుటకు ఈ అనుకొనకపోవుటకు ఏమి కారణము. రామాయణ కల్పవృక్షమును కవిత్వమనుకొనుచున్నాము. వేయిపడగల ననుకొనుటలేదు. రామాయణ కల్పవృక్షమునందు కంటె వేయిపడగలలో రమణీయార్థముగూడ ఏమి తక్కువగాలేదు. అయినను వేయిపడగలు కవిత్వముకాదు. ఎందువల్ల? వేయిపడగలు రచింపబడిన రీతి వేరు. రామాయణము రచింపబడినరీతివేరు. రీతియనగా అది ఒక విశిష్టపదరచన. గుణాత్మకమైనరచనఅని చెప్పవలెను. వచోన్యాసమే రీతి.[1] అది వ్యక్తినిష్ఠమై చిత్రచిత్రప్రభావము కలది. అందువలన మనము కవిత్వమును కవియొక్క వచోవిన్యాస వైశిష్ట్యమునుబట్టి అది కవిత్వమనుకొనుచున్నాము. కవిత్వమును తాదృగ్వాగ్విన్యాస వైఖరీముఖముగానే మనము దర్శింతుము. తాదృగ్వాగ్విన్యాస మంతటను కవిత్వమునే అందించునన్న పూచీ మనము పడుటలేదు. కాని కవిత్వము మాత్రము— దానిని కవిత్వముగా గుర్తించుటను కవి వాంఛించినచో దానినొక విశిష్టరీతితో రచింపక తప్పదు. రచన అనగానే అది శబ్దములతో పని. అగ్నిముఖముగా దేవతారాధన మెట్లో శబ్దముఖముగా కావ్యార్థగ్రహణమట్లు. అందువల్లనే కవులు శబ్దములతో పనిచేయుచున్నారు. వచన రచయితల కక్కరలేని ఒకానొక పదరచనయందు సుకౌశలము కవియైనవానికుండవలయును. బంధలక్షణముగల వ్యవస్థనుండి నివర్తించు సామర్థ్యమే కౌశలము. బంధముక్తికి కవిత్వము. అది సాధారణ విషయముకాదు. అందువల్లనే ఆ రచనాలక్షణ మది యోగము. కనుకనే విశిష్టము. కావ్యరచన కర్మవిశేషమే. కాని బంధహేతువుకాదు. అదే దాని వైశిష్ట్యము. మరి అంత విశిష్టమైనదానిని విశిష్టముగానే రచింపవలయును. అట్లు రచించుటయే నేర్పు. అదే రచనలో సామర్థ్యము. రచన అనగా అది శబ్దములతో చేయుపని. అర్థమును పొందుటకు శబ్దము ద్వారము. అర్థము కావ్యపరమార్థము. శబ్దము శబ్దము.

## 2

అర్థమనగా అనుభవయోగ్యమగు విషయము. కావ్యమునందు సహృదయులచేత ఏది అనుభవింపబడునో అది దాని యర్థము. అది శబ్దద్వారమున వ్యక్తము కావలయును. మరి శబ్దార్థములకున్న సంబంధమెట్టిది? పార్వతీపరమేశ్వర సంబంధమువంటిది. అనగా నిత్యసంబంధమన్నమాట. వర్ణములు నిత్యములు వర్ణసముదాయములైన పదములు నిత్యములు. పదాభివ్యక్తములగుచున్న అర్థములు నిత్యములు. వెరసి పదార్థములు నిత్యములు. అయినచో ఈ రెండింటిలో ముందువెనుకలు లేవా? లేవు కావచ్చును. మరి రెండు వస్తువులన్నతరువాత అవి ఒకదానివెనుకఒకటి ఉండక తప్పదుకదా? అట్లన్నచో అసలవి రెండు వస్తువులుకావని చెప్పవలసివచ్చును. రెండు పృథగస్తిత్వముగల వస్తువులేగనుక అవి అయియున్నచో శబ్దములేకుండ అర్థము అర్థము లేకుండ శబ్దము విడివిడిగా లోకములో వాడుకలో ఉండవలసినది. అట్లు లేవు మరి.

శబ్దము వ్యక్తము. అర్థ మవ్యక్తము. ప్రకృతి వ్యక్తము. పరమేశ్వరు డవ్యక్తము. శబ్దమున కర్తృస్ఫురణయే లేనిచో వ్యవహారమే లేదు. శబ్దము అర్థమునకు వాచకముకాదు. వ్యంజకము. శబ్దవృత్తులలో నిది అత్యుత్తమమైనది. మరియు శబ్దమునకు అభిధ—లక్షణ అను ఇంకొక రెండు వృత్తులును గలవు. అభిధ స్వార్థరూపము. స్వార్థమును బాధించి రూఢివలనగాని ప్రయోజనమువల్లగాని అస్వార్థమును ప్రతిపాదించు శబ్దవ్యాపారము లక్షణ. స్వార్థము నుండియు లక్షణార్థమునుండియు కావ్యపరమార్థ

1. "Riti is a peculiar style or mode of linguistic presentation. The peculiarity of it consists in the possession of the qualities or distinctive features, technically called Gunas. DR. K. C. Pandey.

మును పదవాక్య సముదాయముమీద ప్రతీతి యొనర్ప గల ఒకానొక విశిష్టమైన శబ్దవ్యాపారము వ్యంజన. స్వార్థముగాని, లక్షణార్థముగాని, వ్యంగ్యార్థముగాని కవిత్వముయొక్క పరిధిలోనివే. ఆయా అర్థములు కవిత్వములగుటకవి రమణీయములగుట ఒక్కటియే హేతువు. వ్యంగ్యార్థము మరియు రమణీయమగుటను దర్శించిన బుద్ధిమంతులు దానినే ఉత్తమకావ్యమనిరి. ఉత్తమత్వ మదియొక పెద్దవిశేషముకాదు. అదే విశేష మన్నచో అయినార్యగురను మించి ఉత్తమకవులుండరని చెప్పవలసివచ్చును. అందువలన రమణీయార్థమును ప్రతిపాదించు శబ్దము కావ్యమనబడినది. అట్టి శబ్దముయొక్క మూడువిధములైన వ్యాపారములును కవిత్వాభివ్యక్తికొరకనియే గ్రహింపవలయును–అర్థమే శబ్దమును శక్తిమంతము చేయుననుట దివిటీని తిరుగవేసిపట్టుటవంటిది. అందొక చమత్కారము లేకపోలేదు. కాని అది పద్ధతికాదు. శరీరము నశ్వరము నిజమే. ఆత్మయే శాశ్వతము. అవును. కాని శరీరము ధర్మసాధనము. అది లేక ఆత్మ ఏమియు చేయలేదు. ఆత్మ యున్నదను జ్ఞానమున కదియే కారణము. కావ్యమున శబ్దమట్టిది. మరియు విశేషమైనది. శబ్దము నిత్యము. అర్థమువలెనే శబ్దము కూడ కావ్యమున తన వైభవమును ప్రకటించుకొనుటలో దోషములేదు. నిత్యవస్తువైభవప్రకటన మానందహేతువు. శబ్దార్థముల ఏకరూపతా మహనీయతయే కావ్య మహనీయత. అదియే కవియొక్క మహనీయతయును.

## 3

అన్ని అనుభూతివిశేషాలను మనము మాటల్లో చెప్పలేము. మానవుడు తన అభిప్రాయమును వ్యక్తము చేయుటకు సిద్ధముచేసికొన్న అత్యుత్తమవాహకము భాష. నిజమే. మనము మన బ్రతుకుతెరువు సాఫీగా సాగిపోవుటకని కష్టపడి చదివి సంపాదించుకొన్న మంచిఉద్యోగమే మనది. ఈ రాళ్ళు మనకు నెలకు సరిపోవుటలేదు. అట్లే అనుభూతులను వ్యక్తము చేసికొనుట కేర్పాటుచేసికొన్న ఆ భాషయు మన అవసరములను పూర్తిగా తీర్చలేకపోవుచున్నది. కాని దానిని వదలిన మనకిక గత్యంతరములేదు. ఈ ఉన్న ఉద్యోగమును ఊడగొట్టుకొన్న మనకేది గతి? ఆ భాషను పట్టుకొనియే కవిత్వము వ్రాయవలయును. ఈ ఉద్యోగముతోనే పొట్టపోసుకొనవలయును. శబ్దమునకు అర్థమును బోధించుశక్తి చాల ఎక్కువే. కాని మన అనుభూతివిశేషము లంతకు మించినవి. ఏ అనుభూతి కా అనుభూతి స్పష్టముగా నొక శబ్దము చేత చెప్పబడు స్థితి ప్రపంచములోని ఏభాషకును లేదు. నిత్యవ్యవహారములో మన కీ విషయము అనుభవములో నున్నది. శరీరావయవములను కదిలించకుండ వట్టిమాటలతో ఒకనాడు వ్యవహరించినచో మనకు శబ్దశక్తి తెలిసివచ్చును. నటించుటను తీసివేసి—అనగా వాచికమును– ఆంగికమును అయిన అభినయమును తొలగించి–నాటక మాడించినచో శబ్దశక్తి తెలిసివచ్చును. శబ్దశక్తికంటె మానవమనః ప్రపంచమునందలి అభిప్రాయములు–అనుభూతులు మరియు శక్తిమంతములైనవి. అందువలన వాటిని అభివ్యక్తముచేయు శబ్దములకు ఉచ్చారణరూపమున, ముఖావయవములను తదనుగుణముగా సంకోచవ్యాకోచముల నొనరించుటరూపమున, చేతులు తిప్పుట రూపమున—ఈ దృశమైన అంగన్యాసకరన్యాసముల నెన్నియోచేసి దోహదము చేయుచున్నాము. ఇంత చేసినను మన యర్థము సరిగా మన మనుకొన్నట్లుగా అందవలసినవారి కందుటలేదు. మనము చెప్పుట కెంతప్రయత్నము చేయుచున్నామో అర్థము చేసికొనుట కనతలివారు కూడ అంతప్రయత్నము చేయవలయును. ఇంతప్రయత్నపూర్వకముగా వాడిన శబ్దముద్వారా అంతప్రయత్నపూర్వకముగాను శ్రోత మన యర్థమును గ్రహింపవలసియున్నది. వక్తవిషయమునను, శ్రోత విషయమునను తాదృశమైన ప్రయత్నము లోపించినచో పదము లర్థప్రతీతి నొనరింపవు. వక్త శ్రోత—ఇద్దరు కలిసి శబ్దము దీప్తిమంతముచేసి అర్థమును పిండవలయును. వట్టి శబ్దమును గాలిలో వదలినచో అది అంతపని చేయలేదు. ఇట్లనుటచేత శబ్దమర్థప్రతీతికి అసమర్థమని యనుటగా ననుకొనకూడదు.

భాషద్వారా చెప్పుట కలవికాని భావమును కవిత్వముగా వెలయింపరాదనుట అంతమంచిమాట కాదు. భాషద్వారా చెప్పుట కలవికాని భావమును కవి

త్వముగా చెప్పవలయునని చెప్పవలెను. కవిత్వ మను భూతి విషయముకదా! అది భాషచేత ఎప్పుడును చెప్పబడదు. భాష వర్ణించుటకు పనికివచ్చును అనుభవమును నీవెంతగా వర్ణించినను అది ఎదుటివాని కనుభవ విషయముకాదు. నీ వర్ణన మాధారముగా అతడనుభవమునందుకొనవలయును. అతడు వట్టి బెల్లముకొట్టినరాయివలె కూర్చున్నచో అది వాని కందదు.[2] ఆ వచింపగాబడిన దాధారముచేసికొని సహృదయుడైనవాడు దానిని తన చిత్తములో చూచుకొనవలయును. అపుడుగాని దానిలోనిదగు సౌందర్య మనుభవ విషయముకాదు.[3] యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసహ—వాక్కు పరమేశ్వరుని చెంతకు పోదు. మనస్సునుపోదు. నీవు పంపించుము. అవి తిరిగి వచ్చును. కాని అంతమాత్రమున పరమేశ్వర విషయజిజ్ఞాస అంతరించినదా మరి! ఆ వాక్కునే ఆ మనస్సునే పట్టుకొని బ్రహ్మజిజ్ఞాస చేయుచున్నాముకదా! అట్లే ఆ భాషాపదములనే పట్టుకొని నెమ్మదిగా అనుభూతులను వెళ్లపోసుకొనవలయును. శబ్దము ప్రత్యక్షముగా బ్రహ్మము నెట్లు చూపుటలేదో కవితారూపములైన అనుభూతులను అట్లే చూపుటలేదు. అక్కడ ఎంతచేచాయగా పని జరుగుచున్నదో ఇక్కడను అంతే.

## 4

శబ్దము తెలిసినది. అర్థము తెలియలేదు. అర్థము తెలిసినది. శబ్దమును తెలిసినది. శబ్దము తెలిసి అర్థము తెలియలేదనగా ప్రాథమికార్థము తెలియలేదని అర్థముకాదు. లక్షణార్థము తెలియలేదనికూడకాదు. శబ్దముయొక్క వ్యంజనావ్యాపారము నుండి ప్రతీయమానమయ్యెడు పరమార్థము తెలియలేదని మాత్రమే తెలియవలెను. ఈ పరమార్థము ప్రతీతికి వ్యాకరణము, ఉపమానము, కోశము, ఆప్తవాక్యము, వాక్యశేషము, వివృతి, సిద్ధపదసాన్నిధ్యము ఈ యన్నింటితోపాటు ముఖ్యముగా వ్యవహారము దోహదము చేయును. వ్యవహారమనగా వక్త—వాచకము—శ్రోత— పూర్వాపర సందర్భము— ఇన్ని. ఈయన్నింటిచేత ఒత్తులు ఒత్తబడి ప్రతీయమానమయ్యెడు అర్థమే పరమార్థము. ఈ యర్థము కోశమునం దుండదు. ప్రాథమికార్థమునే కోశము లిచ్చును. లాక్షణికార్థమునుగూడ నియ్యవు. వర్ణ పద వాక్య విన్యాస వైఖరీ విశేషము మూలమున అర్థ ప్రతీతి జరుగును. విన్యాస వైశిష్ట్యములేని రచన అర్థప్రతీతిని కలిగింపలేదు. అందువలన కవులు వర్ణ పద వాక్య రచనా విన్యాస వైఖరియం దత్యంతము శ్రద్ధ చూపవలసియే యున్నది. తాదృశమైన శ్రద్ధ లేని వాడెంతమహాప్రతిభాత్మక భావయిత్రీ శక్తి మహితుడైనను వాడు మరేమైనకావచ్చుగాని కవి మాత్రముకాడు.

ఒకానొక పద ముచ్చరింపబడినది. అది ఏ భావమును లోపలలేనివానిచేత కాదుగదా ఉచ్చరింపబడినది. ఏదో ఒక భావార్థము మోసికొనిరాక అసలు పదము బయటకురాదు. వట్టినాదమే రాదు. ఇక పదమెట్లు వచ్చును? ఆకాశవాణి ఒకనాడు విషాద సంగీతము వినిపించుటకు మొదలుపెట్టినది. అది వట్టినాదమే. దానిని వినగానే మనకు ఏదో విషాదవార్త వినబడబోవుచున్నదన్న భావము కలుగుచున్నది. అట్లే ఒక పద ముచ్చరింప బడినది. విన్న వాని యందొక భావ ముత్పన్నమైనది. పదములు శ్రోతలలో పాఠకులలో ఏ భావములను ఉత్పన్నము చేయజాలక పోయినచో— మన కింత భాషావ్యవహారమే ఉండెడిదికాదు. పదము భావము నుత్పన్నము చేయలేదని తెలిసిన తరువాత ఇంకను వాటినే పట్టుకొని ఊగులాడువాడు వెఱ్ఱివాడు. అయినచో మానవజాతి అంతయు నట్టిదే కావలయును. కాని కాదు. అందువలన వర్ణము—పదము – వాక్యము — ఇవన్నియు భావముల నుత్పన్నము చేయుటకే ప్రవర్తించుచున్నవి. భావము లుత్పన్నమైన వనగా ఆయావ్యక్తులయం

---

2. You will find poetry nowhere unless you bring some with you. (JOWBERT)

3. We have more poets than Judges and interpreters of poetry. It is easier to write an indifferent poem than to understand a good one. (MONTAIGNE)

దాయాభావము లనుభవరూపములైనవని యర్థము.[4] ఇంకను శబ్దమువల్ల ఏమీకాదు—అంతయు అర్థము వల్లనే అగుచున్నదన్నచో మంచిది. శబ్దమును వదలి పెట్టుము. అర్థమునే ప్రయోగించుము. అందువల్ల శబ్దము అశక్తముకాదు. అది శక్తము. శబ్దము మాత్రమేకాదు; ఒకవిధముగా వర్ణములుకూడ. పదములు స్మారకమాత్రములు. వాచకములు కావు. అయినను వాచకత్వముతో నిమిత్తము లేకుండగనే అవి సౌందర్యప్రత్యాయకములు కాగలుగుచున్నవి. కావ్యమునకు చారుత్వము కలిగినను—అచారుత్వము కలిగినను అది శ్రుతిసుభగములును శ్రుతి దుష్టములును అయిన పదములవల్లనే కలుగుచున్నది. అది చాలును ఆ పదములనుండి చారుతాప్రతీతి అచారుతా ప్రతీతి కలుగుచున్నదని చెప్పుటకు. ఆ మాట చెప్పిన తరువాత ఆ మంచి చెడ్డలను ఆ పదములకే ఆరోపణము చేయవచ్చును. పదమును చేయుచున్న వర్ణములకును వ్యంజకత్వమున్నది.[5] ఈ వ్యంజకత్వ స్ఫురణ వర్ణమునుండి అర్థము మీదకు, పదమునుండి అర్థముమీదకుకాక అర్థము మీదనుండియే పదమునకు వర్ణమునకు ప్రసరించుచున్నదని చెప్పవచ్చునా? అర్థమే శబ్దమును శక్తిమంతము చేయుచున్నదని చెప్పినట్లు చెప్పవచ్చును. అది ఎంతో ఇదియు అంతే. మరియు నిట్లు చెప్పవచ్చును. కవి అర్థమును మనసులో పెట్టుకొని శబ్దమును ప్రయోగించుచున్నాడు. శ్రోత, పాఠకుడు-సహృదయుడు శబ్దమును పట్టుకొని అర్థమును అనుభవించుచున్నాడు. కవిని ఓరుగవేసినవాడు సహృదయుడు. శబ్దమునకు ఇష్టార్థమును స్ఫురింపజేయుశక్తి ఉన్నదనియేకదా కవులు దానిని పట్టుకొని ప్రాకులాడుచున్నది? కవి భావమును మన కందించుననియేకదా సహృదయులును ఆ శబ్దమునే పట్టుకొని ప్రేలాడుట. అది కవి సహృదయ ఉభయ తారకమైన మహాశక్తి. వాక్కు అర్థము ననుసరించు ననుట ఎంతసత్యమో అర్థము తా నభివ్యక్తమగుటకు శబ్దమును చూచుకొనుటయు అంత సత్యమే.

## 5

శబ్దార్థాలకు పరస్పరోపకారకలక్షణముగనుక కనిపించినపుడు భావించుటతో తప్పులేదు. అది కవిత్వమున గుణమేకాని దోషముకాదు. అది గుణముగనుక అదే కవిత్వమునం దుండవలయునని ఎవరును అనరు. ఇంకను ఎన్నోగుణములున్నవి. అటువంటప్పుడు ఈ ఒక్కదానినే సాగదీసుకొననేల? యథావసరముగా కవిత్వమున ఈ గుణమును ఆదరింపదగినదే. అంత మాత్రమే. గొప్పకవితాగుణమగునా కాదా అన్నది చర్చనీయముకాదు. గుణము గుణము మాత్రమే. దానిని కవి గొప్పగా వాడుకొనవలయును. గుణమలంకార రూపమున నున్నను ఆదరణీయమే. అది మరియు మంచిది. వర్ణములకు వ్యంజకత్వశక్తి యున్నదనుచో— ఆయా వర్ణము లే యే రసభావములకు వ్యంజకములుగా చెప్పబడినవో అట్టిచోట్లనే వాటిని భావింపవలయును. ఆయావర్ణము లందుకు మాత్రమే సృష్టింపబడినవని ఎవరన్నారు? అవి ఎన్నోపనులు చేయును. అందులో ఆయారసములను విభావాదిసామగ్రి పుష్టముగానున్నప్పుడు ఆయావర్ణములు మరియు కొంచెము లెస్సగా ప్రకాశింపజేయును. ఆ వర్ణములు తామున్న ప్రతిచోట ఆ పని చేయవు. పరుషాక్షరాలు కోపమును, సరళాక్షరాలు శోకమును స్ఫురింపజేయు నన్నప్పుడు పైన చెప్పినట్లే గ్రహింపవలయును. అట్లుగాక ఎక్కడ పరుషాక్షరములు రెండు కనిపించినను అక్కడ కోప

---

4. We may either use words for the sake of the references they promote, or we may use them for the sake of the attitudes and emotions which ensue...... Their sole function is to bring about and support the attitudes which are the further response.—I. A. RICHARDS.

5. ఆంధ్ర ధ్వన్యాలోకము. పుటలు 331, 332.

Though words are only reminders there is certainly charm therefrom in all the varieties of suggestion that manifest itself through the individual words-

Suggestion with unnoticeable sequence will flash forth in letter, word etc., sentence, composition and finally the work as a whole—The Theory of Suggestion. P. 59.

మున్నదా అని చూచుటయు, లేదు గనుక పరుషా క్షరముల విషయమున చెప్పబడిన ఒకానొక గుణము పట్టుట లేదనియు అందువలన పరుషాక్షరములకా గుణము లేదనియు తల్క్రిందుగా దిగుట ఉచితము కాదు. మనము అన్ని అక్షరములను అన్ని అర్థ ములకును వాడుకొనవచ్చును. ప్రాచీనులు తమ యను భవములో కొన్ని వర్ణములు కొన్ని యర్థములను చెప్పుటలో ఎక్కువగా ఉపయోగపడిన ట్లనిపించి ఆ మాట చెప్పినారు.

కనుక వర్ణములకును కొన్నికొన్ని భావార్థము లను స్ఫురింపజేయుశక్తి యున్నది. ఇంకను వర్ణము 'లర్థబోధకములు' కావన్నచో అదియు మంచిదే. వర్ణముకూడ 'ధ్వని'యేకదా! సరళపరుషాక్షరములు సరళ పరుషధ్వనులు. ఆయాధ్వను లుచ్చరింపబడి నప్పుడు ఒకానొక శబ్దము బుద్ధిగోచరమగుచున్నది కదా? అది స్ఫోటశబ్దము. ఆ శబ్దమే ఈ వర్ణము లుచ్చరింపబడినప్పటి నాదమువలన వ్యక్తమై బుద్ధి చేత గ్రహింపబడి అర్థస్ఫూర్తిని గలిగించుచున్నది. వర్ణములను కాదన్నను స్ఫోటశబ్దమును కాదనుటకు వీలులేదు. అందువలన వర్ణము లర్థములను స్ఫురింపజేయగలవనుట దోషముకాదు. శబ్దాలంకార ప్రమేయమంతయు నీ సత్యముమీదనే ఆధారపడి యున్నది.

మరియు శ్రవణేంద్రియము, జ్ఞానేంద్రియము. శ్రవణమునకు విషయము శబ్దము. శబ్దమునకు అర్థమును స్ఫురింపజేయుశక్తి లేనిచో ఇక శ్రవణేంద్రియముద్వారా కలుగు జ్ఞానానుభవమేది? శబ్దమునకు లేనిచో ఇంద్రియమునకున్ననా స్ఫురణ? ఈ విషయమున ఫలితార్థమిది: కావ్యపరమార్థమైన రసము అనుభవాధీనము. అనుభవము ఇంద్రియా ధీనము. కావ్యము చిత్తశ్రవణానందరూపము. ఇంద్రి యముల నతిక్రమించి అనుభవమన్నది లేదు. వర్ణము—పదము—ఇవి నాదాత్మకములు. వీనికర్థ స్ఫూర్తిలేనిచో మనకు శ్రవణేంద్రియ మక్కరలేదు. అందువల్ల వర్ణములకు—వర్ణాత్మకమైన శబ్దమునకు అర్థ స్ఫురణ శక్తియున్నది.

ఛందస్సు విషయముకూడ అంతే. అన్ని వృత్త ములును అన్నిభావములు చెప్పుటకును తగును. కొన్నికొన్ని కొన్నికొన్ని అభిప్రాయములు చెప్పుటలో సొగసులు పోయినట్లు స్వానుభవముమీద తెలిసికొన్న క్షేమేంద్రుడు మొదలైనవారు ఆ మాట చెప్పిరి. ఆ భావములనందరును ఆ ఛందములలోనే వ్రాయ వలయునన్న నియమము లేదు. ఎక్కడ ఆ ఫలానా వర్ణములు కనిపించినా, ఎక్కడ ఆ ఫలానా వృత్తము కనిపించినా, ఆ ఫలానా ఫలానా భావములే అక్కడ అక్కడ ఉండవలయునని అనుకొనుట—అదికూడదు. ఆయా సందర్భములలో కవు లాయా విధములైన రచనలు చేసినప్పుడు మనము వివేకము కలిగి గ్రహించిన చాలును.

ఛందస్సు విషయము వచ్చినది కాబట్టి ఒక విషయము. కవిత్వమునకు ఛందస్సక్కరలేదా? అక్కర లేదు. వచన పద్యము వచ్చిన తరువాత ఇక ఏమి ఛందస్సు! నిజమే. ఛందస్సు కవిత్వము తన నాశ్ర యించినందుకు దానికి పాద విభజన చేసినది. వచనమున ఛందస్సు లేదు పాద విభజన లేదు. కవిత్వమున ఛందస్సున్నది. పాదవిభజనమున్నది అసలు ఛందస్సు లేదనుకొనబడుచున్న వచనకవిత్వముకూడ పాదవిభజన చేసియే వ్రాయబడుచున్నది. పాదవిభజన కవిత్వమున కది పుట్టినప్పటినుండి నేటివరకు లక్షణము. ఆ లక్షణమే ఛందస్సు. ఇన్నిగణములైనతరువాత పాదమై పోవలయునని ప్రాచీను లనుకొన్నారు. మన యిష్టము వచ్చిన నియమము ననుసరించి మన కవిత్వములో పాదములు విరుగవలయునని మన మనుకొనుచున్నాము. అట్లే విరుగగొట్టుచున్నాము. మనము వ్రాసినది కవిత్వముగా కనిపించవలయునన్నచో అమాత్రము ఛందస్సునైనను అనుసరింపక తప్పుటలేదు. ఛందస్సు వలననే కవిత్వము కవిత్వముగ్గా కనిపించును. ఛందస్సు కదియే ప్రయోజనము. కవిత్వము వచన మును మించిన విశిష్టరీతిలో రచింపబడునని ఈ వ్యాసమున మొదటమొదట, చెప్పబడిన దాని నిప్పుడు సమన్వయముమీద హృదయదఘ్నముగా భావింపవచ్చును. వచనకవిత్వమును చూచినతరువాత కవిత్వములో ఛందస్సు ప్రయోజనము అత్యల్పమైనదని ఊహించి వచో ఊహింపవచ్చును.

**6**

విమర్శన బాధ్యతను నెత్తినవేసికొన్న యతడూరక ఊహింపరాదు. ఊహించినది ప్రకటింపకుండరాదు. ఆమాత్ర మస్పష్టతను పఠిత ఊహించగలడు—కవి మనఃస్థితిని మనము సులభముగా ఊహిస్తాము—మనం ఊహించుకొంటున్నాం—అంటే ఏమిటో మన ఊహకి అందటంలేదు-పద్యంలో ప్రతీకలూ వ్యంగ్యాలూ మన ఊహకి అందుతున్నాయి—మన ఊహకి చప్పున అందక కవిత్వం అస్పష్టమైంది—స్ఫురణగాఢంగా లేదు—ఈ విధమైన వాక్యాలు వ్రాయకూడదు. అందులోఉన్న అస్పష్టతయొక్క స్వరూపమేమిటి? దానిని పఠిత దేనిని ఆధారముచేసికొని ఊహించుకో వలె—దానిని విమర్శకుడు వివరముగా చెప్పగలిగి ఉండవలె. దేనినిబట్టి కవియొక్క అప్పటి మనఃస్థితిని అదిఇదియని ఊహించగలుగుచున్నావో చూపించ వలె. ఆ బాధ్యతను నిర్వర్తించకుండ పాఠకులను కౌగిలించుకొన్నట్లు మాట్లాడితప్పుకొని పోవుట సరికాదు. మన ఊహకి అందరానిగుణమందులో ఏమున్నదో దానిని వెలికితీసి చూపించవలె. మన ఊహకు అందే ఆ పద్యములోని ఆ ప్రతీక లేమిటో—ఆ వ్యంగ్యాలేమిటో నిరూపించితేగాని విమర్శకాదు. మన ఊహకు చప్పున అందనంతమాత్రాన అది అస్పష్ట కవిత్వమనరాదు. ఆ కవిత్వము నందుకొనుటకు వీలైనంత ఎత్తైన ఊహ మన వద్ద లేదేమో విమర్శకుడు కొంచెము నిదానించి చూచుకొనవలయును. వట్టి పాఠకుడైనచో వాని యిష్టము. ఆతడేమైనను అనవచ్చును. వానికెట్లును కావ్యార్థమును పరిపూర్ణముగా గ్రహించుట కుత్సుకత లేనే లేదాయె. మరి విమర్శకుని స్థితి వేరుకదా! అర్థ స్ఫురణరీతిని ప్రకటించి వ్యాఖ్యానించి చూపుటయే విమర్శనము. అది కవి సహృదయ ఉభయోపకారిలక్షణము కలది.

**7**

అర్థము నుద్దేశించి శబ్దము ననువర్తింపజేయుట ద్వారానే లోకము నిత్యము ప్రవర్తించు చున్నది. మనము లౌకికులము. మరియు సాధువులము. మనము లోకము ననుసరించి పోదుము. మరి అతి లోకులైన ఆద్యులైన ఋషులును ఋషితుల్యులైన మహాకవులును వట్టిపలుకులనే పలుకుదురు. ఆ పలుకులకు రావలసిన యర్థమంతయు ఆ పలుకుల వెంటబడి వచ్చుచునే యుండును. పదార్థముల సంబంధమును నిత్యమని చెప్పుట ఇందువల్లనే. కవులు తామే యర్థమును చెప్పగోరినదియు మనకు వారు పదములను అనుగమింపజేయక మునుపు తెలియదు. పదముల ననుగమింపజేయుట పేరే రచన. అదే పదవాక్య విన్యాసము. అట్లు విన్యసింపజేయబడిన పదములను చూడగా మనకు ఆ పదముల వెంటబడి పరుగెత్తుకొని వచ్చుచున్న అర్థము కనిపించును. ఆ కనిపించుటనే స్ఫురించుట యనుచున్నాము.

మరి ఈ స్ఫురించుట శబ్దము మీదనుండి అర్థము మీదికా? అవునట్లే కనిపించుచున్నది. కవు లర్థములను భావించి శబ్దములను ప్రయోగించు చున్నారన్నచో కాదనవలసినదేమియు లేదు. ఆ యర్థములను కవులు శబ్దములద్వారా భావించు చున్నారా? లేదా? అట్లే భావించుచున్నారు. మరి శబ్దమున కర్థస్ఫురణశక్తి లేనిచో కవి భావించుటకే వీలుకాదు. భావింపనివాడు కవిత్వ మేమి చెప్పును? భావిరచినవాడుకూడ తాను భావించుట కుపయోగపడిన అన్నిపదములను గ్రుచ్చియెత్తి అది కవిత్వమనుటలేదు. తన ఇచ్ఛించిన అర్థమును ప్రసరింపజేయుటకు కొన్నిశబ్దములను ఎన్నికచేసి చేయు చున్నాడు. ఆ ఎన్నిక ఆ శబ్దముల కాయర్థమును స్ఫురింపజేయుశక్తి ఉన్నదని చేయుచున్నాడుగాని లేదని చేయుటలేదు. లేదనుకొన్నచో ముందు వట్టిఅర్థమునే ప్రయోగించును. అది ఎట్లును సాధ్యము కాదు. అందువల్ల శబ్దమునకు అర్థస్ఫురణశక్తి ఉన్నదనియే అనుకొనవలెను. ఇంతకుపూర్వము స్ఫురణ అర్థమునుండి శబ్దముమీదకు ప్రసరించుట కవి విషయమున కావచ్చుననబడినదియు ఇప్పుడు కాదను

---

6. శ్రీ కాళూరి హనుమంతరావు. భారతి, ఆగస్టు 70.

పించుటలేదా? కవి మనకంటె గొప్పవాడుగనుక వానికి శబ్దమునుండి అర్థము స్ఫురించినది. మనమును అంతటివాళ్లమేకనుక మనకును శబ్దమునుండియే అర్థము స్ఫురించుచున్నది. పదము వేరు. అర్థము వేరు—కాదు. నామరూపములు రెండు భిన్నవిషయములుకాదు. పదార్థమొక్కటియే విషయము.

మరి శబ్దము శక్తమా? అశక్తమా? అన్నచో అది శక్తము. అది అశక్తముకూడా? పరబ్రహ్మము సత్తు. అసత్తుకూడా.

పరబ్రహ్మము పరావాగ్రూపము. అది వట్టి జ్ఞానము. విషయస్పర్శాత్మకమైన జ్ఞానము పశ్యంతీ వాక్కు. పశ్యంతి జ్ఞానవాచకము. జ్ఞానమే అర్థము. అర్థస్ఫురణలో శబ్దము భాసించుచునేయున్నది. తత్పూర్వదశయైన శుద్ధచైతన్యముకూడా శబ్దమువల్లనే భాసించుచున్నది. శబ్దమువల్లనే అర్థస్ఫూర్తి. లోకమునందు శబ్దానుగమములేని అర్థము కనిపించుటలేదు. అట్లే అర్థోత్పాదకశక్తిలేని పదమును కనిపించుటలేదు. శబ్దార్థములు తుల్యప్రాబల్యముకల విషయములు. అందువల్లనే వాని ఏకత్వము భావింపబడుచున్నది. మరియు నది సిద్ధమని చెప్పబడుచున్నది. సిద్ధమనగా నిత్యమని యర్థము. శబ్దజ్యోతి దీపించుచున్నదిగనుకనే భువనత్రయమును అంధకారబంధురముకాకుండా ప్రకాశించుచున్నది. జ్యోతి తాను ప్రకాశించుచునే ఇతర వస్తువులను ప్రకాశింపజేయును. అట్లే తాను ప్రకాశించుచునే జ్ఞానరూపమగు అర్థమును ప్రకాశింపజేయును. ఇదంతయు అర్థస్ఫురణము శబ్దమునుండియే జరుగుచున్నదనుటకు నిదర్శనము. శబ్దమునుండియే అర్థము స్ఫురించనిచో ఈ శబ్దమునకు ఇంత అనుశాసనమేల? శబ్దమున కర్థస్ఫూర్తి లేనిచో కవి ప్రౌఢోక్తి గంగలోకలియుచున్నది. అపుడు కవిత్వమేలేదు అందువల్ల అర్థమునుండి స్ఫురణ శబ్దముమీదికి వచ్చుటలేదు. శబ్దమునయందుండియే అర్థమునందిపుచ్చుకొనుచున్నది.

ఇది కావ్యమున అర్థస్ఫురణ.

---



# జీవిత కుసుమం

శ్రీ గంధం జోయెల్

పచ్చని జీవిత
వటవృక్షం నీడలో
పశువులా దినదినం
గతం గడ్డిని నెమ్మదిగా
నెమరు వేసుకుంటూ
జ్ఞాపకాలన్నిటిని
తిరుగు తోడుకుంటూ
కాలయాపన చేయడం
కాదు సఫల జీవితం ;

వర్తమానం నీ కర
భూషణ డమరుక
నాదాన్ని నీ జీవన
సరళిలో ఆనందానికి
నవ సంగీతం చేసి,
మృదు మధురంగా
కర్ణ పేయముగా
ప్రయోగించి చూడు !

అదృష్టం నీ
హస్త ముద్రికలో
దాగిన మెరపు రేఖ !
ఏ క్షణంలో నిన్ను
వరించి. సింహాసన
మెక్కించి రాజుగా
అభిషేకిస్తుందో
ఎవరికి తెలుసు ?

కడగండ్ల వడగండ్ల
వానే వెలసినప్పుడు
పెను తుఫానులాంటి
జీవన సంగ్రామం
తుది దశ చేరుకున్న
మరు క్షణంలో
వంగిన నింగి నిండు
వర్ణ వర్ణాల భవిష్యత్తు
ఇంద్రధనుస్సు రేఖలు !

బ్రతుకులో జాలువారిన
అరుణారుణ కాంతి,
సుఖమయ శాంతి
నీవి కావనుకొని
నివ్వెర పోవడ మెందుకు ?

సహృదయంతో
సవిముల భావంతో
సాగిపోవాలి ఈ పథాన
నిరాశకు కూడా వెయ్యి
నీతులు గరపాలి !
సుఖం కరువైన
ఎడారిని సస్యశ్యామల
వసంగా మార్చుకోవాలి !
మోజు ఉంటే ఆశయాల
రోజా లందు పెంచాలి !

కానీ, గతానుభూతుల
గరికని కొరికి పారేయడం
కాదు జీవిత లక్ష్యం!

వర్తమానం వంతెన మీద
హుందాగా నడిచిపోవాలి!
ఆవల ఆనందం యేటి
ఒడ్డున సుఖం గులకరాళ్ళు
బోలెడు ఏరుకొని బ్రతుకు
సంచీలో నింపుకోవాలి!
ఏ మాత్రం జాప్యం చేసినా,
బాధల కఠోర శాపం
నిన్ను శిలగా మారుస్తుంది!
అందుకే నేస్తం!
అనుభవాల విలువైన
కాశ్మీరాంబరాన్ని ధరించి,
బ్రతుకు నిలువుటద్దంలో
సగర్వంగా చూసుకో!
జీ వి తం!
కాననములో వికసిత
మనోహర సుమం!
ఉదయం వికసించి,
సాయంత్రం వాడిపోతుంది!!



**నాటిక :**

# రంగుటద్దాలు

శ్రీ కె. ఆర్. కె. మోహన్

## పాత్రలు

| | | | | |
|---|---|---|---|---|
| నారాయణరావు | ... | ఇంటి యజమాని | వయస్సు | 45 |
| శాంత | ... | నారాయణరావు ద్వితీయ భార్య | ,, | 24 |
| రామం | ... | నారాయణరావు పెద్దకొడుకు | ,, | 20 |
| గోపి | ... | నారాయణరావు చిన్నకొడుకు | ,, | 8 |
| సుబ్బారావు | ... | ఇంగ్లీషు వైద్యుడు | ,, | 45 |
| రంగాచార్యులు | ... | ఆయుర్వేద వైద్యుడు | ,, | 55 |
| మూర్తి | ... | హోమియో వైద్యుడు | ,, | 30 |
| గవరయ్య | ... | భూతవైద్యుడు | ,, | 50 |

### ఒకటవ రంగం

(నారాయణరావు ఇంట్లో ముందు గది. సమయం : ప్రొద్దున 9.30 గంటలు. గోపాల్ కళ్ళు నులుముకుంటూ ఏడుస్తూంటాడు.)

శాంత : (బుజ్జగిస్తూ) చూడు గోపీ. నువ్వు బడి మానేస్తే మాస్టరు కొడ్తారు బాబు... చూడు...శుభ్రంగా నీళ్ళుపోసి తొడిగిన తెల్ల చొక్కా నేలపడిదొర్లి ఎలా పాడు చేసు కున్నావో...లే...త్వరగా లే...బడికివెళ్ళు...

గోపాల్: నేను వెళ్ళనూ...(అంటూ బిగ్గరగా ఏడు స్తాడు).

శాంత: (కొంచెం తీవ్రస్వరంతో) గోపాల్...ఏమిటి రోజురోజుకీ నీ అల్లరి ఎక్కువయి పోతుంది. బాబూ...నాయనా అంటుంటే మరీ నెత్తికెక్కుతున్నావు...వెళ్తావా... నాన్నగారితో చెప్పి కొట్టించనా?

గోపాల్: అమ్మా.. (అంటూ మరి బిగ్గరగా ఏడు స్తాడు.)

రామం:(ప్రవేశిస్తూ) అబ్బబ్బ...వెధవగోల...ఎందుకూ ఆ కుర్రవెధవని అల్లా ఏడిపిస్తావు? తల్లి లేదనే ఏడ్చేవాడినీ నీవుకూడా ఏడ్పించాలా? వాడి దారిన వాడిని ఉండనియ్యరాదా? (అంటాడు చిరాకుగా)

**శాంత:** (బాధగా) అదేమిటి రామం...పెద్దవాడివి నీవుకూడా అల్లా అంటావు? తల్లి లేకపోతే మాత్రం నేను మీ తల్లిని కానూ? కుర్రవాడు పెంకిపట్టుపటి ఏడుస్తున్నాడని మనం వదిలేస్తే వాడు ఎల్లా పైకి వస్తాడు? ఆ మాత్రం భయపెట్టకపోతే ఎల్లా నాయనా?

**రామం:** (అసహ్యంగా): హుం...తల్లి! సవతితల్లి తల్లి ఎల్లా అవుతుంది? నిజం చెప్పు... లోకాన్ని మభ్యపెట్టడానికి కాకపోతే నీకు వాడిమీద నిజంగా అభిమానం ఉందా? సవతి కొడుకుపై నీకు ప్రేమ ఎల్లా ఉంటుంది? నీ కక్ష తీర్చుకోడానికే...'వాడి బాగుకొసం' అని వంకపెట్టి వాడిని కోపపడుతున్నావు... ఆ మాత్రం తెలుసుకోలేని వాడినికాదు.

**శాంత:** (ఎంతో బాధతో గట్టిగా) రామం. ఎంత మాట అన్నావు నాయనా...మీమీద నాకున్న వాత్సల్యాన్నే శంకిస్తున్నావా? సవతి తల్లి అయితే దుర్మార్గురాలయితీరాలా? సవతి బిడ్డలను ప్రేమించగల సంస్కారహృదయం ఉండకూడదా? ఒక్కటి అడుగుతాను చెప్పు... మీ అమ్మ మిమ్మల్ని ఎప్పుడూ కోప్పడలేదూ? ఒకసారైనా కొట్టలేదూ?

**రామం:** కొట్టినా చంపినా అది కన్నతల్లి కనక అమ్మకి చెల్లుతుంది? పరాయివాళ్లకి ఎక్కడ నుంచి వస్తుంది ఆ అధికారం.

**శాంత:** నేను పరాయిదాన్ని ఎల్లా అవుతాను బాబూ...మీ నాన్నగారు ఎప్పుడైతే నా మెడలో తాళి కట్టారో, అప్పుడే ఈ ఇంటి దాన్నయ్యాను నేను ఏవిధంగా మీ నాన్నగారికి భార్యనయ్యానో, అదేవిధంగా మీకు కన్నతల్లి నయ్యాను. అప్పటినుంచి నాకు ఈ ఇంటిని చక్కదిద్ది, మిమ్మల్నందర్నీ పెంచి పెద్ద వాళ్లను చేయవలసిన బాధ్యత ఏర్పడింది బాబూ.

**రామం:** మా నాన్నగారికి భార్యవవడంవల్ల నీవు మాకు సవతితల్లివి కాగలిగావేమోకాని, మా కన్నతల్లివి మాత్రం కాలేవు. ఇంక మేము పెరిగి పెద్ద వాళ్లమయి వృద్ధిలోకివచ్చేయోగం మా అమ్మతోనే పోయింది.

**శాంత:** పొరబాటు బాబూ......పొరబాటు......అల్లా అనకు...నేను మీ కన్నతల్లిని కాలేకపోవచ్చు... పోయినతల్లిని తీసుకునిరాలేకనూ పోవచ్చు. కానీ మీకు తల్లిలేనిలోటు రానీయను బాబూ... సవతితల్లి పెంచబట్టే మీరు పైకివచ్చారని లోకం అనుకోవాలని కోరుకుంటానేకాని, సవతిబిడ్డలకు ద్రోహంచేశాననే వాదును తెచ్చు కోను బాబూ.

**రామం:** ఆ...అదుగో...నువ్వే బయటపెట్టావు...... లోకం ఏమనుకుంటుందోఅన్న భయంవల్లనే కాని, మామీద ప్రేమఉండికాదు...అందుకే ఈ నటనఅంతా...ఎవరికి తెలియదు......సవతితల్లి నుంచి తల్లిప్రేమను పొందగల మనుక్కోవడం వట్టివెర్రి......అందుకే ఈ నటనలు మాని మా మానాన్న మమ్మల్ని వదిలెస్తే...మా కర్మ ఎల్లాగుంటే అల్లాగవుతాం.

**శాంత:** రామం...సవతితల్లికి ప్రేమ ఉండదనేభావం నీ గుండెల్లో గూడుకట్టుకుపోయింది. అది పోనంతవరకూ నా ప్రేమను నీవు అర్థం చేసు కోలేవు బాబూ.

**రామం:** అర్థం: ఎన్నిఅనర్థాలో దాపురించేయోగం ఉందికనుకనే మా కర్మ మిట్లా కాలింది. (అని బిగ్గరగా) ఒరేయ్ గోపీ, ఎందుకురా, ఆ వెధవఏడుపు? బడికి వెళ్తేవెళ్లు...లేకుంటే మానెయ్...అంతేకాని కొంప ఎగిరిపోయేటట్లు దిక్కుమాలినఏడుపు ఏడ్చావంటే మక్కెలు విరగతంతాను.

**శాంత:** (చిరునవ్వుతో) అన్నావనని కోపం వద్దు కాని...రామం...నీ నోటితో నీవే అన్నావే వాడి మక్కెలు విరగతంతానని, నేను కనీసం వాడిని

కొడతానని కూడా అనలేదే! నాన్నగారితో కొట్టించనా అంటేనే నీకు అంతకోపం వచ్చింది! వాడి క్షేమంకోసం ఆమాత్రంమాట అనకూడదా బాబూ. నువ్వే చెప్పు...పెద్ద వాడివి...అన్నీ తెలిసిన వాడివి.

రామం: (కొంచెం తటపటాయించి) వాడూ నేనూ ఒకే రక్తం పంచుకొని పుట్టిన వాళ్ళం... వాడిని కొడ్తాననడానికైనా, కొట్టడానికైనా నాకు హక్కు ఉంది.

శాంత: (బాధగా) సరేలే బాబూ...నాకులేని హక్కు కోసం పోదాలెందుకు? పోనీ నీ తమ్ముడిని ఏ విధంగానైనా బుజ్జగించో...బెదిరించో బడికి పంపించు. ఎల్లాగైనా వాడు పైకి రావడమే నాకు కావలసింది.

రామం: మధ్య నా కెందుకు? అవన్నీ చూసుకోడానికి ఇంటిపెద్ద.. నాన్నగారున్నారు. ఆయన ఇంటిని ఎల్లా కావాలనుకుంటే అల్లా చక్కదిద్దు కుంటారు.

(నారాయణరావు ప్రవేశం)

నారా: (ప్రవేశిస్తూ): ఏమిట్రా రామం...'నాన్న'... 'ఇంటిపెద్ద' అంటున్నావు? పెద్దరికాల సంగతి ఇప్పుడుఎందుకొచ్చింది? నీ కోసం ఎవరైనా పెళ్లివారొచ్చారా?

రామం: (చిరాకుగా) హు...అదొక్కటే తక్కువయింది బతుక్కి...

శాంత: అదికాదండీ...అసలు ఏం జరిగిందంటె (ఏదో చెప్పబోతుంటుంది).

నారా: (చిరాకుగా)... నోర్మూయ్ ... నేను వాడి నడుగుతుంటే మధ్య నీవు కల్పించుకుంటా వెందుకు? లోపల చంటాడు ఏడుస్తున్నట్లు న్నాడు. పోయిచూడు.

(శాంతలోనికి వెళ్తుంది. కళ్లజోడు చూచుకుంటూ)

నారా. ఏమిట్రా రామం...ఏం జరిగింది?

రామం: ఆ...ఏం లేదండీ...గోపీగాడు బడికి వెళ్లనని మారాం చేస్తున్నాడు. వాడిని బెదిరిస్తోంది.

నారా: ఎవరురా బెదిరిస్తోంట?

రామం: అదే...పిన్ని...('పిన్ని' అనే మాటను కటువుగా ఒత్తిపలుకుతాడు)

నారా: ఏమని బెదిరించిందిరా?

రామం: ఆ...ఏముంది...మీతోచెప్పి కొట్టిస్తానని... ఏదో అంటోంది. నేను కల్పించుకునేసరికి... 'సవతి తల్లి'...'సవతిపిల్లలు' అంటూ ఏదేదో వాదనలోకి దిగింది.

నారా: మరి 'నాన్న' ... 'ఇంటిపెద్ద' అంటూన్నా వేమిటిరా?

రామం: మరేం లేదు...పిల్లల బాగోగులు చూసుకో డానికి ఇంటిపెద్ద మా నాన్నగారున్నారు... ఇతరులు కల్పించుకోవడం అనవసరం అంటు న్నాను.

నారా: ఎవ్వరా ఆ ఇతరులు?

రామం: (మాట్లాడడు)

నారా: ఒరేయ్ రామం: పిన్ని పరాయిదెల్లా అవుతుందిరా? మీకు తల్లితో సమానంరా. (చంటి పిల్లవాడిదెసగా చూపిస్తూ) అదిగో చూడు. ఆ చంటివాణ్ణి చూడు: మీ అమ్మ పోతూపోతూ మీతోపాటు ఆ ఏడాదిగుడ్డుని కూడా నాకు అప్పచెప్పి వెళ్లిందిరా. ఆడదిక్కు లేక సంసారంలో మీరు పైకివస్తారురా? నాకోసంకాదురా నేను పెళ్లాడింది ...మీకోసం. కేవలం మీకోసం; ముఖ్యంగా ఆ పసిగుడ్డుకోసం.

రామం: అయితే మీరు చాలా పొరబాటుపడ్డారు, నాన్న గారూ...లోకంలో సవతితల్లి మంచిగాఉండడం ఎక్కడైనా చూశారా? తెలిసితెలిసి ఇటు వంటి పొరబాటుపని ఎందుకుచేశారు నాన్న గారూ?

నారా: అల్లా అనకురా......శాంత అందరివంటిది కాదు...దాని హృదయం మంచిది. అది మీకు

తల్లిలేనిలోటు తీరుస్తుందిరా...ఆమె స్వభావం నాకు ముందునుంచి తెలుసుకనకనే ధైర్యంతో చేసుకున్నాను. ఆమెను తల్లిగా చూడండి, బాబు.

రామం : అదిమాత్రం నావల్ల జరిగే పనికాదు... ఆమెను 'పిన్ని' అనడానికికూడా నా మనస్సు ఒప్పదు...నాకెందుకు...నాకు కాలేజీ టైం అయింది...నేను పోతున్నా......ఆ గోపిగాడు ఇంకా గునుస్తూనే ఉన్నాడు. వాణ్ణి సముదాయించుకోండి.

[రామం వెళ్ళిపోతాడు]

[నారాయణరావు భారంగా నిట్టూర్పు విడుస్తాడు.]

(తె ర)

## రెండవరంగం

[గదిలో నారాయణరావు వాలుకుర్చీలో కూర్చుని పేపరు చదువుకుంటుంటాడు. సమయం: రాత్రి సుమారు 10 గంటలు.]

(శాంత ప్రవేశిస్తుంది)

శాంత : ఏమండీ...........

నారా : (వినిపించుకోనట్లు 'హోయ్'అని అవులిస్తాడు.)

శాంత : ఏమండీ...మిమ్మల్నే...

నారా : అబ్బబ్బ......ఏమిటా గోల? (అని చిరాకు పడుతాడు.)

శాంత : (బాధగా) ఎందుకండీ పిలిస్తేనే అంతచిరాకు పడుతారు? నేనేం పాపం చేశానండీ?

నారా : పాపంచేసింది నీవు కాదు...నేను...అందుకే రత్నంలాంటి భార్యను పోగొట్టుకున్నాను.

శాంత : ఎందుకండీ గతాన్ని తలుచుకుని బాధపడతారు? మనం ఎంతబాధపడినా పోయినవాళ్ళు తిరిగి వస్తారా? నేను మీ పోయిన భార్యను కాలేకపోయినా నేనూ మీ భార్యనే...అర్ధశరీరం ఇయ్యలేకపోయినా మీ హృదయంలో ఆమాత్రం స్థానం ఇయ్యండి...నాకు మీ భార్యగా సేవ చేసే అవకాశం ఇవ్వండి.

నారా : ఈ సినిమా కబుర్ల కేమిలే......బాగానే ఉంటాయి. నిజంచెప్పు నీ హృదయంలో వయస్సు మళ్ళుతున్న ఈ రెండోపెళ్ళివాడి మీద ప్రేమ ఉందా? అసలు ఉంటుందా? ఇవన్నీ నీ నాలిక చివరనుంచి వచ్చిన మాటలు కావూ?

శాంత : ఎందుకండీ నన్నిలా క్షోభ పెడుతారు? నన్ను భార్యగా ప్రేమించలేకపోయినా కనీసం ముచ్చటగానైనా రెండు మాటలు మాట్లాడరాదా?

నారా : హుం......ముచ్చట...ఈ వయస్సులో ఇంకా నాకు ముచ్చట్లేమిటి?

శాంత : మీకు ముచ్చట్లు గతంలో తీరిపోయిఉండవచ్చు. ఇప్పుడు మీ ముచ్చట్లే లేకపోవచ్చు... కాని కనీసం నాకూ కొన్నిసరదాలుంటాయి గదా! నాకోసం కనీసం నా తృప్తికోసం సౌఖ్యంగా మాట్లాడరాదా?

నారా : నీకు నిజంగా నామీద ఆపేక్ష ఉందా? నీవు నన్ను మనసారా ప్రేమిస్తున్నావా? ఎందుకీ వంచన?

శాంత : హుం...ఇదేనా మీరు నన్నర్థం చేసుకుంది! ఏనాడైతే నేను మీకు భార్యనయ్యానో ఆనాటి నుంచీ మిమ్మల్ని త్రికరణశుద్ధిగా ప్రేమిస్తూన్నాను. మీకు ఏర్పడిన లోటును పూరించడానికి శక్తివంచనలేకుండా ప్రయత్నిస్తున్నాను.

నారా : నిజంగా ఈ రెండోపెళ్ళివాడిని ప్రేమిస్తున్నావంటే ఎల్లా నమ్మమంటావు. నీ మనస్సు ఎప్పుడు వయస్సులోఉన్న ఇతరు లెవ్వరిమీదా పోలేదూ.

శాంత : నిజం చెప్పమంటారా? నిరుపేదకుటుంబంలో పుట్టినా అందరిలాగానే నాకు కోరిక లున్నాయి...అందరివలెనే ఎన్నెన్నో ఊహించు

ప్రేమించలేదని అనుకున్నప్పుడు నన్నెందుకు పెళ్లి చేసుకున్నారు? నా పట్ల మీ ధర్మాన్ని ఏమి నిర్వర్తిస్తున్నారు.

నారా: (ఒక నిముషం మౌనంగా ఉండి) నేను పెళ్లి చేసుకుంది నా కోసంకాదు. నా పిల్లలకోసం. ముఖ్యంగా ఆ పసివాడికోసం. వాళ్లకి కన్న తల్లిలేని లోటు తీరాలి.

శాంత: (ఉక్రోషంలో) ఎంతస్వార్థం. తల్లిలేని మీ పిల్లలకు పరాయి దాన్నైన నేను తల్లినై వాళ్ల లోటు తీర్చాలి! తాళికట్టిన భర్త దగ్గరఉండికూడా నాకు భర్తలేని లోటు ఉండాలా? మీ పిల్లలకోసమే అయితే మీరొక దానిని కుదుర్చుకుంటే బాగుండేదికదా? నా మెడలో తాడుకట్టి నా కెందుకు ఉరి త్రాడు బిగించారు? అభం శుభం ఎరుగని అమాయకురాలనైన నా జీవితం ఎందుకు నాశనం చేయ సంకల్పించారు?

నారా: (ఏమి చెప్పలేక) శాంతా......నువ్వేన్నైనా చెప్పు...నా మనస్సు నా చెప్పు చేతల్లో లేదు. ఇప్పుడు నా అభిప్రాయాలు మార్చుకోలేను. మనకి వాదన అనవసరం. వాదించిన కొద్దీ మన ఇద్దరి మధ్యా అగాధం ఎక్కువవుతుంది.

శాంత: క్షమించండి...మీతోవాదించాలనికాని మీమనస్సు నొప్పించాలనికాని ఉద్దేశం నా కెప్పుడూ లేదు. నేను మీకు ఏ విధంగా ఉపయోగపడినా సంతోషమే. భార్యలేని మీకు, తల్లిలేని ఆబిడ్డ లకు లోటు తీర్చాలనికదా ప్రయత్నిస్తున్నాను. నా ప్రయత్నం ఫలిస్తే సంతోషంగా కన్ను మూస్తాను.

నారా : నీ సంరక్షణలో నా బిడ్డలు పైకి రావడమే నేను కోరేది.

శాంత: నేను సవతి తల్లినైనా నాకు దుర్బుద్ధి లేదు. పిల్లలు ఆ విషయం గ్రహించి నన్ను తల్లిగా చూడగలిగితే అంతే చాలు.

నారా : అదే నేను కోరేది. ఏది ఎల్లా జరుగవలసి ఉంటే అది అల్లా జరుగుతుంది

(తెర)

## మూడవ రంగం

(రాము, డాక్టరు సుబ్బారావు గదిలోనించి, సావడిలోకి వస్తారు. సమయం మధ్యాహ్నం రెండు గంటలు).

రామం: డాక్టరుగారూ...చంటివాడిని చూశారు కదా! ఎల్లా ఉన్నాడంటారు?

సుబ్బా: పర్వాలేదు...కాకపోతే మరీ చంటిపిల్లవాడు కదా...అందువల్ల జ్వరానికి తట్టుకోలేక పోతున్నాడు.

రామం: మామూలు జ్వరమే నంటారా ?

సుబ్బా: లక్షణాలు చూస్తే టైఫాయిడ్ అవ్వచ్చు ననిపిస్తోంది. ఇంకా జాగ్రత్తగా పరీక్ష చేయందే ఖాయంగా చెప్పలేను.

రామం: (కంగారుగా): టైఫాయిడా. అయితే ఇంకే ముంది.

సుబ్బా: అంత కంగారెందుకు రామం? ఈ రోజుల్లో టైఫాయిడ్ గురించి భయపడవలసింది ఏమి లేదు. ఎన్నో మంచి మందులున్నాయి. నేను ఎన్ని కేసులు నయం చేశాను! భయపడకు.

రామం: (దిగులుగా): ఏణ్ణార్థం గుడ్డుకి టైఫాయిడ్ వస్తే వాడేం కోలుకుంటాడండీ ... మీరేదో నా ధైర్యంకోసం చెబుతున్నారు కాని.

సుబ్బా: రామం...నా సంగతి నీకు తెలుసు గదా... నాకు డిగ్రీలు లేకపోవచ్చు కాని అవి వున్న వాళ్లకంటె ఎక్కువ అనుభవమే ఉంది.

రామం: మీ మీద ఆ నమ్మకం ఉంది కనుకనే మిమ్మల్ని తీసుకొచ్చాను. పైగా మీహస్తవాసి నే నెరుగనిది కాదు.

సుబ్బా: మరి నీవు కూడా అల్లా భయపడితే ఎల్లా చెప్పు.

రామం: వాడు తల్లి లేని పిల్లవాడు. సవతి తల్లి పోషణలో పెరుగుతున్నవాడు.

సుబ్బా: (చప్పరించి): పాపం... దురదృష్టవంతుడు!

రామం: వాడి దౌర్భాగ్యం కాకపోతే ఈ పసితనంలోనే వాడు తల్లిలేనివాడు కావాలా?

సుబ్బా: మన చేతిలో ఏముంది చెప్పు ?

రామం: అందుకనే నా దిగులు...మా నాన్నకా, ఇంటి సంగతి పట్టదు ... సవతి తల్లి పోషణ ఎల్లాగుంటుందో మీకు తెలియని దేముంది!

సుబ్బా: అదేమిటోయ్...మీ పిన్ని చాల మంచిదని విన్నాను!

రామం: దూరపుకొండలు నునుపు డాక్టరుగారూ... సవతి తల్లికి పరాయి పిల్లలపై ప్రేమ ఎల్లా ఉంటుంది? (నెమ్మదిగా) మా పిన్ని అద్భుతంగా నటించి అందర్నీ మోసగిస్తోంది.

సుబ్బా: లో గుట్టు పెరుమాళ్ళ కెరుక: నాకేం తెలుసు. నేను విన్నదేదో చేప్పాను.

(బయటనుంచి ఆయుర్వేద విద్వాన్ రంగా చార్యులు ప్రవేసిస్తాడు)

రంగా: (వస్తూ): అమ్మా...శాంతమ్మా......

శాంత: (ప్రవేశిస్తూ) రండి ధన్వంతరిగారూ......

(రంగాచార్యులను చూసి రామం సుబ్బారావు ఒకరి ముఖం మరొకరు చూసుకుంటారు. సుబ్బారావు ముఖం చిట్లించుకుంటాడు.)

రంగా: (సుబ్బారావు వంక చూసి) అయ్యా... మీరా, సుబ్బారావుగారూ ... తమరూ దయచేశారా ఏమిటి?

శాంత: వారిని అబ్బాయి పిలిపించినట్లున్నాడు లెండి.

రంగా: అల్లాగా...బాగుంది...చంటివాడెక్కడ.

శాంత: అదుగో.. ఆ గదిలో ఉన్నాడు...ఇల్లా దయ చేయండి (లోనికి ధారి చూపుతుంది).

రంగా: (లోనికి వెడుతూ)పిల్లకాకికేమి తెలుసు ఉండేలు దెబ్బని ఈ కుర్రకారు ఇంగ్లీషు వైద్యులకేమి తెలుస్తుందమ్మా వైద్యం సంగతి?

సుబ్బా: (ముఖం ముడ్చుకుని) రామం... ఈ శకున పక్షిని రానిచ్చారు? ఎందుకు? ఆయన వైద్యం మీద నమ్మకముంటే ఆయన్నే రమ్మని పిలిస్తే పోయేది గదా? మధ్య నన్ను పిలిపించింది దేనికి? నన్ను ఫూల్‌ని చేయడానికా?

రామం: (దైన్యంగా) ఎక్స్క్యూజ్‌మీ డాక్టర్... మీరు అల్లా అనుకోవద్దు. ఇదంతా మా పిన్ని పనిలాగుంది...ఐ ఫీల్ వెరీ సారీ...

(శాంత, రంగాచార్యులు బయటకు వస్తారు)

శాంత: అయ్యా...పిల్లవాడి కెల్లాగుంది.

రామం: (సుబ్బారావు చెవిలో నెమ్మదిగా) చూడండి డాక్టర్, మా పిన్ని నక్క వినయాలు... మీరున్నారని మీ ముందు, చంటివాడి మీద ఎంతటి ఆపేక్ష ఒలకపోస్తోందో.

రంగా: (సుబ్బారావు ముఖం వంక ఒకసారి చూసి): పిల్లవాడి ఒళ్ళు చల్లగా ఉంది. ఈరోజుల్లో ప్రతివాడూ డాక్టరే...మెళ్లో ఒక రబ్బరు గొట్టం వేసుకు తిరుగుతే సరి...ఏమి మందు వాడాలో ఏమో...పిల్లవాడికి శీతలం కమ్మింది.

శాంత: (కంగారుగా) అయ్యా...పిల్లవాడి సంగతి సరిగ్గా చెప్పండి.

రంగా: భయపడకమ్మా... ఇప్పుడే సువర్ణతాంబరం తేనెలో రంగరించి నాకింప చేశానుగా... చూస్తుండగానే వళ్లు వేడి ఎక్కుతుంది.

శాంత: (కళ్ళు ఒత్తుకుంటూ): ఏమో బాబూ... పాలముంచినా నీటముంచినా మీదే భారం. వారుకూడా ఇంట్లో లేరు. అవసరమయిన పనిమీద బయటకు వెళ్లారు.

రంగా: మీరేం కంగారు పడకండమ్మా...ఒక్కమోతాదు చింతామణి వేశానంటే ఎటువంటి రోగమైనా తొమని పోవలసిందే.

సుబ్బా:(రామం వంక చూస్తూ) ఆ...ఆ...తొమని అవవలసిందే.

శాంత: అవేం మాటలు...బాబూ...

రామం: అక్కరలేని విషయంలో ప్రతివాళ్ళు వేలు పెడితే ఇంకేమవుతుంది?

రంగా: అమ్మా.. శాంతమ్మ ధన్వంతరంతటివాడిని నేనుండగా ఈ క్షురకారుని పిలిపించావెందుకమ్మ? నన్నవమానించడానికా!

శాంత: క్షమించండి ఆచార్యులవారూ...రామం వైద్యుని తీసుకొస్తున్నట్లు నాకు తెలియదు.

(నారాయణరావు, హోమియోవైద్యుడు మూర్తి ప్రవేశిస్తారు)

నారా: (అందరివంక ఒక్కసారి ప్రశ్నార్థకంగాచూసి) డాక్టరుగారూ...లోనికిరండి...పిల్లవాడుగదిలో ఉన్నాడు.

మూర్తి: (సుబ్బారావు వంకా, రంగాచార్యులవంకా చూసి ముఖం చిట్లించుకుంటాడు. వాళ్ళిద్దరూ మూర్తినిచూసి ఒకరి ముఖం మరొకరు చూసుకుంటారు. సుబ్బారావు ముఖం చిట్లిస్తాడు. రంగాచార్యులు పెదవి విరుస్తాడు.)

నారా: రండి డాక్టరుగారూ... (అంటూ తిరిగి పిలుస్తాడు)

(నారాయణరావు మూర్తి లోనికి వెళ్తారు)

సుబ్బా: (రామంవంక తిరిగి వ్రేళ్ళలోకి తనజుట్టును తీసుకుంటూ) నేను ఇన్నికేసులు చూశాను కాని ఇంతటి రోగానికి ఇంతమంది డాక్టర్లనూ ఇన్నిరకాల వైద్యులనూ ఎక్కడాచూడలేదు.

రామం: (తలవంచుకుని) క్షమించండి డాక్టరుగారూ. మా నాన్నగారు మరొక డాక్టరును తెస్తున్న విషయం నాకు తెలియదు.

రంగా: (శాంతమ్మవంకతిరిగి) ఎంతమంది డాక్టర్లు వచ్చి ఏమిప్రయోజనము. శాస్త్రీయవైద్యం చేయాలి. నాడి చూస్తూనే మేము రోగాన్ని పసికడతాం, ముఖం చూస్తూనే రోగిసంగతి తేల్చివేస్తాం. మా తాతగారు రామానుజాచార్యులుగారు నాడిచూసి నెలరోజులు ముందుగానే మరణంగురించి చెప్పేవారు.

సుబ్బా: (వెటకారంగా) ఒకవేళ రోగి నెలతిరగ్గానే చావకపోతే, మీ భస్మాలు ప్రాణంతీసి, మీ జోస్యాన్ని నిజంచేస్తారు కాబోలు.

రంగా: (కోపంగా): పాసుపీసని నాలుగు ఇంగ్లీషు ముక్కలు పేలగానేకాదు. అడ్డమైనదానికీ సూదిపోట్లు పొడిచి వళ్ళంతా చిల్లులు పొడవడంకాదు. మా వంశానికి ఆయుర్వేదం, సాక్షాత్తు అశ్వినీదేవతలనుంచి సంక్రమించింది. ధన్వంతరి మా కులగురువు.

(నారాయణరావు, మూర్తి గదిలోంచి సావిట్లోకి వస్తారు.)

నారా: (ఆత్రంగా); డాక్టరుగారూ...పిల్లవాడు ఎలా ఉన్నాడంటారు?

మూర్తి: మన ప్రయత్నం మనంచేద్దాం ... కాని ఒక్కవిషయం మీరు జ్ఞాపకం ఉంచుకోవాలి. మీ పిల్లవాడిమీద మీకు ఎంతప్రేమఉన్నా, రకరకాల వైద్యాలు చేయించి ఆ పసివాడి ఒళ్ళంతా మందులలో నింపివేస్తే చివరికి ఏమందు పనిచేయదు. మీరు ఎవరో ఒకన్నే నమ్ముకోవాలి.

నారా: క్షమించండి: నాకాఉద్దేశం ఎప్పుడులేదు. నాకు చెప్పకుండా మా వాళ్ళు వేరేవాళ్ళని పిలిచినట్లున్నారు.

సుబ్బా: పంచదారగుళ్ళు ఇచ్చేవాళ్ళుకూడా వైద్యం గురించి మాట్లాడేవాళ్ళే!

మూర్తి: వట్టిగొడ్డుకు అర్పులెక్కువని, డిగ్రీ లేకపోయినా, డాక్టరు పోజులకేం లోటులేదు. తెలీనివాళ్ళకి హోమియోమందులు పంచదారగుళ్ళల్లేనే కనిపిస్తాయి.

రంగా: అసలు రోగనిదానం ఈనాటి వైద్యులకేం తెలుసునయ్యా... ...అది మా బిషగ్వరులకే

సాధ్యం. అయినా ఉమాపతి వైద్యంకూడా వైద్యమేనా?

మూర్తి: ఆహా...హోమియోపతి అనడం రానివాళ్లు కూడా మాట్లాడ్డమే......చెట్టుపేరు చెప్పుకుని కాయలమ్మకున్నట్లు, తాతలపేర్లు చెప్పుకుంటూ వైద్యంచేయడమేకాని, అసలు ఆయుర్వేద గ్రంథాలలోని ఒక సంస్కృత శ్లోకానికైనా అర్థం చెప్పగలరా మీరు?

రంగా: మమ్మల్నే అపహాస్యం చేస్తున్నారుగా:

సుబ్బా: అక్కడికి నన్నుమాత్రం ఊరుకున్నాడా ఏమిటా పెద్దమనిషి? నాకు డిగ్రీ లేక పోవచ్చుగాని నాకున్నంత జ్ఞానం, అనుభవం ఇంకెవరికున్నాయి?

మూర్తి: అక్కడికి మీరేదో తక్కువ తిన్నట్లు! అసలు హోమియోపతివైద్యంఅంటే ఏమిటో ఏమాత్రం తెలియని మీరిద్దరూ నోటికొచ్చినట్లు మాట్లాడడమా?

నారా: అయ్యా...మీ అందరికి దణ్ణాలు... దయచేసి మీలో మీరు పోట్లాడుకోకండి.

మూర్తి: నన్ను పిలుచుకొచ్చి నాకు నీతులు చెబుతారేమిటండీ? కావలిస్తే వాళ్లిద్దరికీ చెప్పండి.

సుబ్బా: ఎవరైనా నన్నంటే ఉరుకుంటానా ఏమిటి? ఏమయ్యా రామం? నన్ను పిలుచుకొచ్చిన వాడివి వాళ్లంతా నన్ను నానామాటలూ అంటుంటే నోరు మూసుకుని ఉరుకుంటావేమిటయ్యా?

రంగా: ఏమమ్మా శాంతమ్మా...ఇందుకా నన్నిక్కడికి పిలిపించింది? వయస్సులోనూ, జ్ఞానంలోనూ, అనుభవంలోను అందరికన్నా పెద్దముండా వాడిని, నన్ను వాళ్ల నోటికొచ్చినట్లల్లాకూసి అవమానిస్తుంటే ఉరుకుంటావేమమ్మ? (భూతవైద్యుడు గవరయ్య చేతిలో వేపమండ పట్టుకుని ప్రవేశిస్తాడు.)

గవరయ్య: అంబపలుకు...జగదంబపలుకు...మాతా...ఈ ఇంటి సుస్తీ ఎవరికో ఎరుకపరచు.

నారా: ఎవరయ్యా నువ్వు? ఎవరు పిలిచారు నిన్ను?

గవ: (వినిపించుకోకుండా) ఓం...హ్రాం...హ్రీం... రోగి ఎక్కడో తెలియజేయి జననీ.

రామం: వీణ్ణికూడా ఆవిడే పిలిపించి ఉంటుంది. ఉన్న గోల చాలక వీడొకడు నెత్తిమీదకి.

శాంత: నాకేం తెలియదు బాబూ (అని గవరయ్యతో) ఎవరు నాయనా నీవు?

గవ: (తల ఆడిస్తూ) మాతా...జగన్మాతా...శాకినీ ఢాకినీ...గాలి దెయ్యంబలన్ పారద్రోలు. ఈ గవరయ్యనే ఎరుగరెవరు?

రామం: ఇక్కడికి రమ్మని ఎవరు పిలిచారు నిన్ను?

గవ: (పైకి చూస్తూ) మాతా...మహంకాళీ...ఈ ఇంటివాసి జంగమ్మ వీరి పసిపాపని ఆవహించిన దయ్యమును పారద్రోలమని చెప్పలేదా?

సుబ్బా: నువ్వొక్కడవే తక్కువయ్యావు...అదుగో ఆ గదిలో ఉన్నాడు రోగి పోయి చూసిరా.

గవ: మాతా... జగన్మాతా ... (అంటూ లోనికి పోతాడు).

శాంత: ఏయ్...ఎక్కడికి పోతున్నావు? అక్కడే ఉండు (అంటూ వాని వెనకాలే లోనికి పోతుంది.)

రంగా: పంచభూతాల తత్త్వము ఎరిగిన మేముచేసే వైద్యముముందు, ఈ భూతవైద్యము ఏమి పని చేస్తుంది?

మూర్తి: నారాయణరావుగారూ...ఇంతేనా, ఇంకా ఎవరైనా వైద్యులు రావాలా (అంటాడు వ్యంగ్యంగా).

నారా: క్షమించండి......నాకంతా అయోమయంగా ఉంది.

సుబ్బా: ఏమి రామం...ఇంకే యూనానివైద్యం... ప్రకృతివైద్యం, గోసాయిచిట్కాలు, మంత్ర

వైద్యాలు మిగలిపోయినట్లున్నాయి. వాళ్లకి కబురు పంపించావా లేకుంటే నన్ను పంప మంటావా?

రామం : సార్...మీరుకూడా...అల్లాఅంటే ఇంక నేను చెప్పేదేముంది. ఇదంతా చూస్తుంటే నాకు పిచ్చెక్కేటట్లుంది.

రంగా : కాకుంటే ఏమిటండీ...ఇక్కడేదో అన్నిరకాల వైద్యుల సమావేశాన్ని ఏర్పరచినట్లుంది కాని...వైద్యం చేయుస్తున్నట్లులేదు.

(గవరయ్య గదిలోంచి సావిట్లోకి తిరిగి వస్తాడు.)

(వెనకాతే శాంత వస్తుంది)

గవ : (ప్రవేశిస్తూ): తల్లీ......పరాశక్తి...సందేహం లేదు...ఈ పసివాడిని వాడి తల్లి దయ్యమై పీడిస్తోందని అంటున్నావా?

నాతా : దయ్యమూలేదు...నీ పిండాకుడూలేదు...నోరు మూసుకుని బయటకుపో......

రామం : ఏమో నాన్నా...వాడు చెప్పిందీ నిజం కావచ్చు. బిడ్డమీద తల్లికి భ్రమఉండడంతో ఆశ్చర్యమేమిటి? అందులోనూ సవతితల్లి పెంపకంలో ఉన్నాడని అమ్మ ఆత్మ బాధ పడుతుండవచ్చు.

శాంత : రామం...ఏమిటా మాటలు......నీకేం అప కారం చేశానని అంతదారుణంగా మాట్లాడు తున్నావు?

గవ : (అరమోడ్పుకన్నులలో) చండీ...చాముండీ... ప్రేతాత్మ పోషిస్తోందంటున్నావా? సవతిరాకను సహించలేకపోతోందంటున్నావా?

రామం : వింటున్నావా నాన్నా?

నాతా : నోర్మూయ్‌రా...నీకు వయస్సు పెరుగుతుంటే బుద్ధి తరుగుతోంది.

గవ : తల్లీ......మహామాయా... ...ఏమిటంటున్నావు హోమంచేయాలి, దీపం వెలిగించి, దయ్యాన్ని సీసాలోపెట్టి భూస్థాపితం చెయాలి? నీ భక్తు లకు చెప్పమంటున్నావా?

రంగా: గవరయ్యా...ఇందాకట్నుంచీ చూస్తున్నాను నీకుప్పి గంతులు. దయ్యాన్ని కాదురా...నిన్ను భూస్థాపితం చేయిస్తాను. నా ముందర నటరా నీ నాటకాలు? నోరు మూసుకుని బయటకుపో...

గవ : (కళ్లుమూసుకుని గద్గద కంఠంతో) అమ్మా! జగజ్జననీ!నీకు కోపం వచ్చిందా? వద్దు తల్లీ! నీకు కడుపునిండా మధువు ఇచ్చుకుంటారు నీ భక్తులు.

రంగా: చేయి తడి చెయ్యందే ఈ జిత్తులమారి కొడుకు పోడు బాబూ.

నారా: ఇంద...ఈ రూపాయి తీసుకుని బయటకు తగలడు. (అంటూ గవరయ్య ముఖంమీద రూపాయి పడవేస్తాడు.)

గవ : (దాన్ని తీసుకుని కళ్ల కద్దుకొని) దండాలు బాబూ...దండాలు. కాళీమాత ప్రసన్న మయింది. బాబుకి కులాసా చిక్కుతుంది. నేను పోయివస్తా.

రంగా: ఒరేయ్...మళ్లీ రాకు...

(గవరయ్య నిష్క్రమిస్తాడు)

సుబ్బా: చాలా బాగుందండీ నాటకం...ఇటువంటి కేసు రోజుకొక్కటుంటే చాలు...మాకు కడుపు నిండినట్లే. నేను పోతున్నా.

రామం: క్షమించండి...నేను మళ్లీ వచ్చి సావకాశంగా మీతో మనవి చేసుకుంటాను.

(సుబ్బారావు నిష్క్రమిస్తాడు)

రంగా : నాకోసం ఎంతోమంది రోగులు-బారులు తీరి పడిగాపులు పడుతూ తపస్సు చేస్తూంటారు. నేను పోయివస్తాను.

శాంత: జరిగిందానికి నన్ను క్షమించండి.

రంగా: పర్వాలేదులే అమ్మా...వెళ్లాక మందు పంపి స్తాలే.

(రంగాచార్యులు నిష్క్రమిస్తాడు)

మూర్తి: అందరిదీ తలో దారిగా ఉన్న ఈ ఇంట్లో నేను వైద్యంఏమి చేస్తాను? నేను పోతున్నాను.

నారా: క్షమించండి సార్...ఇవేమీ మనస్సుతో పెట్టుకోకండి. మిమ్మల్ని తిరిగ్గావచ్చి కలుసుకుంటాను.

(మూర్తి నిష్క్రమిస్తాడు)

(శాంత కళ్ళు తుడుచుకుంటూంటుంది)

నారా: స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః అని ఊరికే అన లేదు. ఏమే, ఎవరినడిగి రంగాచార్యులుని పిలిపించావు?

శాంత: పిల్లవాడి పరిస్థితి నానాటికీ దిగజారు తోంది. ఆచార్యులవారు మా కుటుంబ వైద్యులు. పిల్లవాడి సంగతి తెలిసి మా అమ్మ పంపించింది. ఎవ్వరూ పట్టించుకోకపోతే ఆ చంటివాడు ఏమైపోతాడు చెప్పండి? ఎవరి పుణ్యాన్నైనాసరే మన బాబు బాగుండడమే నాకు కావలిసింది.

రామం: చూశారా, నాన్నగారూ...పిల్లవాడి సంగతి మనం పట్టించుకోనివాళ్ళము ఆవిడ పట్టించుకునేదీను. కన్నతండ్రిఅయిన మీకు వాడిమీద ప్రేమలేదు కాని, సవతితల్లికి మాత్రం ఉంది. మనల్ని నలుగురిలో యాగీ చేయడానికి కాకపోతే ఎందుకు చేస్తున్నట్లు ఈ పనులు?

శాంత: రామం...ఎందుకయ్యా నేను చేసినవాటికి విపరీతార్థాలుతీసి నన్ను చిత్రవధ చేస్తున్నావు?

(శాంత కళ్ళు వత్తుకుంటూ ఉంటుంది)

నారా: నోర్మూయ్...వాడు చెప్పినదాంట్లో అబద్ధమేముందీ; నీ మూలాన్నకాదూ, ఇవాళ నాకింత అవమానం జరిగింది? పైగా దిక్కుమాలిన కన్నీళ్ళొకటి...ఆడవాళ్ళకున్న అస్త్రమే అది. అనుకుంటేచాలు కుండలకొద్దీ కురుస్తాయి. ఆ ఏడ్చేదేదో లోపలకిపోయి ఏడు.

(శాంత లోనికి నిష్క్రమిస్తుంది)

రామం: నాన్నగారూ...ఇప్పటికైనా నా మాటల్లో నమ్మకం కుదిరిందా మీకు?

నారా: నోర్మూయ్‌వోయ్......నువ్వుచేసిన పనిమాత్రం ఏమిటి? ఎవరిని అడిగి ఆ డాక్టరుని తీసుకు వచ్చావు? మాటమాత్రమేనా నాతో చెప్పావా?

రామం: మీరు తీసుకొస్తున్నారని నాకేం తెలుసు? మీరు ఇంటివిషయాలు పట్టించుకుంటున్నట్లు నాకు అనిపించక ఎవరో ఒకరు చంటివాడిని చూడకపోతే ఎల్లాగని డాక్టరుగారిని తీసుకు వచ్చాను. అది తప్పయిపోయింది. అంతేలెండి. ఉపకారానికిపోతే అపకారం ఎదురవుతుంది.

నారా: అదికాదురా...ఇవాళ నాకు ఎంత అవమానం అయిందో చూడు. నువ్వు మాటమాత్రం నాతో చెప్పిఉంటే ఇల్లా జరిగేదేనా?

రామం: అదే నేను అంటున్నాను. మీరైనా మాటమాత్రం నాతో ఎందుకు చెప్పలేదు.డాక్టరుని తెస్తున్నట్లు? అవమానం మీకేకాదు, నాకూ జరిగింది.

నారా: ఒరేయ్...మాటకిమాట అనడం బాగా నేర్చావురా! ఈ రోజుల్లో కుర్రాళ్ళు కాలేజీల్లో నేర్చుకునేది ఇంకేమి ఉంది?

రామం: ఏమైనా అంటే మీ కళ్ళఎదుట నా కాలేజీ కనిపిస్తుంది. అంత కష్టంగా ఉంటే కాలేజీలో చేర్పించడం మానివేయలేక పోయినారా? నా కెందుకు...నేను చదువుకోడానికి బయటకు పోతున్నాను.

(రామం నిష్క్రమిస్తాడు.)

నారా: (తలపట్టుకుంటూ) ఏమి సంసారం...ఏమి ఇల్లు...పగవాళ్ళకికూడా వద్దురా బాబూ...

(తెర)

## 4 వ రంగం

(నారాయణరావు ఇంట్లో సావడి. సమయం: సుమారు సాయంత్రం 5—00 గంటలు. గోపీ బిగ్గరగా ఏడుస్తూ ప్రవేశిస్తాడు)

గోపి: అన్నయ్యా...పిన్ని కొట్టింది...(అంటూ బిగ్గరగా ఏడుస్తాడు).

రామం: (ఆవేశంగా) ఏమిట్రా...ఎవర్రా నిన్ను కొట్టింది? పిన్నే...పిన్ని నిన్నుకొట్టిందా? ఎవర్రా ఆవిడ నిన్ను కొట్టడానికి (అని బిగ్గరగా) నాన్నా...నాన్నా...

శాంత: (ప్రవేశిస్తూ)...రామం పెద్దవాడివి నీవుకూడా బిగ్గరగా అరుస్తావేమిటయ్యా. అవతల టైఫాయిడ్ వచ్చిన చంటిపిల్లవాడు బాధపడుతుంటే. ఏడ్చి ఏడ్చి ఇప్పుడే కొస్త పడుకున్నాడు. కాస్సేపు నిద్రపోనివ్వండి బాబూ, మీకు పుణ్యం ఉంటుంది.

రామం: టైఫాయిడ్ వచ్చిందంటేరాదూ? సవతితల్లి పోషణంలో అంతకంటె ఇంకేమి వస్తుంది? అసలు వాడిని సరిగ్గా చూస్తేగా...వాడికి ఇష్టంవచ్చినట్లు పాలువట్టి ఒకపద్ధతంటూ లేకుండా పెంచితే ఏమవుతుంది? అయినా అవన్నీ నీకేమి తెలుస్తాయి! కన్నతల్లికైతే తెలుస్తుందికాని. ఆ జ్వరం వాడికి తగ్గేది లేదు..ఎల్లాగూ వాడు వాళ్ళమ్మదగ్గరకి పోవలసిందే.

శాంత: (ఆవేశంలో బిగ్గరగా): రామం, నోర్మూయ్... ఏమిటి నువ్వు మాట్లాడేది? సవతితల్లి... సవతితల్లి—అంటూ పదేపదే నన్ను దూషిస్తున్నావు. అందరు సవతితల్లులవలె నేనూ ప్రవర్తించిఉంటే ఆ తేడా నీకు తెలిసేది.

నారా: (ప్రవేశిస్తూ) ఏమిటే ఆ గోల?

శాంత: చంటివాడు మరీ నీరసంగా ఉన్నాడండీ... ఇవాళ ప్రొద్దుటినుంచీ ఒకటే ఏడుపు... ఇప్పుడే కాసేపు నిద్రపోతుంటే, గోపీ అక్కడే వచ్చి తగనిఅల్లరి చేస్తున్నాడు. వద్దని ఎంత చెప్పినా వినక రెచ్చిస్తుంటే ఒక చిన్నదెబ్బ వేశాను. అందుకూ ఈ రాద్ధాంతం.

రామం: ఇవాళ వాడిని కొట్టింది...అదేమని అడిగితే నన్ను నోర్మూయమని తిట్టింది. ఇటువంటి ఆవిడ రేపు మాకు విషం కలిపిపెట్టినా పెడుతుంది. ఇంక ఈ ఇంట్లో ఆవిడ ఉంటే నేను ఉండేదిలేదు.

శాంత: (తీవ్రమైన ఆవేశంతో అతిబిగ్గరగా) రామం!

నారా: శాంతా...నీవు లోపలికివెళ్ళు...నేను కనుక్కుంటాగా...

(శాంత లోపలికివెళ్తుంది)

నారా: ఒరేయ్ గోపీ (అని గట్టిగా అరుస్తాడు.)

గోపి: (వెక్కుతునే) ఎందుకు నాన్నా? (అంటూ వస్తాడు.)

నారా: వెధవా.. నిన్ను మీ అమ్మ ఎప్పుడు కొట్టలేదా?

గోపి: (మాట్లాడకుండా వెక్కుతుంటాడు.)

నారా: చెప్పవేం? (అని గద్దిస్తాడు.)

గోపి: కొట్టింది (అంటాడు.)

నారా: మరి నేను.

గోపి: నువ్వూను. (అంటాడు నెమ్మదిగా.)

నారా: వెధవా...అమ్మ...నేనూ...నిన్నుకొడితే తప్పులేనిది పిన్ని కొడితే తప్పు వచ్చిందట్రా... దీనికింత అల్లరా? (అని పొళ్ళున లెంపకాయ కొడతాడు.)

గోపి: (గొల్లున బిగ్గరగాఏడుపు లంకించుకుంటాడు)

నారా: ఇక్కడ ఏడ్చావంటె చంపేస్తాను వెధవా... బయటికి పోయి ఏడు (అని గద్దిస్తాడు).

గోపి: (స్థాయి తగ్గించి ఏడుస్తూ బయటికి వెళ్లిపోతాడు).

రామం: ఇది మరీ బాగుంది. వాడి నెందుకండి గద్దిస్తారు? తల్లిలేని వెధవ మీద జాలిపడడంపోయి మీరుకూడా ఆవిడతోపాటు వాణ్ణి కొడుతున్నారే...

నారా: ఎవ్వర్రా ఆవిడ?

రామం: ఆవిడే

నారా: ఆవిడంటె?

రామం: అదే...పిన్ని ('పిన్ని' అనే మాటను అయిష్టంగా కటువుగా పలుకుతాడు)

నారా: గోపీ బుద్ధి తెలీని వెధవ అనుకుంటే— కాలేజీలో చదువుకుంటూ జ్ఞానం ఆర్జిస్తున్నా వనుకుంటున్న నీ బుద్ధి ఏమయిందిరా? పిన్నిని 'ఆవిడ' అంటావు? 'పిన్ని' అన డానికి నోరు రాదురా?

రామం: ఏమో...అల్లా పిలవడానికి నా మనస్సు ఒప్పుకోదు.

నారా: పోనీలే...గోపి అల్లరి బాగుందా? ఎనిమిదేళ్లు నెత్తికొచ్చిన ఆ వెధవకి ఏమిటా పెంకితనం? చంటివెధవ చావు బతుకులమధ్య ఊగిసలాడి దాని ధర్మమా అని బతికి బయటపడితే వాడి దగ్గర వద్దన్నా అల్లరి చేస్తాడా? అందుకు అదో చిన్న దెబ్బవేస్తే అదో తప్పా? పైగా నీవు వాడిని వెనకేసుకు వస్తావా? మీ అమ్మయితే వాడు అల్లా అల్లరి చేస్తుంటే ముద్దేటు కుంటుందా? చెప్పరా...చెప్పు....

రామం: (ఏమి మాట్లాడలేక) నాకు పనుంది నాన్నా, నేను వెళ్తున్నాను.

(అని బయటకు వెళ్లిపోతాడు)

నారా: హాం (అని బరువుగా నిట్టూరుస్తాడు)

(తెర)

## 5 వ రంగం

[నారాయణరావు ఇంట్లో గది. సమయం సుమారు 5 గంటలు (సాయంత్రం)]

నారా: శాంతా...శాంతా......(అని బిగ్గరగా అరుస్తాడు.)

శాంత: ఏమిటండీ...(అంటూ ప్రవేశిస్తుంది.)

నారా: (కోపంగా ఒక చిన్నపెట్టె చూపుతూ) ఈ పెట్టె నెవరు తీశారు?

శాంత: (నసుగుతూ) పెట్టా...పెట్టె.

నారా: ఏమిటి అల్లా నీళ్లు నములుతావు? ఇందులోని చంద్రహారం ఏమయింది?

శాంత: (ఇంకా నసుగుతూ) చంద్రహారం.. చంద్రహారం.

నారా: ఏమిటా నసుగుడు? నువు తీశావా చెప్పు?

శాంత: (బెదురుతూ) లేదండీ..ఆ...ఆ...కాదండీ... మరి...

నారా: నీ వాలకం చూస్తే నీవే తీసినట్లుంది... చెప్పు...నిజం చెప్పు. లేకుంటే చంపేస్తాను. (అని గద్దిస్తాడు.)

శాంత: చెప్తానండీ...అది నేనే తీశానండీ......

నారా: నువ్వా (అని నిర్ఘాంతపోయి) ఎందుకు తీశావు? ఏంచేశావు? చెప్పు.

శాంత: మరండీ...పక్కింటి పిన్నిగారు అటువంటి చంద్రహారం చేయించుకోవాలని, మా అక్కగారు బతికిఉన్నరోజుల్లోనే ముచ్చటపడే వారట. అటువంటిది చేయించుకుంటాను... నమూనాకోసం ఒకసారి ఇమ్మంటే ఇచ్చాను.

నారా: ఓసి దుర్మార్గురాలా.. ఎంతపనిచేశావు? నన్ను అడగకుండా నా వస్తువు తీస్తావా? అది ఏమి టనుకున్నావు. నేను ప్రాణాధికంగా ప్రేమించిన నా భార్య ముచ్చటపడి అడిగితే నేను స్వయంగా చేయించిన వస్తువు. దానిని ముట్టుకోడానికి ఎవ్వరికీ అధికారంలేదు. ఆ పెట్టెను ఎవరు తాకినా నాకు కోపం వస్తుందని నీకు తెలిసికూడా నీవు అందులోంచి

నగని తీశావంటే ఇందులో నీకేదో ద్రోహ బుద్ధి ఉండాలి.

(అని శాంతమ్మను కొట్టుంటాడు)

రామం: (ప్రవేశిస్తూ) నాన్నా...నాన్నా...ఏమిటా పని? పిన్నిని కొట్టున్నారా?

నారా: కొట్టాలా దీన్ని చంపాలా? నేను ఏమో అనుకున్నాను. కాని ఇది దానిసవతి బుద్ధి పోనిచ్చింది కాదురా. నా పెట్టెలోంచి చంద్ర హారం తీసి ఎవరికో ఇచ్చానంటుంది. ఇచ్చిందో, పుట్టింటికే తరలించిందో.

రామం: చాలతొందరపడ్డావు నాన్నా—ఎవరు తీశారో తెలుసుకోకుండా పిన్నిని కొట్టడమేనా?

నారా: తెలుసుకోక పోవడమేం? తానే తీశానని మీ పిన్ని ఒప్పుకుంది?

రామం: (ఆశ్చర్యంగా) తాను తీశానని ఒప్పుకుందా?

నారా: ఒప్పుకోక ఏంచేస్తుంది? చేసిన దొంగతనం దాగుతుందా?

రామం: ఈ మాత్రం దానికి పిన్నిని కొట్టావా? అది ముట్టుకునే అర్హత పిన్నికి లేదా నాన్నా?

నారా: (ఆవేశంతో) లేదు. నా భార్య వస్తువులు ముట్టుకునే అర్హత ఎవ్వరికీ లేదు.

రామం: పిన్నిమాత్రం మీ భార్యకాదా నాన్నా? అమ్మనయితే ఇల్లా కొట్టేవారేనా?

నారా: (ఏమీ మాట్లాడలేకపోతాడు)

రామం: నిజం తెలుసుకోకుండా తొందరపడ్డావు నాన్నా—ఆ వస్తువు తీసింది నేను.

నారా: (ఆశ్చర్యంగా) నువ్వా?

రామం: అవును నాన్నా...నేనే...నా స్నేహితుడి చెల్లెలిని చూడడానికి పెళ్లివారు వచ్చారు! వాళ్లు చాలా బీదవాళ్లు; అందువల్ల పిల్లకి అలంకారంగా ఉంటుందని అడిగితే నేనే ఇచ్చాను, పని అయిపోగానే ఇదుగో మళ్లా తీసుకు వచ్చేశాను. (అంటూ జేబులోంచి చంద్ర హారాన్ని తీస్తాడు).

నారా: మరి నన్నెందుకు అడగలేదురా?

రామం: మీరు ఇంట్లోలేరు...వస్తువు నిమిషాలమీద కావలసి వచ్చింది. మిమ్మల్నడిగేవ్యవధి లేక పోయింది.

నారా: ఎంతపని జరిగింది? అయితే చంద్రహారం తాను తీశానని మీ పిన్ని ఒప్పుకుందే? మీ రిద్దరూకూడా తెలుసుకునే చేశారా ఈ పని?

రామం: లేదు. అదే నాకు అర్థంకావడంలేదు... (శాంతతో) ఈ నేరం నీ నెత్తిన ఎందుకు వేసుకున్నావు, పిన్నీ?

శాంత: చాలు బాబూ...చాలు...ఆ ఒక్క పిలుపు చాలు. అమ్మ అని పిలిపించుకోలేక పోయినా కనీసం 'పిన్ని' అనిపించుకుంటే చాలు. ఆ నగ నీవు తీస్తుండడం చూశాను. అది ఎవ్వరు తీయడమూ మీ నాన్నగారికి ఇష్ట ముండదని తెలిసి, నీవు తీశావని చెబితే, ఆ ఆవేశంలో నిన్నేం చేస్తారోననే భయంతో నామీద పెట్టుకున్నాను.

రామం: (బాధగా) ఎంత మంచి దానవు పిన్నీ! నా కోసం దెబ్బలు తిన్నావా?

శాంత: అదేమిటి నాయనా...బిడ్డలకోసం తల్లి ఆ మాత్రం చేయదా?

నారా: ఒరేయ్ ... చూశావురా...మీ పిన్ని ఎంత మంచిదో! ఆవిడ మీకు సాక్షాత్తూ మాతృ మూర్తిరా...ఆవిడపట్ల మీరు అభిమానంగా ఉండాలిరా.

రామం: నాన్నా...మీకు కోపం రాకుండా ఉంటే ఒక్కటి అడుగుతాను. పిన్నిని అభిమానంగా చూడాలని మాకు చెప్పేమీరు, ఆవిడని

ఎందుకు ప్రేమగా చూడలేకపోతున్నారు? ఆవిడంటే చిరాకుపడుతూ ఎందుకు కొట్టడానికికూడా వెనుదీయలేదు!

నారా: (నిట్టూర్చి) అది నాలోని బలహీనతరా... మీ అమ్మమీద నాకున్న అమితప్రేమవంన మీ పిన్ని అంటే నాకు జుగుప్స ఏర్పడింది. అందువల్లనే తెచ్చిపెట్టుకున్న అభిమానం నటించడం చేతకాక, చిరాకుపడుతుంటాను. అయినా నేను చేసేది తప్పని తెలిసి లోపల బాధపడుతుంటాను. నేను చేయడంకంటె ఇతరులకు చెప్పడం తేలిక కనుక, నన్ను నేను దిద్దుకోలేకపోయినా, మిమ్మల్ని హెచ్చరిస్తుంటాను.

రామం: ఆ...అదే నాన్నా...మీ కొడుకునైనందుకు నాకూ ఆ బలహీనత సంక్రమించింది. అమ్మస్థానంలో మరొక స్త్రీ రావడం సహించలేక విచక్షణారహితంగా ప్రవర్తిస్తుంటాను. నిజానికి పిన్ని మాయందు చూపించే ఆపేక్షలో పదవవంతుకూడా అమ్మ ఎప్పుడు చూపించలేదు. అయినా సవతితల్లి అంటే నాకుగల దురభిప్రాయంవల్ల ఆవిడ ఆపేక్షకి విపరీతమైన అర్థాలు కల్పించి పిన్నిని క్షోభపెట్టాను. నేను చేస్తున్నది తప్పని తెలిసినా ఆ తప్పును దిద్దుకునే సంస్కారం నాలో లేకపోయింది. ఆవిడని బాధపెట్టి మనల్ని మనం బాధపెట్టుకుంటున్నాం.

నారా: మీ అమ్మను మనకు భగవంతుడు దూరం చేశాడు. చల్లనిమనసుగల మీ పిన్నిని అర్థంలేని మన ఆలోచనలతో, చేతులారా మనం దూరంచేసుకుంటున్నాం. మనం రంగుటద్దాల లోంచి చూస్తూ కావాలని నిజాన్ని తెలుసుకోలేకపోతున్నాం. ఇంకకుంచైనా మన పద్ధతులు మార్చుకుని చేతులారా తెచ్చుకున్న ఈ బాధలు తొలగించుకోవాలి.

రామం: మనిషి విలువ మనిషి దూరమైనప్పుడే తెలుస్తుంది. అమ్మలేని లోటు అనుభవిస్తూకూడా, తిరిగి పిన్ని విషయంలో అటువంటి లోటు రానీయకూడదు.

నారా: అవునురా...మన ప్రవర్తన ఇల్లాగేఉంటే పిన్నికూడా మనకి ఎక్కువకాలం దక్కదురా. మీ అమ్మస్థానంలో వచ్చిన ఆమెను, ఆ స్థానం పూర్తిగా ఆక్రమింపజేయాలి. కన్నబిడ్డల్ని కాల్చుకుతినే రాక్షసి తల్లులున్నట్లే, సవతి బిడ్డల్ని సాదరంగాసాకే, చల్లని తల్లులూ ఉన్నారు. ఇవాళ్టినుంచి మన పద్ధతి మార్చుకుని అందరం సుఖంగా ఉండడానికి ప్రయత్నం చేద్దాం.

రామం: అవును నాన్నా.. నా పద్ధతి ఇంక మార్చుకుంటాను. మనలో ఈ మార్పు రావడానికి కారణమైన ఆ చంద్రహారాన్ని పిన్ని మెడలో మీరే అలంకరించండి నాన్నా! (అని శాంతతో) జరిగిన తప్పిదాలకు నేను చాల బాధపడుతున్నాను పిన్నీ.

శాంత: (ఆనందంతో) ఇందులో తప్పిదాలేమున్నాయి బాబూ: నీ బాధ నాకుమాత్రం అర్థంకాదా, నాయనా? నేను మీకు తల్లిలేని లోటుని తీర్చాలనే అహర్నిశలూ ప్రయత్నిస్తున్నాను.

నారా: జరిగిందంతా మరిచిపో...పైకి చెప్పక పోయినా, నీ గురించి లోపల నేనెప్పుడు బాధపడుతూనే ఉన్నాను. అందుకు పరిహారంగా ఈ చంద్రహారాన్ని నా చేతులలో నీ మెడలో వేయనీ.

శాంత:(సిగ్గుపడుతూ) అబ్బ...ఏమిటండీ మీరు మరీనూ. ఇల్లా ఇయ్యండి చాలు.

రామం:కాదమ్మా...నాన్నగారినే వేయనీ.. అప్పుడే నాకు తృప్తిగా ఉంటుంది.

శాంత:(ఆనందాతిశయంలో) బాబూ...ఏదీ...మరో సారి 'అమ్మ' అను...ఆ ఒక్కమాట చాలు బాబు .నాకు...దానికోసం నేను ఏ పనైనా చేస్తాను.

రామం:అమ్మా...మా తప్పులు క్షమించమ్మ.

శాంత : బాబూ...............

నారా: (నెమ్మదిగా)...నా తప్పులూనూ...

శాంత: ఊరుకోండి...మరీ పసివారయిపోతున్నారు.

నారా: కాదా మరి...రోజులు మారాయి గదా...

శాంత: మీతో ఏదన్నా కష్టమే బాబూ (అంటూ ముసిముసి నవ్వుతూ దూరంగా వెళ్లి పోతుంది).

నారా: ఉండు. హారం వెయ్యకుండానేనా...(అంటూ హారం తీస్తుండగా.)

తెర

---



# గ్రంథ విమర్శలు

## 'స మి ధ లు'

### (కవితా సంకలనం)

(సమీకర్త—మురళీధర్, ప్రచురణ — యువ ప్రగతి— వరంగల్—2. ప్రతులకు - యువప్రగతి. ఇ. నెం. 13/284. వరంగల్—2; పుటలు 10+42; వెల. రూపాయిన్నర.)

కొంతకాలంగా కవితాసంకలనాలు ఎక్కువగా వస్తున్న రోజులివి. ముఖ్యంగా వరంగల్లు వీటికి ప్రసిద్ధి. కారణమేమంటే కవులే ఎక్కువగా ఉన్నారని చెప్పవచ్చు. సమీకర్తయైన 'మురళీధర్' కవితతో గూడా ఇంకా సుప్రసిద్ధులైన కొందరు రచయితల కవితలతో మొత్తం 19 కవితాఖండిక లున్నాయి. ఏఒకటీరెండూ తప్పితే మిగతావన్నీ చాలా బాగున్న రచనలు. వచనగేయ సంపూర్ణ ప్రయోజనాన్ని సాధించి అందించిన శ్రీ కాళోజీగారి రచనేగాక, ప్రసిద్ధులైన మాచిరాజు దేవీప్రసాద్, వరవరరావు, నెల్లుట్ల వెంకటేశ్వరరావు, మాదిరాజురంగారావు— వీరి రచనలు సంకలనానికి అందం చేకూర్చినాయని చెప్పవచ్చు. దీనిపేరుమాత్రం కొత్తది. 'ఈ ప్రపంచంలో ప్రతివాడూ జీవితాంతము సమిధయై కాలుతూ నేవుంటాడు,' 'మంచిని ప్రతిష్ఠించుటకై సమిధయై కాలడం మానవతాలక్షణం—అదే మా ఉద్దేశం' అని సమీకర్త తెలుపుతున్నారు. దీనికి తోడు 'ప్రపంచ ప్రగతివాదులకు' అంకితం ఈయబడింది. 'సమిధయై కాలుతూఉంటాడు' అనే బదులు 'సమిధగా' కాలుతుంటాడు అంటే బాగుండేదేమో! దీంట్లో మొదటి కవిత—డా॥ ఉండేల మాలకొండారెడ్డిగారి 'రూపాయి'. పెద్దకవితలో ఇది ఒకటి.

'ఓ రూపాయీ!

నీవు లేకుంటేలేదు హాయి'—

అని ప్రారంభించి చాలా చక్కనిభావాన్ని 'రూపాయి'తో ప్రతిక్షణంగల మానవుని అవసరాన్ని బాగా వివరించారు.

'మానవుల విద్యాప్రావీణ్యం

మానవతుల యౌవనలావణ్యం

కొనగలవు—చేకొనగలవు—నీవు—'

విద్యాప్రావీణ్యతను 'కొనడం' యౌవనలావణ్యాన్ని 'చేకొనడం'అనే రెండు పదాలూ చాలా బాగా అతికించినారు.

ప్రతిమనిషికి ఖరీదు

ప్రతిమనిషి మనీషకు రసీదు

ప్రతిమనిషి మరణానికి దస్తావేజు—

ఇది ఈనాటి రివాజు'—అని ముగిస్తారు.

ఖరీదు, రసీదు—దస్తావేజు, రివాజు, వీటితో పాటు 'ప్రతిమనిషి' లయకు పయోగింపబడేవే! మనీష (బుద్ధి) గలవాడు మనిషి అనబడ తుండవచ్చు. 'మనిషి మనీష' అని వీరంటారు?

'శాంతి కాముకులం'లో పురుషోత్తంగారు—

'మరలా మేం నడుస్తువున్నాం—

'మర'లా మేం నడుస్తున్నాం

మరలా యే దేశంకొరకో

'మర' లా మేం నడుస్తున్నాం—'మళ్లీ మేము నడుస్తూనే వున్నాం—ఆ నడక 'మర'వలె ఉంది— ఇది సైనికుడు—మనకు తెలుపుతున్నట్లు—వ్రాయబడ్డకవిత —

'రాజకీయముల రాక్షసతిండికి

అంతదిన సులం వింత దినుసులం—' అంటూ సైనికుని పక్షాన వకాలత్ పుచ్చుకొని రాజకీయార్భాటాన్ని వివరించడం దీంట్లో గోచరిస్తుంది.

'మేం తప్పితే అడ్డు దొరకదు

మేం తగ్గితే దేశం వగవదు—' అంటాడు సైనికుడు—నిజంగా ఎంతనిజమైన విషయం.

'???' శీర్షికతో కాళోజి ఓ చక్కనిగేయం వ్రాశారు. పెద్దదే,— దాన్ని ప్రతివ్యక్తీ చదివి గ్రహించాల్సిందే!

'గడిస్తున్నజ్ఞానం విజ్ఞానం ఎంతనిగాదు
పోగొట్టుకుంటున్న సామాన్యజ్ఞానం ఎంతని,
ఈలాంటి ఆలోచనాత్మకరచనా ఉంది.

'గెలిచినామా ఓడినామా అన్నదికాదు
ఆట ఎట్లా ఆడుతున్నామా అన్నది ప్రశ్న'—
ఈ విధంగా 'విసురులు' కన్పిస్తాయి.

'ప్రజారాజ్యం' శీర్షికతో పురుషోత్తంగారి రచన ఉంది—దీంట్లో రాజకీయాలను పల్లెల్లో (పట్టణాల్లోనూ) ఎన్నివిధాలా తిడుతారో అంతా వ్రాయబడింది. రాజకీయాలను - సంఘాలను విమర్శించేవారే అందరైతే బాగుచేయవలసినవారు—చేసేవారు ఎవరన్నది ప్రశ్న. ఈ విధమైనవిమర్శ ఒక 'ఫాషన్'గా మారింది. అనేకవిధాలైన భావాలు కల్గించే రచనలు దీంట్లో ఉన్నాయి. పెండ్యాల చినరాఘవరావుగారి 'కాలాశ్వం కళ్లెంలాగకు'లో పాడిందేపాటగా యికిలించి విసిగించే పాచిపళ్లను రాల తంతాను—' అని మహాఆవేశంతో ముందుకు దూకుతూ ఉంటారు

ఎట్లా వ్రాసినా—సంఘాన్ని విమర్శించడమే ధ్యేయంగా పెట్టుకున్న రచన క్షణకాలం ప్రకాశిస్తుందే తప్ప నిలువజాలదు—కాబట్టి కొత్త పద్ధతిలో ఉపదేశాత్మకంగా రచనచేయుడం శ్రేయస్కరం.

శ్రీ మురళీధర్ ఇట్లా అంటారు.
'కవిత్వం ఒక వింతపైత్యం
రమ్మంటేరాదు అందరికీ—.

—శ్రీ రంగాచార్య.

## ప్రేయసి; ప్రియంవద

(నవలికలు;—రచన: ఉషశ్రీ; ప్రచురణ:—యం. శేషాచలం అండ్ కో—మచిలీపట్టణం-మద్రాసు—సికింద్రాబాదు; 168 పేజీలు; వెల. రూ. 2.)

ఎమెస్కోవారు ప్రచురిస్తున్న పుస్తకాలలో నవలికలు తక్కువ—'ఉషశ్రీ' వ్రాసిన 'ప్రేయసి; ప్రియంవద అనే రెండు నవలికలు ఎమెస్కోవారు ప్రచురించినవాటిలో విశిష్టమైనవి. ఉషశ్రీ వ్యుత్పన్నులు. లోకాన్ని పరిశీలించటంలోనూ, పూర్వకావ్యాలను ఆకళించుకోవటంలోనూ ఆరితేరినవారు. సంస్కృత కావ్యాలలోని శృంగారాన్నీ, మనుచరిత్ర, శృంగార నైషధం మొదలైన గ్రంథాలలోని శృంగార సంభాషణలనూ బాగా వొంటపట్టించుకున్నారు. గడుసరిగా తయారైన తెన్గుగు నవలికను నడిపించటానికి పైవాటి పాండిత్యమూ, వ్యుత్పన్నతా అవసరం కాకపోవచ్చు. కాని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారినీ, మల్లాది రామకృష్ణశాస్త్రిగారినీ ఆదర్శంగా యెంచుకొని వచనరచనను మలచుకొన్న ఉషశ్రీ శైలి తెనుగు మీరినది. శ్రీపాదవారి ప్రత్యేకతగా చెప్పదగిన వాకోవాక్య సంభాషణ ఉషశ్రీకి కొట్టినపిండి. దీనినే శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 'టేబిల్ టెన్నిస్' ఆడినట్లు మాట్లాడించటం అంటారు. ఉషశ్రీ నవలికలలోని భావామరదళ్లుకూడ ఆ విధంగానే టకటకా మాట్లాడేస్తారు. మరదళ్లు సరేసరి. మాటలపుట్టలు—జాణతనం, కొంటెతనం వీరి సొత్తు. మాటలు కొట్టిపోయటమే. బావలు దిమ్మరపోవటం జరుగుతుంది. ఐతే ఆ దిమ్మరపాటులో మరువలేని మధురానుభూతికూడ ఉంటుంది.

'ప్రేయసి'లోని కల్యాణలక్ష్మి; 'ప్రియంవద'లోని 'పద్మావతి' యిద్దరూకూడ వింతగా తమ బావలను ప్రేమించినవాళ్లే. ఈ నవలికలలోని బావలిద్దరూ తమతమ మరదళ్లకు చేరువ కాజూచినవారే. అందినట్లే చేరువై ఆ మరదళ్లిద్దరూ తమ బావలకు దూరంగా జరిగి తమ వ్యక్తిత్వాన్ని నిలుపుకుంటారు. తెలుగుదేశంలోని బ్రాహ్మణ కుటుంబంలో వినవచ్చే మరదళ్ల ఛలోక్తులను చక్కగా ఆకళించుకొని తమ రచనలో జొప్పించారు. ఈ ఛలోక్తులు కొంతవరకు వాస్తవం కావచ్చునేమోగాని, వారి ప్రవర్తన చాలవరకు అవాస్తవికమే. వాళ్లను కాలాతీత వ్యక్తులుగా పరిగణించటం కొంతవరకు సబబేమో! 'కథ చదవడానికికాక జీవితం తిరగెయ్యడానికి చదవండిది' అని రచయిత మనవిచేసినప్పటికీ యీ రచనలలోన్ని జీవితాలు అరుదైనవి—అరుదైతేనేం! సర్వ

సృష్టి ప్రేమబంధితం కావాలనే సత్సంకల్పంతో వ్రాయటాన, సంభాషణలు రసవంతంగా సాగటం వలనా, కొన్నిచోట్ల సంభాషణలు హద్దు మీరినా, చురుక్కుమనిపించినా జీవంగల రచనగా 'ప్రేయసి'ని ఎన్నిక చేయవచ్చు. ఈ కథలోని కళ్యాణలక్ష్మి తన బావకు మానసికంగా ఎంతో చేరువౌతుంది. కాని తన తండ్రిమనస్సు నొప్పించటం యిష్టంలేకా, తన వెర్రిబాగుల అక్కయ్య మంచితనాన్ని దోచుకోవటానికి మనసొప్పకా తనకుతానే దూరంగా జరుగుతుంది. తర్వాత వాళ్ల అన్నయ్య స్నేహితుడు రమనాథం అనే కవితో పరిచయం ఏర్పరచుకొంటుంది. మనస్పర్థలతో విడిపోయిన రామనాథంభార్యను గురించి తెలుసుకొని, రామనాథాన్ని చూచి జాలిపడి అతడి కళాకౌశలానికి ముగ్ధురాలై, తనలోని కళాభిరుచికి మెరుగులు దిద్దుకుంటూ క్రమంగా అతనికి చేరువౌతుంది. చివరకు రామనాథం భార్య స్థానాన్ని తానే ఆక్రమిస్తుంది. ఈ విధంగా చేసి ధైర్యంగా తండ్రికి అన్ని విషయాలూ తెలియపరుస్తూ ఉత్తరం వ్రాస్తుంది. ఆయనభార్య తిరిగివస్తే నిర్విచారంగా ఆమె స్థానాన్ని ఆమెకిస్తానంటుంది. కళ్యాణలక్ష్మి తండ్రి సీతారామశాస్త్రిగారు ఎంత నైష్ఠికుడో అంత సంస్కార పరాయణుడు. ఎంతటి సనాతనమైన అభిప్రాయాలున్నవాడో అంతగా ఆధునికతను జీర్ణించుకున్నవాడు. 'మనం బ్రతుకుతున్న సమాజానికి అనుకూలంగా మనం మారలేకపోతే ఎంత మేధావులమూ, సంపన్నులమూ అయినా నవ్వులపాలవుతా'మని గుర్తించినవాడాయన. సంస్కృత సాహిత్యాన్ని జీర్ణించుకున్నట్లే వ్యావహారికాన్నీ అర్థం చేసికొని 'వేదానికే కాదు స్వరం ఉంట, వ్యావహారికానికీ ఉంది—మరి స్వరం' అంటారాయన. అటువంటితండ్రి కాబట్టే మనుష్యుల మనస్తత్వాలను బాగా చదివి ఉండబట్టే తన కుమార్తె లక్ష్మికి 'జీవితంలో ఏ పని చేసినా తప్పులేదు. అయితే ఆ పని జరిగాక యిది ఎందుకు చేశానా అని పశ్చాత్తాప పడకపోతే చాలు—' అని వ్రాసి 'మమకారం ఉంది చూశావా తల్లీ—అది మహ చెడ్డదమ్మా. ఆ బంధంనుంచి బైటపడలేం. ఆ మమకారబంధం ఒక్కటే మన జాతిని, మానవ జాతిని సర్వనాశనం కాకుండా ఉంచుతున్నదమ్మా: అందుచేత ఆయన భార్య తిరిగివచ్చిన క్షణంలో విడిచిరాగలనని అనుకోకు' అని సలహా యిస్తాడు. ప్రేయసి నవలిక ఆలోచనల్ని రేకెత్తిస్తూ, కమ్మని నుడికారంగల కండగలిగిన భాషతో పాఠకులను ఒక్క ఊపున చదివిస్తుంది.

ప్రియంవద నవలికలోని పద్మావతి తన బావ శంకర్రావును తన ఆరాధ్యమూర్తి గావించుకొంటుంది. మూర్తీభవించిన చైతన్యం పద్మావతి. రచయితే చెప్పుకొన్నట్లు పద్మావతి శాకుంతలంలోని ప్రియంవదను జ్ఞాపకానికి తెస్తుంది. ఎమ్మే పాసై ఉద్యోగానికని వచ్చిన శంకర్రావుకు బాధ్యతలు వప్పచెప్పి, తన కుమార్తెల సంరక్షణాభారం అప్పగించి సన్యాసం స్వీకరిస్తాడు రాఘవయ్యగారు. శకుంతలను పెళ్లిచేసి కొన్న శంకర్రావు మరదలు పద్మావతిలోని చైతన్యానికి వివశుడై ఆమెలేనిదే జీవితం లేదనుకుంటాడు. కాని బాగా ఆలోచించి 'తనకు భార్యగా ఉండతగ్గది శకుంతలే కాని పద్మావతి కాదేమో? పద్మావతి ప్రియురాలిగా ఉండతగినదేగాని భార్యగా ఉండి సుఖపెట్టలేదు.' అని అనుకుంటాడు. అలాగే పద్మావతికూడా 'నాబోటివాళ్లు ఇలా ఉండిపోవలసిందే. ప్రపంచంతో ఆడుకోవాలని, నిత్యవసంతాన్ని అనుభవించాలని, జీవితాన్నే గాలిపడగలా ఎగరవెయ్యాలని అనుకునే వాళ్లం మేము.' ఈ గాలిపటాలను ఎవరి చేతిలోనూ ఉంచమనీ, యిలాగే ఉండిపోతాననీ నిశ్చయించుకొంటుంది. పద్మావతి యీ కథలో నాయిక కాదు. కాని పద్మావతి లేనిదే కథలేదు. ఈ కథను నడిపించటంలో ఉషశ్రీ ప్రదర్శించిన నేర్పు బాగున్నది. ప్రతిమలుపులోనూ చమత్కారం ఉన్నది. జీవిత కథకు సొగసుండాలంటే 'కొంత వంకర ఉండాలి. అది అందంగా ఉండాలి. అందీ అందకుండా ఉండాలి—కథలో మలుపులా' అంటుంది పద్మావతి. కథలోని మలుపులన్నీ అందంగా ఉన్నాయి.

రాఘవయ్యగారి వేదాంత ధోరణిలోని గంభీరమైన అర్థాలు ఉషశ్రీ శైలిలో తెనుగుదనాన్ని నింపుకొని నిండుగా ఉన్నాయి.

'ఉషశ్రీ' రచనలలో చెప్పదలచుకొన్నది ఆయన

కున్న బహుకావ్యపరిచయంవలన, తెనుగు నుడికారం మీదగల అధికారంవలనా చక్కగా చెప్పగలిగారు. ఇందులో ఉన్నకథలు లోకప్రీతిని కాలదన్నుతున్నాయి. కొంతమందికి అవినీతి కథలుగాకూడ తోచవచ్చు. సంభాషణలలో శృంగారం మితిమీరి పోవగిపుకూడ కలిగించవచ్చు. కొన్నిచోట్ల శబ్దాలతో చేసిన గారడీ, మొదట చమత్కారమనిపించినా పోను పోను చీకాకు కలిగిస్తున్నది. శైలిమాత్రం శక్తివంతమైనది కావటంవలన బాగా చదివిస్తుంది. అంకిత మిద్దామనుకొని యీ పుస్తకాన్ని 'పుచ్చుకున్నవారు బతికినంతకాలమయినా ఉండనిదాన్ని ఎవరికిచ్చి ఏం ప్రయోజనం—' అన్నారు. అంకితము మా కెలా ఉన్నా యీ పుస్తకం చదివినంతసేపూ మంచి కాలక్షేపాన్ని యిస్తుంది.

## క వి ద్వ య ము

(నవల; రచన; శ్రీ నోరి నరసింహశాస్త్రి; ప్రచురణ; యం. శేషాచలం అండ్ కో — మచిలీపట్టణము—సికింద్రాబాదు—మద్రాసు; 184 పేజీలు వెల. రూ. 2.)

చారిత్రక నవలారచనలో కీ. శే. అడవి బాపిరాజు గారి తరువాత చెప్పుకోదగినవారు నోరి నరసింహశాస్త్రిగారు. ముఖ్యంగా ఆంధ్ర కవి జీవితాలను నవలలుగా రచించటంలో తెలుగు రచయితలలో వీరిదే అందెవేసినచేయి. భాషావైదుష్యానికి చారిత్రక విజ్ఞానం తోడుకాగా వీరి చారిత్రక నవలలు మన సాహిత్యంలో విశిష్టస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. నారాయణభట్టు, మల్లారెడ్డి, కవిసార్వభౌముడు, ధూర్జటి (ఇంకా పుస్తక రూపాన్ని పొందినట్లులేదు) వంటి నవలలు వీరికి కీర్తిని సంతరించి పెట్టాయి. వీరి 'రుద్రమదేవి' నవల భారతీయ భాషలన్నింటిలోనికి అనువాదం పొందే అదృష్టానికి నోచుకొన్నది. కథారచయితగా, నాటికా రచయితగా, కవిగా, వాఙ్మయపరిశోధకునిగా, బహుముఖప్రజ్ఞావంతులైన నోరి నరసింహశాస్త్రిగారి కలం చారిత్రకనవలారచనలో నిగ్గుదేరింది. సాహితీ సమితి సభ్యునిగా ఆధునికాంధ్రకవిత్వానికి బాసటగా నిలిచిన తొలితరం కవులలో వీరొకరు. అయాకవుల కావ్యాలను బాగా జీర్ణించుకొనిఉండటంచేత, వీరి వచన రచన పూర్వకవుల పద్యాలను పొందికగా కూర్చి నదిగాఉండి చదువరులకు హృద్యంగా ఉంటుంది.

శ్రీనాధ మహాకవి జీవితాన్ని యిదివరకే 'కవి సార్వభౌముడు' నవలలో చిత్రించినా, యింకా తనివి తీరక ఆ మహాకవి జీవిత చరమదశను, పోతన మహాకవితోడి సాన్నిహిత్యాన్ని, భాగవత రచనకు పోతన మహాకవిని ప్రోత్సహించటాన్ని యితివృత్తంగా తీసుకొని 'కవిద్వయము' అనే నవల రచించారు శ్రీ నరసింహశాస్త్రి. శ్రీ శేషాచలం అండ్ కోవారు ప్రచురిస్తున్న నవలల్లో శ్రీ విశ్వనాథవారి నేపాలరాజవంశ నవలామాలికను మినహాయిస్తే శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి కవిద్వయమే చారిత్రక నవలగా గణనీయమైనది. శ్రీ విశ్వనాథవారు భారతీయ పురాణాలు, యితిహాసాలమీద ఆధారపడినంతగా శాసన సంబంధమైన చారిత్రకాధారాలతో తమ నవలలను రచించటం లేదు. కాని నోరి నరసింహశాస్త్రిగారుమాత్రం చరిత్రపరిశోధకులచే వెలికి తీయబడిన చారిత్రక ప్రమాణాలనే ఆధారంగాగైకొని కల్పనను జోడించి హేతుబద్ధంగా ఉండేటట్లు సరిచూచుకొని తమ నవలలను వెలువరిస్తున్నారు. చారిత్రక యథార్థాలను, నవలశిల్పాన్ని ఒక్కచేతిమీదుగా కలగలపి నవలను వ్రాయటం కత్తిమీది సాము. చారిత్రక ప్రమాణాలను మార్చి వ్రాస్తే పరిశోధకులు కల్లెత్తి చేస్తారు. వాటిని యథాతథంగా గుదిగుచ్చితే చదువరులు పెదవి విరిచి చప్పరిస్తారు. కల్పనలను సాగదీస్తూపోయి చారిత్రకాధారాలను విడిచినట్లైతే అవి అభూతకల్పనలయిపోతాయి. వీటన్నిటికితోడు తాను నేర్చిన నవీన విజ్ఞానాన్ని గత కాలానికి మళ్లించి ఆ కాలంలో యీ విజ్ఞానం ఉన్నట్లుగా వ్రాస్తే నవల అభాసుపాలవుతుంది. చరిత్రకు కల్పనను జోడించినా 'కవిద్వయము' నవల చారిత్రకాధారాల నెక్కడా త్రోసిరాజన లేదు.

శ్రీనాథ పోతన లిరువురూ బావమఱదులు కానేకారని చారిత్రక పరిశోధకులు ఘంటాపథంగానే చెప్పుతున్నారు. శ్రీనాథుని బావమఱది పేరు దగ్గుపల్లి దుగ్గన. ఈ బాంధవ్యాన్ని శంకించటంతోపాటు

కొందఱు శ్రీనాథ పోతన లిరువురూ సమకాలికులు కూడ కారని శంకిస్తున్నారు. కాని లభించిన చారిత్రక, వాఙ్మయాధారాలనుబట్టి పరిశీలించితే నరసింహశాస్త్రిగారూహించినట్లే శ్రీనాథుని చరమదశలో అతడికంటె పిన్నవయస్కుడిగా పోతన ఉండి ఉండటానికి వీలున్నది వారిద్దరూ కలుసుకోవటమూ, శ్రీనాథుఁడు పోతనను భాగవతాంధ్రీకరణకు ప్రోత్సహించటమూ స్వతంత్రించి రచయిత చేసిన కల్పనములే. శ్రీనాథ పోతన లిరువురూ నియోగులా కాదా అనే వ్యర్థవివాదాన్ని నరసింహశాస్త్రిగారు త్రోసిపుచ్చి ఆయామహాకవుల మతదృక్పథాలను సమన్వయం చెయ్యటానికి ప్రయత్నం చేశారు.

శ్రీనాథుఁడు వయసుమళ్లినపిమ్మట చేసిన శ్రీశైలయాత్రతో యీ నవలను ప్రారంభించారు. ఆ యాత్రలోనే పోతన సకుటుంబంగా మ్రొక్కుబడి తీర్చుకోవటానికివచ్చి శ్రీనాథుని ఆతిథ్యాన్ని పొందుతాడు. శ్రీశైలయాత్రలోనే శ్రీనాథ మహాకవి శివరాత్రిమాహాత్మ్యము కృతిని ప్రారంభించి పూర్తి చేసి ముమ్మడి శాంతయ్యకు అంకితం చేస్తాడు. శ్రీశైలయాత్రలోనే పోతన కవిత్వాన్ని మెచ్చుకొని, అతడిని సహజపాండిత్యునిగా సంభావించి భాగవతాంధ్రీకరణకు పూనుకోమని సలహా యిస్తాడు. అప్పటికే శ్రీనాథుఁడు హరవిలాసము, భీమేశ్వరపురాణము, కాశీఖండము అనే కృతులు వ్రాశాడు. శ్రీశైలంలోనే శ్రీనాథుఁడు పోతనను 'ఆ కృష్ణపరమాత్మ అంశ ఏమాత్రమో ఉన్నవాడవు'అని మెచ్చుతాడు. ఇంకా పోతన వ్రాసిన 'రవిబింబం బుపమింప'అనే పద్యాన్ని చదివి 'శంభుదాసుడు వ్రాసిన పద్యానికి మెరుగుపెట్టినావు. ఆయన హరివంశములోనూ, నృసింహావతారములోనూ సంక్షేపంగా వ్రాసిన భాగాలేనోయీ భాగవతమంతా. నీవే భాగవతము వ్రాయవలె—'నంటాడు. నరసింహశాస్త్రిగారికి ఎఱ్ఱయ మహాకవిపట్లగల గాఢమైన అభిమానాన్ని యిక్కడ శ్రీనాథ మహాకవికికూడ ఉన్నట్లుగా వ్రాశారు. ఎఱ్ఱయపట్ల శ్రీనాథునికి పూజ్యభావముండున్నా పైజెప్పినట్లుగా ఉండటం మాత్రం సందేహాస్పదం. శ్రీనాథుఁడు పోతనతో తన బొడ్డుపల్లి అగ్రహారపు వ్యవసాయం గుఱించికూడ ముచ్చటిస్తాడు. పోతన నేర్పరియైన వ్యవసాయదారునిగా పైరుమీదనే అమ్ముకోవటం మంచిదని శ్రీనాథునికి సూచిస్తాడు. శ్రీనాథుఁడు దానిని చెవినిపెట్టి బాగా నష్టపోయి కష్టదశను పొందుతాడు. శ్రీశైలంనుండి తిరిగివస్తూ మాచర్లలో మజిలీచేసి చెన్నకేశవుని కొలిచి, వీరగాథలను విని పులకితుడై, భగవదాజ్ఞా ప్రేరితుడై పలనాటి వీరచరిత్రలో బాలచంద్రుని యుద్ధమును ద్విపదగా చెప్పి, ఆంధ్రభాషను ధన్యురాలినిగా చేస్తాడు. బొడ్డుపల్లి అగ్రహారంలో వ్యవసాయం పాడయిపోయి కృష్ణముంపువలన, పశులవలన, చోరులవలన అపారంగా నష్టపోయినా శ్రీనాథుఁడు ఏడునూరుల టంకాలను చెల్లింపగలడనీ, దుబాసీగా ఓఢ్రుల కొలువులోఉన్న నాగయ్య అనే బ్రాహ్మణుడు పూర్వవైరాన్ని మనస్సులో పెట్టుకొని కుట్రచేసి శ్రీనాథుని కష్టాలకు కారకుడైనట్లుగా కల్పించారు. కాని దీనికి తగినంత చారిత్రకాధారం లేదు. దుబాసీ నాగయ్యవంటి కల్పితమైన దుష్టపాత్రమీదికి పొద్దును నెట్టివేయటం సులువేగాని దానివలన చారిత్రక నవల ప్రయోజనం దెబ్బతింటుంది.

కష్టదశలో శ్రీనాథుఁడు తలపోసినట్లుగా తెలుగు ప్రజలు చిరకాలంగా భావించే 'కవిరాజకంఠంబు కౌగలించెను గదా పురవీధి ఎదురెండ బొగడదండ' అనే పద్యాన్ని నరసింహశాస్త్రిగారు విచిత్రంగా మార్చేశారు. దీనిని శ్రీనాథుడు చెప్పనేలేదనీ, ఆయనదుస్థితిని చూచిన కొందరు కవులు తలకొక మాటగా యీ పద్యాన్ని పలికారని కల్పించారు. ఈ కల్పనమేమీ బాగాలేదు. శ్రీనాథకవి ముద్రతో ఉన్న యీ పద్యాన్ని మరెవరో పలికారని చెప్పటం అసందర్భం. 'ఎట్లు చెల్లింతుటంకంబు లేడునూర్లు' అనే పాఠంకూడా ఉండగా పై కల్పన పూర్తిగా అనవసరం. అట్లాగే శ్రీనాథుడు మరణానికి పూర్వం పలికినదిగా అందరూ తలంచే—

'దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ
అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి !'

అనే పద్యాన్ని దుగ్గన, పోతన లిరువురూ చెరొక పాద

ముగాచెప్పి వాపోయారనటమూకూడా అసందర్భమే. శ్రీనాథ చాటువులుగా ప్రసిద్ధిపొందిన పై పద్యాలను, తగినంత చారిత్రకాధారాలబలం లేకుండా, నవలారచయితగా స్వతంత్రకల్పనములుచేసే అవకాశమున్నదిగదాయని శ్రీనాథునివి కావని, యితరులు చెప్పినవని వ్రాయబూనటం సాహసమనక తప్పదు.

'అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి' అనే మాటల నాధారం చేసికొని నరసింహశాస్త్రిగారు శ్రీనాథుడు 'మహాప్రస్థాన'మనే వైదిక కర్మమార్గాన తనువు త్యజించి ఉంటాడని ఊహించటం చాల బాగున్నదిగాని దానికికూడా యింకేదైనా చారిత్రకాధారం లభిస్తేనేగాని మరింతగా విశ్వసింపలేము.

పోతన తండ్రి మరణవృత్తాంతమూ, పోతన అన్న తిప్పన్న జంగమదేవర నాశ్రయించి వీరశైవ దీక్ష స్వీకరించి, తన తండ్రి వ్యాధిని శైవదీక్షా స్వీకారంవలన కుదర్చాలనుకోవటమూ, ఆ వ్యాధి నయముకాక ఆయన మరణిస్తే తిప్పన దహనంచేయటానికి, కర్మలు చేయటానికి అంగీకరించక, ఎవరెంత చెప్పినా వినక కంసాలివారిసాయంతో ఖననం చేయించాడని వివరించారు. శివలింగధారణమనేది ఆనాటి బ్రాహ్మణకుటుంబాలలో ఎటువంటి భేదాలను సృష్టించిందో, అవి ఎంతవరకు దారితీశాయో సుదీర్ఘంగా వివరించారు ఈ నవలలో 'భాగవతావతారికలో గూఢముగా స్పృశించిన మాటలు ఆధారము చేసుకొని స్మార్తాచారము అవలంబించే ఒక కుటుంబములో ఒకరిద్దరు వ్యక్తులు లింగధారణము చేస్తే, ఎంత కుటుంబకల్లోలానికి దారి తీస్తుందో' ప్రదర్శించారు. 'అటువంటివే ఇంకా ఎన్నోభేదాలు మన మూహించవచ్చు'నని రచయిత అంటున్నారుగాని యీ ఊహాలవలన నవలకు మేలుకన్న కీడే ఎక్కువ జరుగుతుంది. అసలు విషయం మరుగునపడిపోయి మరేదో శాఖాచంక్రమణం చేసినట్లవుతుంది. పోతన వ్యక్తిత్వాన్ని గౌరవించబోయి అతడి సోదరునిపై మరేదో నింద నారోపించినట్లవుతుంది. లింగధారణము తెచ్చిపెట్టిన కల్లోలాలను వివరించటానికే యీ నవలలో ప్రముఖస్థానం కల్పిస్తే అస్సలు చెప్పదలచుకొన్న చారిత్రక నవల విషయం వెనుకపడుతుందని గమనించాలి.

తమ వ్యక్తిగతమైన అభిప్రాయాలను చారిత్రక నవలలోని వ్యక్తుల కాపాదించటంవలన నవలకు ఒక్కొక్కప్పుడు తీరనిఅపచారం జరుగుతుంది. ఎఱ్ఱయ కవిత్వంపట్ల శ్రీనాథుని అభిప్రాయమూ, లింగధారణమువలన పోతన కుటుంబములో ఏర్పడిన కల్లోలమూ, శ్రీనాథుని దారిద్ర్యం నిజమైనదికాదు కుట్రయేననటమూ వంటి కొన్ని విషయాలు 'కవిద్వయము' నవల గొప్పదనాన్ని పెంచేవిగాలేవు. ప్రజ్ఞావంతులు చారిత్రక నవలలలో మిథ్యాపవాదాలు కల్పిస్తే పామరులు ఆ పెడత్రోవనే నడుస్తారని నరసింహశాస్త్రిగారివంటి విజ్ఞులు గుర్తించాలి.

—రామమోహనరాయ్.

## అదృష్టరేఖ

(నవల)

(రచన: శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి, ప్రచురణ—యం. శేషాచలం అండ్ కంపెనీ. మద్రాసు—మచిలీపట్నం—సికింద్రాబాదు. వెల రెండు రూపాయలు—పేజీలు 237.)

శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి స్వర్గీయ బుచ్చిబాబు అర్ధాంగి. వీరు కథలు వ్రాసారు. కథారచనలో నూతనత్వం చూపించక పోయినా మొత్తంమీద సుబ్బలక్ష్మిగారు తన కథలతో పాఠకులను ఆకర్షించారు. రచనలో దేశీయత అధికంగా కన్పిస్తుంది. రచయిత్రికి కథారచనలో మంచి ఉత్సాహం ఉండటంచేత ఎక్కువగా కథలే వ్రాసారు.

'అదృష్టరేఖ' నవలారచన ప్రథమ ప్రయత్నం. దీనిని నవలగా వ్రాసే దానికంటె క్లుప్తంగా కథగా వ్రాసియుంటే బాగుండేది.

ఆంధ్రదేశంలో కొంతకాలం క్రిందటి వైవాహిక వ్యవస్థను ఆధారం చేసికొని నాటి మధ్యతరగతి ప్రజల పెళ్ళిళ్ళు, వారి ఆచారాలు, సంప్రదాయాలు వివరించారు. రచయిత్రి పరిశీలనచే ఆయా ఘటనలను నవలలో చూపించారు. పునరుక్తి ఎక్కు

వగా ఉన్నది. అంతేగాక నవలలో ఎక్కువ పాత్రలను ప్రవేశపెట్టారు. అన్నిపాత్రలు కథ కవసరంగాదు.

రచయిత్రి అద్యతన ప్రపంచంనుండి ఆణిముత్యాలు గ్రహించి వాటికి తగిన రూపకల్పన చేసివుంటే నవల పదిమందిని ఆకర్షించేది. కాని కథలో కాన్పించే వరలక్ష్మియొక్క గస్యం అర్థం కానీయకుండ చేశారు. ఈ పాత్రకు తగిన ప్రాముఖ్యం నవలలో చూడలేం.

శ్రీమతి సుబ్బలక్ష్మిగారికిది ప్రథమ ప్రయత్నం గావటంచేత కథాకథనంలో అవరోధాలు కలిగాయి. మరి రచనలో యిట్టి అవరోధాలను అధిగమించి మంచికథతో మంచి నవలలు వ్రాసి తెలుగు నవలా ప్రపంచానికి అందిస్తారని భావింపవచ్చును.

## జై జవాన్

(కర్త: యద్దనపూడి సులోచనారాణి; ప్రచురణ: ఎమెస్కో (పాకెట్‌సైజు); మద్రాసు - మచిలీపట్నం—సికింద్రాబాదు. ధర రెండు రూపాయలు—పేజీలు—150.)

'జై జవాన్' యద్దనపూడి సులోచనారాణి రచన. ఇది యుద్ధరంగానికి సంబంధించినది. అంతయు యుద్ధరంగవిశేషాలను వివరించుటచేత చరిత్రలా ఉన్నది. 'ఆత్మీయులు' వీరు వ్రాసినదే. అందులో కథకు ప్రాధాన్యమున్నది. అందలి కథలో ఆవేశం, ఉత్సాహం, కరుణ ఉన్నాయి. ఇందులో అట్టివి చూడలేము. అంతేగాక కథకు స్థానంలేకుండా పోయింది. రవి యుద్ధరంగంలో ప్రవేశించి ప్రతాపం చూపాడు. ఆ ప్రతాపానికి ప్రతిగా బిరుదు సంపాదించాడు. రవి తన విధి ననుసరించి యుద్ధం సాగించాడు. అందరిచేత శభాష్ అనిపించుకొన్నాడు.

లిల్లీ—బాబుల జీవితచిత్రణ చక్కగా వున్నది. సుందరమ్మ-నరసింహారావుకు బాబు ఒక్కడే కొడుకు. లక్షలు తీసుకొనివస్తాడనుకొన్న కుమారుడు మోసపోయాడు, మోసపుచ్చాడు. ఇకను లిల్లీకి సుందరమ్మకు యుద్ధం ప్రారంభమయింది. సుందరమ్మ ఓడిపోయింది. లిల్లీ జయం సాధించింది. పరజాతి వ్యామోహం వలన కలిగే పరిణామము లిల్లీ మాటలవల్ల సులోచనారాణి చూపించారు. వా రుపయోగించిన సంభాషణ నవ్వు పుట్టిస్తుంది. నరసింహారావు దేశద్రోహియని కుమారుడు పేపరులో ప్రకటించుటతో లిల్లీతో బాబుకు వివాహమయ్యింది. అత్త అధికారాన్ని కోడలు భగ్నం చేసింది. మోసం మోసం అని అరచినవారే మోసం చేయుటకు ప్రయత్నించి తగిన ప్రతిఫలాన్నే పొందారు.

సుజాత, కస్తూరి మొదలైనవారు వారు చేయవలసిన కర్తవ్యం చేసారు.

—రామమోహన్.

## మాలతి

కీట్సు 'ఇసబెల్లా' ఆధారంగా రచించిన గేయ కావ్యం. రచయిత—శ్రీ యేరూరు సీతారామశర్మ, పుటలు—60. వెల— రూపాయి. ప్రాప్తిస్థానం—శ్రీ వై. సీతారామశర్మ, హెడ్‌మాస్టర్, స్నేహా మెమోరియల్ మునిసిపల్ హైస్కూలు, ఆదోని.

ఈ కావ్యానికి ఆశీస్సు వ్రాసిన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు అన్నట్టు "పద్యరచనలోపడి తిరిగిన చేయి మాత్రమే గేయకవిత్వాన్ని యింపుగా వ్రాయగలుగుతుంది." శ్రీ సీతారామశర్మ ఈ కావ్యాన్ని నూతన గేయ ఫణితిలో నడిపించారు. మచ్చుకు—

"మాలతీ మదిరాక్షి
నవయౌవనారంభ
వేళలో చిత్తంబు గలగ ఎల్లగ-
లులు రేగ నుయ్యాలలూగే యరుణాబ్జ
తరుణు లుదయార్కు మొగమెత్తి
చిరునవ్వున
వ్వెడు నట్టి కాలాన కాసారమునుజేరి—"

## ఆంధ్ర పుష్పబాణ విలాసము

సంస్కృత పుష్పబాణ విలాసానికి అనువాదం. ఎడమవైపు సంస్కృతమూ, కుడివైపు తెనుగు పద్యాలు ముద్రించబడ్డాయి. అనువాదకుడు—శ్రీ మల్లాది లక్ష్మీపతిశాస్త్రి, పుటలు 64. వెల: 1-50. ప్రాప్తిస్థానం—శ్రీ మల్లాది లక్ష్మీ

వతిశాస్త్రి, గోరంట్ల అగ్రహారం, అందుకూరుపోస్టు సత్తెనవల్లి తాలూకా, గుంటూరుజిల్లా.

రంజని ఐదవ వార్షిక సంచిక

ఆంధ్రప్రదేశ్ ఎ. జి. ఆఫీసు తెలుగు సాహితీ సమితి త్రైమాసిక పత్రిక పంచమ వార్షిక సంచిక. పుటలు—88: దీనిలో హైదరాబాద్‌లోని ఆధునిక ప్రముఖ సాహిత్యకారుల రచనలున్నాయి. ప్రాప్తి స్థానం—ఎ. జి ఆఫీసు, తెలుగు సాహితీసమితి, హైదరాబాద్—4.

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

పుస్తకాలు

గాంధి సాహిత్య ప్రచురణాలయం, (చిక్కడపల్లి, హైదరాబాద్—20.) ప్రచురించిన పుస్తకాలు మా కార్యాలయం చేరాయి.

గాంధీతత్వం - మూలం: శ్రీ సి. రాజగోపాలాచారి అనువాదం: శ్రీ అడపా రామకృష్ణరావు, పుటలు 52. వెల: 75 పైసలు

జాతి నిర్మాత గాంధీజీ—మూలం: శ్రీ ప్యారే లాల్, అనువాదం: శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు పుటలు—108. ధర: 1—60.

నీతి ధర్మము—మూలం: గాంధీజీ, అనువాదం: శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు. పుటలు—38 వెల: 60 పై.

దేశికుడు గాంధీజీ—మూలం: శ్రీమతి ఆశా దేవి ఆర్యనాయకం. అనువాదం: శ్రీ ఊట్ల కొండయ్య పుటలు—60 వెల—90 పై.

ఆధునిక ప్రపంచంలో గాంధేయ కార్య విధానములు—మూలం:శ్రీ ప్యారేలాల్,అనువాదం—శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు పుటలు—104. వెల 1—50.

గాంధీ తత్వం, గాంధీ దృక్పథం—మూలం: శ్రీ కె. ఎం. మున్షీ, అనువాదం—శ్రీ క్రొవ్విడి వేంకట రమణరావు. పుటలు—52. వెల: 80 పై.

నే నెరిగిన మహాత్మా గాంధి—రచయిత: శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య. పుటలు—130. వెల: 2—00.

బాపూజీ జీవితములోని కొన్ని సంఘటనలు—మూలం: శ్రీ కాకాకలేల్కర్, అనువాదం: శ్రీ నండూరి వేంకటకృష్ణమాచార్యులు. పుటలు 214, వెల—3—00.

శాంతి నికేతన యాత్ర—మూలం—శ్రీ ప్యారే లాల్, అనువాదం—శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు. పుటలు—42. వెల—75 పై.

మార్గదర్శి గాంధీజీ— మూలం: శ్రీ ఆర్. ఆర్. దివాకర్, అనువాదం: శ్రీ అడపా రామకృష్ణరావు. పుటలు—70. వెల: 1—00.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.